# పీఠిక.

---

పుణ్యభూమియైన ఈ భరతఖండమునందు, లోకానుగ్రహార్థమై శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులవారు అవతరించి, జ్ఞానోపదేశముకొరకు రచియించిన అనేక గ్రంథములలో, ఒక్కటియైన ద్వాదశమంజరియను గ్రంథంబునందు:—

గేయంగీతానామసహస్రమ్।
ధ్యేయం శ్రీపతిరూపమజస్రమ్।
నేయంసజ్జనసంగతిరనిశమ్।
దేయందీనజనాయచవిత్తమ్॥

అనగా భగవద్గీతలను, శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమును, సద్గురుమూలకముగా లెస్సగా తెలిసికొని, పారాయణము చేయవలెను; శ్రీమన్నారాయణమూర్తి దివ్యస్వరూపమును, ఆచార్యోపదేశానుసారముగా, హృదయమందు ధ్యానము చేయవలెను; సత్పురుషులసహవాసము

ఎల్లప్పుడును చేయదగినది, బీదజనులకు ద్రవ్యము ఇవ్వవలయును, అని అనుగ్రహించియున్నారు.

ఉపనిషత్సారమైన శ్రీభగవద్గీతలనెడు మోక్షగ్రంథము గీర్వాణమందుండుటచేత, తద్భాషా పరిజ్ఞానము లేనివారలకు, దాని తాత్పర్యము పండితులసహాయము లేకనే. తెలిసికొనుట అసాధ్యముగానే, ఈఉత్కృష్టగ్రంథము సులభముగా బోధయగుటకును. పారాయణము చేయుటకును, అందరికి అనుకూలముగా ఉండునట్లు, మూలశ్లోకములు ఒకప్రక్కను, ఆయా శ్లోకములకు తెనుగు తాత్పర్యము మరియొకప్రక్కను, ముద్రింపబడియున్నది.

పాండిత్యము లేనివారికి, సులభముగా బోధయగుటకై, ఈపుస్తకము వ్రాయబడినది గనుక, పండితులు ఇందలి తప్పులను క్షమింపవలయును.

# రెండవ కూర్పునకు
# పీఠిక

---

మొదటికూర్పులో అచ్చువేసినప్రతులన్నియు, అతి స్వల్పకాలములో సెలవై పోయినందున, ప్రతులనుపంప మని దూరదేశములోనుండి కోరెడువారికి, ప్రతులు పంపుటకు లేకయున్నది.

కర్మభూమియైన ఈభరతఖండంబునందుండు జనులు, సత్పురుషులగుటచే, మోక్షప్రదమైన శ్రీభగవద్గీతయను ఉద్గ్రంథమును, ఇంత ఆదరణ చేయుచున్నారు.

మొదటికూర్పునందు అచ్చువేసినప్రతులలో, దోష ము లనేకములుండియు, వాటిని మన్నించి అతి స్వల్ప కాలములో పుస్తకమును రెండవపర్యాయము ముద్రించు నట్లు వీలుకలిగినది, దానిని ఆదరణచేసినవారి మహా త్మ్యమేకాని, ఇతరముకాదు.

శ్రీ భగవద్గీతార్థసంగ్రహము రెండవ పర్యాయము అచ్చువేయునపుడు, మతత్రయభాష్యార్థముతో అచ్చు వేయునట్లు ఉద్దేశము గలిగియుండెను. అయితే, అతిస్వల్ప కాలములో రెండవకూర్పునకు అవశ్యము గలిగినందున ఆయుద్దేశమును పూర్తి చేయుటకు ఇప్పుడు అవకాశము లేకయున్నది.

ఈకూర్పునందు, మొదటికూర్పు ప్రతులలో యుండిన లేఖనప్రమాదములనుమాత్రము, చక్కబెట్టబడినవి.

ఇందలి స్ఖాలిత్యములను పండితులు క్షమింప వలయును.

# మూడవకూర్పునకు

# పీఠిక.

---

మొదటి రెండవకూర్పుల ప్రతులు అతిశీఘ్రకాలములో సెలవై పోయినందున, శ్రీభగవద్గీతలను మూడవతూరి, అచ్చువేయుటకు వృయిలు కలిగినది. ఈ మూడవతూరి మతత్రయభాష్యార్థముతో అచ్చువేయునట్లు ఉద్దేశించినందునకు లౌక్యప్రతిబంధములు సంభవించి ఆప్రయత్నము కొనసాగకపోయినది.

ఈలోపమును భరతఖండవాసులగు పుణ్యపురుషులు క్షమింపవలయును.

శ్రీ భగవద్గీతార్థసంగ్రహమును రెండవ పర్యాయము అచ్చువేయునపుడు, మతత్రయభాష్యార్థముతో అచ్చు వేయునట్లు ఉద్దేశము గలిగియుండెను. అయితే, అతిస్వల్ప కాలములో రెండవకూర్పునకు అవశ్యము గలిగినందున ఆయుద్దేశమును పూర్తిచేయుటకు ఇప్పుడు అవకాశము లేకయున్నది.

ఈకూర్పునందు, మొదటికూర్పు ప్రతులలో యుండిన లేఖనప్రమాదములనుమాత్రము, చక్కబెట్టబడినవి.

ఇందలి స్ఖాలిత్యములను పండితులు క్షమింప వలయును.

# మూడవకూర్పునకు

## పీఠిక

---

మొదటి రెండవకూర్పుల ప్రతులు అతిశీఘ్రకాలము లోసెలవైపోయినందున, శ్రీభగవద్గీతలను మూడవతూరి, అచ్చువేయుటకు వుయిలు కలిగినది. ఈ మూడవతూరి మతత్రయభాష్యార్థముతో అచ్చువేయునట్లు ఉద్దేశించినందుకు లోకప్రతిబంధములు సంభవించి ఆప్రయత్నము కొనసాగకపోయినది.

ఈలోపమును భరతఖండవాసులగు పుణ్యపురుషులు క్షమింపవలయును.

# నాల్గవ కూర్పునకు పీఠిక.

---

మూడవకూర్పు ప్రతులు వ్యయమై బహుదూరదేశములనుండి ప్రతులు కోరియుండుటవల్ల నాల్గవకూర్పు ఉపక్రమించుటకు కారణమయినది.

# అయిదవకూర్పునకు

## పీఠిక.

---

నాల్గవకూర్పు ప్రతులు వ్రయమై బహుదూరదేశముల వారు అనేకప్రతులు. కోరియుండుటవల్ల అయిదవకూర్పు ఉపక్రమించుటకు కారణమయినది

# ఆఱవకూర్పునకు పీఠిక.

అయిదవకూర్పు ప్రతులు వ్యయమై బహుదూరదేశములవారు పలుమాఱు ప్రతులను అపేక్షించుటం బట్టి ఆఱవకూర్పు ఉపక్రమించుటకు కారణమైనది.

ఇట్లు

చిఫుకుల రామయ్యగారి పౌత్రుడైన

చిఫుకుల వెంకాజయ్య

# విషయ సూచిక.



పదియవ అధ్యాయము = విభూతియోగము.

పదునొకండవ అధ్యాయము=విశ్వరూపసందర్శనయోగము.

పదిరెండవ అధ్యాయము = భక్తియోగము.

పదిమూడవ అధ్యాయము = క్షేత్రక్షేత్రజ్ఞయోగము.

పదినాల్గవ అధ్యాయము = గుణత్రయవిభాగయోగము.

పదియైదవ అధ్యాయము = పురుషోత్తమప్రాప్తియోగము.

పదియాఱవఅధ్యాయము = దైవాసుర సంపద్విభాగయోగము.

పదియేడవ అధ్యాయము = శ్రద్ధాత్రయవిభాగయోగము.

పదియెనిమిదవ అధ్యాయము=మోక్షసన్న్యాసయోగము.



ఓం

సద్గురవే నమః.

శ్రీభగవద్గీతా మాహాత్మ్య ప్రారంభః.



ధరోవాచ.

౧ భగవన్పరమేశాన భక్తిరవ్యభిచారిణీ।
ప్రారబ్ధంభుజ్యమానస్య కథంభవతి హేప్రభో॥



విష్ణురువాచ.

౨. ప్రారబ్ధంభుజ్యమానోఽపి గీతాభ్యాసరతఃసదా
సముక్తఃససుఖీలోకే కర్మణానోపలిప్యతే॥

౩. మహాపాపాదిపాపాని గీతాధ్యానంకరోతిచేత్।
క్వచిత్స్పర్శంనకుర్వంతి నలినీదళమంభసా॥

ఓం

సద్గురవేనమః.

శ్రీభగవద్గీతా మహాత్మ్య ప్రారంభము.



భూదేవివాక్యము.

౧. ఓస్వామి, ప్రారబ్ధఫలమును అనుభవించుచున్న మనుష్యులకు, నీయందు అచంచలభక్తి ఎట్లు గలుగును.

---

శ్రీమహావిష్ణువాక్యము.

౨. ప్రారబ్ధఫలమును అనుభవించువాడైనను, శ్రీభగవద్గీతలను ఎల్లప్పుడు ఆసక్తితో పారాయణముచేయు పురుషుడు, ముక్తుడై, సుఖియై, భూమియందుచేయు కర్మలచేత బద్ధుడుగాక యుండును.

3. మహాపాపములు చేసినవాడైనను, శ్రీభగవద్గీతలను పారాయణము చేసినయెడల, తామరాకును నీళ్లుఅంటనిరీతిగా, పాపములచేత వాడు ఎప్పుడు స్పృశింపబడడు.

౪. గీతాయాఃపుస్తకంయత్ర యత్రపాఠఃప్రవర్తతే।
తత్రసర్వాణితీర్థాని ప్రయాగాదీనితత్రవై॥

౫. సర్వేదేవాశ్చఋషయో యోగినఃపన్నగాశ్చయే।
గోపాలగోపికావాపి నారదోద్ధవపార్షదైః॥
సహాయోజాయతేశీఘ్రం యత్రగీతాప్రవర్తతే।

౬. యత్రగీతావిచారశ్చ పఠనంపాఠనంశ్రుతమ్।
తత్రాహంనిశ్చితంపృథ్వి నివసామిసదైవహి॥

౭. గీతాశ్రయోహంతిష్ఠామి గీతామేచోత్తమంగృహాన్।
గీతాజ్ఞానముపాశ్రిత్య త్రీన్లోకాన్పాలయామ్యహమ్॥

శ్రీభగవద్గీతామాహాత్మ్యము.

౪. శ్రీభగవద్గీతల పుస్తకము ఎచ్చట యుండునో, ఎచ్చట ఆపుస్తకము పారాయణముచేయబడునో, అచ్చటచ్చట, ప్రయాగమొదలైన సమస్త పుణ్యతీర్థములు. ఉన్నవి.

౫. అచ్చోటులలోనే, సమస్తదేవతలున్ను, ఋషులున్ను, యోగులున్ను, దేవసర్పములున్ను, గోపాల గోపికలున్ను వైకుంఠద్వారపాలకులున్ను, నారదమహాముని, ఉద్ధవుడున్ను, సహాయులై ఉందురు.

౬. ఓభూదేవీ, ఎచ్చటనైతే గీతాశాస్త్ర పఠనమున్ను, అర్థవిచారమున్ను, ఉపదేశమున్ను, వినుటయున్ను జరుగుచున్నవో, అచ్చట నేను సిద్ధముగానుండువాడను.

౭. శ్రీభగవద్గీతలే నాకు ఆశ్రయము, ఆగీతలే నాకు నివాసస్థానము, గీతాశాస్త్రమును ఆశ్రయించినందుచేతనే, మూడులోకములను నేను పరిపాలన చేయుచున్నాను.

# శ్రీభగవద్గీతామాహాత్మ్యము.

గీతామేపరమావిద్యా బ్రహ్మరూపానసంశయః।
అర్థమాత్రాక్షరానిత్యా స్వనిర్వాచ్యపదాత్మికా॥
చిదానందఘనేకృష్ణే నోక్తాస్వముఖతోఽర్జునమ్।
వేదత్రయీపరానంద తత్త్వార్థజ్ఞానమంజసా॥

౧౦. యోఽష్టాదశజపేన్నిత్యం నరోనిశ్చలమానసః।
జ్ఞానసిద్ధింసలభతే తతోయాతిపరంపదమ్॥

౧౧. పాఠేసమర్థఃసంపూర్ణే తదర్థంపాఠమాచరేత్।
తదాగోదానజంపుణ్యం లభతేనాత్రసంశయః॥

శ్రీభగవద్గీతామాహాత్మ్యము.

౮. తాత్పర్యరూపముగా నిత్యమై, బ్రహ్మస్వరూపమై, నాశరహితమైయుండు గీతాశాస్త్రము, మోక్షవిద్య యనుటకు సందేహములేదు. ఆతాత్పర్యమునే, చిదానంద స్వరూపుడైన శ్రీకృష్ణులు, అర్జునుని ఉద్దేశించి ఉపదేశము చేసిరి. ఈగీతాశాస్త్రము వేదత్రయస్వరూపముగానున్ను, పరమానందస్వరూపముగానున్ను, తత్వజ్ఞాన ప్రతిపాదకముగానున్నది.

౧౦. ఏమనుష్యుడు, ప్రతిదినమునందు, అచంచలమనస్సుతో, గీతాశాస్త్రముయొక్క పదునెనిమిది అధ్యాయములను పారాయణముచేయునో, వాడు బ్రహ్మజ్ఞానమునుపొంది, తద్వారా మోక్షమునుపొందును.

౧౧. శ్రీగీతాశాస్త్రమును, ప్రతిదినము పూర్తిగా పారాయణము చేయుటకు సామర్థ్యములేక, సగమును పారాయణము చేసినవానికి, గోదాన పుణ్యఫలము ప్రాప్తమగుటకు సందేహములేదు.

౧౨. త్రిభాగంపఠమానస్తు గంగాస్నానఫలంలభేత్ ।
షడంశంజపమానస్తు సోమయాగఫలంలభేత్ ॥

౧౩. ఏకాధ్యాయంతుయోనిత్యం పఠతేభక్తిసంయుతః ।
రుద్రలోకమవాప్నోతి గణోభూత్వావసేచ్చిరమ్ ॥

౧౪. అధ్యాయశ్లోకపాదంవా నిత్యంయఃపఠతేనరః ।
సయాతినరతాంయావన్మనుకాలంవసుంధరే ॥

౧౫. గీతాయాఃశ్లోకదశకం సప్తపంచచతుష్టయమ్ ।
ద్విత్రిఏకంతదర్ధంవా శ్లోకానాంయఃపఠేన్నరః ॥
౧౬. చంద్రలోకమవాప్నోతి వర్షాణామయుతంధ్రువమ్ ।
గీతాపాఠసమాయుక్తోమృతోమానుషతాంవ్రజేత్ ।

శ్రీభగవద్గీతామాహాత్మ్యము.

౧౧. గీతా శాస్త్రముయొక్క మూడుభాగములలో నొకభాగమును, ప్రతిదినము పారాయణముచేయువానికి, గంగాస్నాన పుణ్యఫలము లబ్ధమగును. అందులో సగమును పారాయణముచేసినవానికి, అగ్నిష్టోమము చేసిన పుణ్యఫలము సిద్ధించును.

౧౩. భక్తితో కూడుకొని, ప్రతిదినము ఒక్క అధ్యాయమును పారాయణము చేసినవాడు, రుద్రలోకమును పొంది, అచ్చట ప్రమథగణములతో చేరియుండును.

౧౪. అధ్యాయములో నాల్గవభాగమును, ఎవ్వడైతే ప్రతిదినము పారాయణముచేయునో, అట్టిపురుషుడు, భూమియందు మన్వంతరము, చిరంజీవియై యుండును,

౧౫, ౧౬. గీతా శాస్త్రములో, పదిశ్లోకములైనా, ఏడైనా, ఆయిదైనా, నాలుగైనా, మూడైనా, రెండైనా, ఒక్కటియైనా, సగముశ్లోకమైనా, ప్రతిదినము పారాయణముచేసిన పురుషుడు, చంద్రలోకమునుపొంది, అచ్చట, నిశ్చయముగా పదివేలుసంవత్సరములు వసించును. గీతా శాస్త్రమును పారాయణముచేయుచు మృతిపొందిన పురుషునకు, దేవత్వము ప్రాప్తమగును.

౧౭. గీతాభ్యాసంపునఃకృత్వా లభతేముక్తిముత్తమామ్।
గీతేత్యుచ్చారసంయుక్తో మ్రియమాణోగతింలభేత్॥

౧౮. గీతార్థశ్రవణాసక్తో మహాపాపయుతోపివా।
వైకుంఠంసమవాప్నోతి విష్ణునాసహ మోదతే।

౧౯. గీతార్థంధ్యాయతేనిత్యం కృత్వాకర్మాణిభూరిశః
జీవన్ముక్తఃసవిజ్ఞేయో. దేహాంతేపరమంపదమ్॥

౨౦ గీతామాశ్రిత్యబహవో భూభుజోజనకాదయః।
నిర్ధూతకల్మషాలోకే గీతాయాతాఃపరంపదమ్॥

శ్రీభగవద్గీతా శాస్త్రమును పారాయణముచే
సిన పురుషుడు, ఉత్తమమైన మోక్షమును పొందును. మర
ణకాలమునందు గీతాస్మరణ చేసినపురుషుడు. ఉత్తమగ
తిని పొందును.

౧౮. గీతాశాస్త్రార్థమును వినుటయందు ఆసక్తిగల
పురుషుడు, మహాపాపియైనా, వైకుంఠలోకమును పొంది,
శ్రీమహావిష్ణువుతో కూడా ఆనందించును.

౧౯. ప్రతిదినమున్ను, నిత్యనైమిత్తిక కర్మలనుచేయుచు,
ఎవ్వడు గీతాశాస్త్రార్థమును ధ్యానముచేయుచున్నాడో,
వాడు జీవన్ముక్తుడై, దేహమును విడిచిపెట్టినవెనుక, మో
క్షమును పొందును.

౨౦. జనకుడు మొదలైన అనేకరాజులు, గీతాశాస్త్ర
మును ఆశ్రయించి, సమస్తపాపమును పోగొట్టుకొనిన
వారై, లోకమునందు యశస్సంపన్నులై, మోక్షమును
పొందినవారైరి.

౨౧. గీతాయాఃపఠనంకృత్వా మాహాత్మ్యంనైవయఃప
ఠేత్ ॥
వృథాపాఠోభవేత్తస్య శ్రమఏవహ్యుదాహృతః॥

౨౨. ఏతన్మాహాత్మ్యసంయుక్తం గీతాభ్యాసంకరోతియః
సతత్ఫలమవాప్నోతి దుర్లభాంగతిమాప్నుయాత్ ॥

సూతఉవాచ.

౨౩. మాహాత్మ్యమేతద్గీతాయా మయాప్రోక్తం సనా
తనమ్ ।
గీతాన్తేచపఠేద్యస్తు యదుక్తంతత్ఫలంలభేత్ ॥

---

ఇతి శ్రీవరాహపురాణే శ్రీగీతామాహాత్మ్యమ్
సంపూర్ణమ్.

---

శ్రీకృష్ణార్పణమస్తు.

ఈ గీతాశాస్త్ర మాహాత్మ్యమును విడిచిపెట్టి, గీతాశాస్త్రమును మాత్రము పారాయణము చేసినవారికి, శాస్త్రోక్తమైన ఫలములేక, ప్రయాస మాత్రము శేషించును.

౨౨. ఈగీతా మాహాత్మ్యముతోకూడా, గీతాశాస్త్రమును పారాయణము చేసినవారు, పైనచెప్పిన ఫలమును పొందుటయేగాక, మోక్షమునుకూడా పొందుచున్నారు.

సూతులవాక్యము.

౨౩. నాచేత చెప్పబడిన ఈపురాతనమైన గీతాశాస్త్ర మాహాత్మ్యమును, గీతాశాస్త్ర పారాయణాంతమునందు, ఎవ్వడు పారాయణము చేయుచున్నాడో వాడు ఆఫలమును పొందుచున్నాడు.

---

ఇట్లని వరాహపురాణమునందు చెప్పియుండు
శ్రీగీతాశాస్త్ర మాహాత్మ్యము
ముగిసెను.

---

శ్రీకృష్ణార్పణమస్తు.

# ఓమ్.

శ్రీకృష్ణాయనమః.

సద్గురవేనమః

# స్తోత్రశ్లోకములు.



వ్యాసంవసిష్ఠనప్తారం శక్తేఃపౌత్రమకల్మషమ్।
పరాశరాత్మజంవన్దే శుకతాతంతపోనిధిమ్॥
అచతుర్వదనోబ్రహ్మా ద్విబాహురపరోహరిః।
అఫాలలోచనశ్శంభు ర్భగవాన్ బాదరాయణః॥
మునింస్నిగ్ధాంబుధాభాసం వేదవ్యాసమకల్మషమ్।
వేదావాస్యసంసరస్వత్యావాసం వ్యాసంనమామ్యహమ్॥
అస్యశ్రీగీతాశాస్త్రమహామంత్రస్య।
శ్రీవ్యాసోభగవాన్ ఋషిః॥
ప్రాయేణానుష్టుప్ ఛందః॥
క్వచిన్నానాఛందాంసి॥
కృష్ణఃపరమాత్మాదేవతా॥

అశోచ్యానన్వశోచ స్త్వమితిబీజం॥

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజేత్ శక్తిః।

అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ ఇతి కీలకం॥

---

శ్రీకృష్ణప్రీత్యర్థే జపే వినియోగః.

ఓం శ్రీ సుజ్ఞానాత్మనే శ్రీకృష్ణాయ అంగుష్ఠాభ్యాం నమః॥

ఓం శ్రీమదైశ్వర్యాత్మనే ఖండనే శ్రీకృష్ణాయ తర్జనీభ్యాం స్వాహా॥

ఓం శ్రీమచ్ఛక్త్యాత్మనే శ్రీవేదవ్యాసాయ మధ్యమాభ్యాం వషట్॥

ఓం శ్రీమద్బలాత్మనే బలభద్రరామాయ అనామికాభ్యాం హుం॥

ఓం శ్రీమత్తైజసాత్మనే వాసుదేవాయ కనిష్ఠికాభ్యాం వౌషట్॥

ఓం శ్రీమద్వీర్యాత్మనే గాండీవధన్వినే అర్జునాయ కరతలకరపృష్ఠాభ్యాం ఫట్॥

స్తోత్రశ్లోకములు.

ఓం శ్రీమజ్జ్ఞానాత్మనే శ్రీకృష్ణాయహృదయాయనమః॥

ఓం శ్రీమదైశ్వర్యాత్మనే ఛందసే శ్రీకృష్ణాయ శిరసేస్వాహా॥

ఓం శ్రీమచ్ఛక్త్యాత్మనే శ్రీవేదవ్యాసాయశిఖాయైవషట్॥

ఓం శ్రీమద్బలాత్మనే బలభద్రరామాయకవచాయహుం॥

ఓం శ్రీమత్తేజసాత్మనే వాసుదేవాయ నేత్రత్రయాయవౌషట్॥

ఓం శ్రీమద్వీర్యాత్మనే గాండీవధన్వినేర్జునాయ అస్త్రాయఫట్॥

---

భూర్భువస్సువరోమ్ ఇతి దిగ్బంధః.

ధ్యానం.

కరకమలనిదర్శితాత్మముద్రః పరికలితోన్నత బర్హిబర్హచూడః।
ఇతరకరగృహీతవేత్రతోత్త్రో మమహృదిసన్నిధిమాతనోతుశౌరిః॥

ప్రపన్నపారిజాతాయ తోత్రవేత్రైకపాణయే।
జ్ఞానముద్రాయకృష్ణాయ గీతామృతదుహేనమః।

వాచకః ప్రణవోయస్య క్రీడావస్త్వఖిలంజగత్।
శ్రుతిరాజ్ఞావపుర్జ్ఞానం తంవందే దేవకీసుతమ్॥

పార్థాయ ప్రతిపాదితాం భగవతా నారాయణేనస్వయమ్
వ్యాసేనగ్రథితాంపురాణమునినా మధ్యేమహాభారతమ్।
అద్వైతామృతవర్షిణీంభగవతీ మష్టాదశాధ్యాయినీమ్॥
అంబత్వామనుసందధామి భగవద్గీతే-భవద్వేషిణీమ్॥

భీష్మద్రోణతటాజయద్రథజలా గాంధారనీలోత్పలా।
శల్యగ్రాహవతీకృపేణవహినీ కర్ణేనవేలాకులా।
అశ్వత్థామవికర్ణఘోరమకరా దుర్యోధనావర్తినీ।
సోత్తీర్ణాఖలుపాండవై రణనదీకైవర్తకః కేశవః॥



శ్రీకృష్ణాయనమః.

# శ్రీభగవద్గీతాప్రారంభః.

## అర్జునవిషాదయోగః.

ధృతరాష్ట్ర ఉవాచ.

౧. ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతాయుయుత్సవః।
మామకాఃపాండవాశ్చైవ కిమకుర్వత సంజయ॥

---

సంజయ ఉవాచ.

౨. దృష్ట్వాతుపాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా।
ఆచార్యముపసంగమ్య రాజావచనమబ్రవీత్॥

శ్రీకృష్ణాయనమః.

# శ్రీభగవద్గీతలప్రారంభము.

## అర్జునవిషాదయోగము.

—:o:—

ధృతరాష్ట్రవాక్యము

౧. ఓ సంజయా, పుణ్యభూమియైన కురుక్షేత్రమునందు నాకొమారులయిన దుర్యోధనాదులును, పాండుకొమారులైన ధర్మరాజాదులును, యుద్ధమునకు సన్నద్ధులై, ఏమి చేసిరి?

---

సంజయుని వాక్యము.

౨. రాజైన దుర్యోధనుడు, వ్యూహముగాపన్నియుండే పాండవ సేనను జూచి, ద్రోణాచార్యులవద్దకుపోయి, ఒక మాట చెప్పెను.

౩. పశ్యైతాంపాండుపుత్రాణా మాచార్య మహతీం
చమూమ్ ।

వ్యూఢాంద్రుపదపుత్రేణ తవశిష్యేణధీమతా॥

౪. అత్రశూరామహేష్వాసా భీమార్జునసమాయుధి ।
యుయుధానోవిరాటశ్చ ద్రుపదశ్చమహారథః॥

౫. ధృష్టకేతుశ్చేకితానః కాశీరాజశ్చవీర్యవాన్ ।
పురుజిత్కుంతిభోజశ్చ శైబ్యశ్చనరపుంగవః॥

౬. యుధామన్యుశ్చవిక్రాంత ఉత్తమౌజాశ్చవీర్యవా
సౌభద్రోద్రౌపదేయాశ్చ సర్వఏవమహారథాః॥

౭. అస్మాకంతువిశిష్టాయే తాన్నిబోధద్విజోత్తమ।
నాయకామమసైన్యస్య సంజ్ఞార్థంతాన్బ్రవీమితే॥

3. ఓయి ఆచార్య, నీశిష్యుడైన ధృష్టద్యుమ్నునిచేత యుద్ధప్రారంభమునకు వ్యూహముగా పన్నియుండే పాండవసేనను, చూడుము.

4. ఈయుద్ధరంగమునందు, భీమార్జునులకు సమానులైనట్టియు, గొప్ప ధనుష్మంతులైనట్టి శూరులున్నారు. వారు ఎవరనిన, యుద్ధ సన్నద్ధుడైన విరాటుండును, మహారథుడైన ద్రుపదుడున్ను.

5. మఱియు, ధృష్టకేతువనెడి రాజును చేకితానుడును, పరాక్రమశాలియైన కాశీరాజును, పురుజిత్తనెడిరాజును, కుంతిభోజుడును, నరశ్రేష్ఠుడైన శైబ్యుడున్ను.

6. మఱియు, వీరుడైన యుధామన్యుడును, పరాక్రమశాలియైన ఉత్తమాజుడును, అభిమన్యుడును. ఉపపాండవులును ఉన్నారు. వీరందరు మహారథికులేను.

7. ఓయి ద్రోణాచార్య, మనసేనకు రక్షకులను నీకు తెలియుటకొరకు, ఇకను వివరించుచున్నాను, అందులో శ్రేష్ఠులైనవారిని వినుము.

భవాన్భీష్మశ్చకర్ణశ్చ కృపశ్చసమితింజయః
అశ్వత్థామావికర్ణశ్చ సౌమదత్తిస్తథైవచ॥

౯. అన్యేచబహవశ్శూరా మదర్థేత్యక్తజీవితాః।
నానాశస్త్రప్రహరణా స్సర్వేయుద్ధవిశారదాః॥

౧౦. అపర్యాప్తంతదస్మాకం బలంభీష్మాభిరక్షితమ్।
పర్యాప్తంత్విదమేతేషాం బలంభీమాభిరక్షితమ్॥

౧౧. అయనేషుచసర్వేషు యథాభాగమవస్థితాః।
భీష్మమేవాభిరక్షంతు భవంతస్సర్వఏవహి॥

౧౨. తస్యసంజనయన్హర్షం కురువృద్ధఃపితామహః।
సింహనాదంవినద్యోచ్చై శ్శంఖందధ్మౌప్రతాప
వాన్॥

౮. వారు ఎవరనిన. నీవును, భీష్ముడును, కర్ణుడును, కృపాచార్యుడును, అశ్వద్ధామయు, వికర్ణుడును, సోమదత్తుని కొమారుడైన భూరిశ్రవుడున్ను.

౯. ఇంకను, అనేకశూరులు, నానాస్త్రశస్త్రములయందు ప్రవీణతగలవారై, నానిమిత్తము తమతమప్రాణముల మంగా, అభిమానము విడిచి పెట్టిన వారుగానున్నారు.

౧౦. ఈ మనసేన, భీష్ములచేత సంరక్షింపబడి, అమితమైయున్నది. మనశత్రుసేన, భీమునిచేత సంరక్షింపబడి, పరిమితముగానున్నది.

౧౧. ఓ ద్రోణాచార్య, మీరందరును, వారివారికి ఏర్పడిన స్థానములలోనుండి, మన సేనానాయకుడైన భీష్ముని సంరక్షణచేయవలయును.

౧౨. పరాక్రమశాలియగు కురుశ్రేష్ఠుడైన భీష్ముడు, దుర్యోధనునకు ఉత్సాహముపుట్టించుచున్నవాడై, సింహనాదముచేసి, శంఖమును పూరించెను.

౧౮. ద్రుపదోద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే।
సౌభద్రశ్చమహాబాహు శ్శంఖాన్దధ్ముః పృథక్పృ
థక్॥

౧౯. సఘోషోధార్తరాష్ట్రాణాం హృదయానివ్యదార
యత్।
నభశ్చపృథివీంచైవ తుములోవ్యనునాదయన్॥

౨౦౪. అథవ్యవస్థితాన్దృష్ట్వాధార్తరాష్ట్రాన్కపిధ్వజః।
ప్రవృత్తేశస్త్రసంపాతే ధనురుద్యమ్యపాండవః॥
హృషీకేశంతదావాక్య మిదమాహమహీపతే।

౨౨. సేనయోరుభయోర్మధ్యే రథంస్థాపయమేచ్యుత॥
యావదేతాన్ నిరీక్షేహం యోద్ధుకామానవస్థి
తాన్।
కైర్మయాసహయోద్ధవ్య మస్మిన్రణసముద్యమే॥

౧౮. ఓ ధృతరాష్ట్రుడా, మఱియు ద్రుపదరాజు, ఉపపాండవులు, భుజబలముగలిగిన అభిమన్యుడు మొదలుగాగల సేనానాయకులు, శంఖములను వేఱ్వేరుగా పూరించిరి.

౧౯. ఈపైనచెప్పిన ప్రకారము, కృష్ణార్జునులు మొదలగు పాండవసేనా నాయకులుచేసిన శంఖనాదము, భూమి ఆకాశమునిండి ప్రతిధ్వనిపుట్టించి, దుర్యోధనాదులయొక్క గుండెలు పగులగొట్టెను.

౨౦౹. ఓయిధృతరాష్ట్రుడా, అర్జునుడు, అటుతర్వాత, వరుసగా నిలిచియున్నటువంటిన్ని, బాణములు వేయనున్నవారలై నటువంటి ధృతరాష్ట్రపుత్రులనుజూచి, కృష్ణమూర్తినుద్దేశించి, ఈదిగువవివరించెడి వాక్యముపలికెను.

౨౨. ఓ అచ్యుతా, ఈయుద్ధరంగమునందు, నేను ఎవరితో యుద్ధము చేయదగినదో, వార్లను చక్కగా చూచుటకై ఈ రెండుసేనల మధ్యప్రదేశమునందు, నారథమును నిలుపుము.

౨౩. యోత్స్యమానానవేక్షేహంయ ఏతేత్ర సమాగతాః।
ధార్తరాష్ట్రస్యదుర్బుద్ధేర్యుద్ధేప్రియచికీర్షవః।

---

సంజయ ఉవాచ.

౨౪. ఏవముక్తోహృషీకేశో గుడాకేశేనభారత।
సేనయోరుభయోర్మధ్యేస్థాపయిత్వారథోత్తమమ్॥

౨౫. భీష్మద్రోణప్రముఖతస్సర్వేషాంచమహీక్షితాం।
ఉవాచపార్థపశ్యైతాన్ సమవేతాన్కురూనితి॥

౨౬. తత్రాపశ్యత్ స్థితాన్పార్థః పితౄనథపితామహాన్।
ఆచార్యాన్మాతులాన్భ్రాతౄన్ పుత్రాన్పౌత్రాన్ సఖీంస్తథా॥
శ్వశురాన్సుహృదశ్చైవ సేనయోరుభయోరపి।

౨౩. దుర్మార్గుడైన దుర్యోధనునకు ప్రీతిచేయనిచ్ఛయించినవారై, యుద్ధముచేయుటకు ఎవరెవరు సన్నద్ధులై వచ్చియున్నారో వారలనుచూడ నేను కోరుచున్నాను.



సంజయునివాక్యము.

౨౪. ఈ ప్రకారము అర్జునునిచేత చెప్పబడినవాడై, శ్రీకృష్ణుడు, ఉభయసేనామధ్యమందు, రథమునునిలిపెను.

౨౫. రథమునునిలిపినపిదప, భీష్మద్రోణులు మొదలగు సకలరాజులయెదుట, ఓయి అర్జునా, కౌరవసేనను నీవుచూడుమని, శ్రీకృష్ణుడు చెప్పెను.

౨౬. పిమ్మట, అర్జునుడు, ఉభయసేనలయందున్న పినతండ్రులను, పెత్తండ్రులను, తాతలను, ఆచార్యులను, మేనమామలను, అన్నదమ్ములను, కొడుకులను, మనమలను, మిత్రులను, మామగార్లను, స్నేహితులను, చూచెను.

౨౭. తాన్సమీక్ష్యసకౌంతేయ స్సర్వాన్బంధూనవస్థి
తాన్।
కృపయాపరయావిష్టో విషీదన్నిదమబ్రవీత్॥



అర్జున ఉవాచ.

౨౮, ౨౯. దృష్ట్వేమంస్వజనంకృష్ణ యుయుత్సుంసము
పస్థితమ్।
సీదంతిమమగాత్రాణి ముఖంచపరిశుష్యతి।
వేపథుశ్చశరీరేమే రోమహర్షశ్చజాయతే॥

౩౦. గాండీవంస్రంసతేహస్తాత్ త్వక్చైవపరిదహ్యతే।
నచశక్నోమ్యవస్థాతుం భ్రమతీవచమేమనః॥

౩౧. నిమిత్తానిచపశ్యామి విపరీతానికేశవ।
నచశ్రేయోనుపశ్యామి హత్వాస్వజనమాహవే॥

౨౭. అర్జునుడు, యుద్ధరంగమందున్న పైనచెప్పిన స్వమస్తబంధువులనుచూచి, అధికదయాపరుడై దుఃఖించి, శ్రీకృష్ణులనుద్దేశించి దిగువచెప్పెడురీతి పలికెను.



అర్జునవాక్యము.

౨౮, ౨౯. ఓయికృష్ణ, యుద్ధముచేయుటకు ఎదుర్కొని సమీపించియున్న ఈ బంధుజనులనుచూచి, నా అవయవములు విలవిలబోవుచున్నవి, నోరు ఎండిపోవుచున్నది, దేహము వణకుచున్నది, వెంట్రుకలు గగ్గురు పొడుచుచున్నవి.

౩౦. మఱియు, నాగాండీవము చేతులోనుండి జారిపోవుచున్నది, చర్మము అధికతాపము పొందుచున్నది మనస్సు భ్రమించుచున్నది, ఇకను, రథముమీద చక్కగాకూర్చుండుటకు అశక్తుడనై యున్నాను,

౩౧. ఓకేశవా, నాకు అవశకునములు కనబడుచున్నవి. ఈయుద్ధములో బంధుమిత్రులనుచంపి, తర్వాత నేను ఏమి సుఖమును పొందగలను.

3౨. నకాంక్షేవిజయంకృష్ణ నచరాజ్యంసుఖానిచ।
కింనోరాజ్యేనగోవింద కింభోగైర్జీవితేనవా॥

33. యేషామర్థేకాంక్షితంనోరాజ్యంభోగాస్సుఖానిచ।
తఇమేవస్థితాయుద్ధేప్రాణాంస్త్యక్త్వాధనానిచ॥

3౪. ఆచార్యాః పితరఃపుత్రాస్తథైవచపితామహాః।
మాతులాశ్శ్వశురాః పౌత్రాస్స్యాలాస్సంబంధిన
స్తథా॥

3౫. ఏతాన్నహంతుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన।
అపిత్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్నుమహీకృతే,

౩౨. ఓయికృష్ణ, జయమునుగాని, రాజ్యమును గాని, సుఖమునుగాని, నేనుకోరలేదు. వీరలనందరచం పినపిదప, రాజ్యమెందుకు, సుఖమెందుకు, జీవించి యుండుటవల్ల ఏమిప్రయోజనము.

౩౩. ఎవరికొఱకై మనచేత, రాజ్యమున్ను, భోగ ములున్ను, సుఖములున్ను, కోరబడుచున్నవో, అట్టి వారే అర్థప్రాణములనువదలి, యుద్ధసన్నద్ధులై వచ్చి యున్నారు.

౩౪. ఆప్రకారమే ఆచార్యులున్ను, తండ్రులున్ను, పుత్రులున్ను, తాతలున్ను, మేనమామలున్ను, మామ గార్లున్ను, మనమలున్ను, బావమరుదులున్ను, వియ్యం కులున్ను వచ్చియున్నారు.

౩౫. ఓమధుసూదనా, నన్నుచంపుటకువచ్చిన వీర్ల ను, త్రైలోక్య రాజ్యపదవికినైనా నేనుచంపకోరను. ఒకభూమండలాధిపత్యముకొఱకై నేను చంపుదునా.

౩౬. నిహత్యధార్తరాష్ట్రాన్నః కాప్రీతిస్స్యాజ్జనార్దన।
పాపమేవాశ్రయేదస్మాన్హత్వైతానాతతాయినః॥

౩౭. తస్మాన్నార్హావయంహంతుం ధార్తరాష్ట్రాన్స్వబాం
ధవాన్।
స్వజనంహికథంహత్వా సుఖినస్స్యామమాధవ॥

౩౮. యద్యప్యేతేనపశ్యంతి లోభోపహతచేతసః।
కులక్షయకృతందోషం మిత్రద్రోహేచపాతకమ్॥

౩౯. కథంనజ్ఞేయమస్మాభిః పాపాదస్మాన్నివర్తితుమ్।
కులక్షయకృతందోషం ప్రపశ్యద్భిర్జనార్దన॥

౪౦. కులక్షయేప్రణశ్యంతి కులధర్మాస్సనాతనాః।
ధర్మేనష్టేకులంకృత్స్నమధర్మోభిభవత్యుత।

౩౬. ఓ జనార్దనా, ఈదుర్యోధనాదులనుచంపి, మనకు ఏమిప్రీతి గలుగబోవుచున్నది. మనలను చంపవచ్చిన వీరిని చంపడములో, పాపమేవచ్చును.'

౩౭. ఓయిమాధవ, బంధుజనులతోగూడిన దుర్యోధనాదులనుచంపుటకు, మనముదగము. స్వజనులనుచంపి, మనము ఏవిధముగా సుఖము గలవారమగుదుము.

౩౮. ఈ దుర్యోధ నాదులు, లోభముచేత చెడిన మనస్సుగలవారై, కులక్షయము చేయడములో గలుగు పాపమునున్ను, మిత్రద్రోహము చేయడములో గలుగు పాపమునున్ను, తెలిసికొనలేరు.

౩౯. ఓ జనార్దనా, కులనాశనము చేయడములో గలిగెడు పాపమును, చక్కగా చూచుచున్న మనము, ఈ పాపములో నుండి నివర్తించుటకు, ఎట్లు ప్రయత్నము చేయక యుండవచ్చును.

౪౦. వంశనాశము గలుగుటవలన, అనాదియైనకులాచారములు నశించిపోవును, కులధర్మము నశించుటచేత, ఆకులమును అధర్మము చుట్టుకొనును.

౪౧. అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యంతికులస్త్రియః।
స్త్రీషుదుష్టాసువార్ష్ణేయ జాయతే వర్ణసంకరః॥

౪౨. సంకరోనరకాయైవ కులఘ్నానాం కులస్యచ।
పతంతిపితరోహ్యేషాం లుప్తపిండోదకక్రియాః॥

౪౩. దోషైరేతైఃకులఘ్నానాం వర్ణసంకరకారకైః।
ఉత్సాద్యంతేజాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః॥

౪౪. ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన।
నరకేనియతంవాసో భవతీత్యనుశుశ్రుమ॥

౪౫. అహోబత మహత్పాపం కర్తుంవ్యవసితావయమ్।
యద్రాజ్యసుఖలోభేన హంతుంస్వజనముద్యతాః॥

౪౧. ఓయి కృష్ణ, అంహువలన కులస్త్రీలు దోష యుక్తులగుచున్నారు, స్త్రీలు దోషయుక్తులైరేని, వర్ణ సంకరము గలుగుచున్నది.

౪౨. ఈ వర్ణసంకరము, కులముచెరిచిన వార్లకున్ను, కులమునకున్ను, నరకమును గలుగచేయును. ఈకులఘ్నుల యొక్కయున్ను, కులముయొక్కయున్ను, పితృలు, పిండో దకలోపముచేత, అధోలోకములను పొందుచున్నారు.

౪౩. వర్ణసంకరము చేయునట్టి కులఘ్నుల యొక్క ఈదోషముచేతను, శాశ్వతములైన కులధర్మములు, జాతి ధర్మములు, నశింపచేయబడుచున్నవి.

౪౪. ఓజనార్దనా, కులధర్మములు చెడిపోయిన వా రికు, నరకమందు వాసము గలుగుచున్నది. ఇది నిశ్చయ ము. ఇట్లని మనము వినుచున్నాము.

౪౫. ఏమిఆశ్చర్యము! ఏమికష్టము! మహాత్తైన పాప ముచేయుటకు ఉద్యుక్తులైతిమి! రాజ్యసుఖలోభముచేత, బంధువులనుకూడా సంహరించుటకు, ఉద్యుక్తులైతిమి.

౪౬. యదిమామప్రతీకార మశస్త్రంశస్త్రపాణయః।
ధార్తరాష్ట్రారణేహన్యు స్తన్మేక్షేమతరంభవేత్॥

---

సంజయ ఉవాచ.

౪౭. ఏవముక్త్వార్జునస్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్।
విసృజ్యసశరంచాపం శోకసంవిగ్నమానసః॥



ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
అర్జునవిషాద యోగోనామ
ప్రథమోధ్యాయః.

---

౪౬. నిరాయుధుడనై, బదులుయుద్ధము చేయబోవని నన్ను, ఆయుధపాణులైన దుర్యోధనాదులు యుద్ధమందు సంహరించిరేని, ఆది నాకు మిక్కిలి క్షేమకరము.

---

సంజయుని వాక్యము.

౪౭. ఈపైనచెప్పినప్రకారము అర్జునుడుపలికి, మహా దుఃఖాక్రాంతుండై, ధనుర్బాణములను వదలి, ఉభయ సేనలమధ్య నిలిపి యుండిన రథమునందు, ఊరక కూర్చుండెను.

---

ఇట్లని ఉపనిషద్రూపమైనట్టియు పరబ్రహ్మవిద్యయైనట్టి భగవద్గీతలనెడు శ్రీకృష్ణార్జున సంవాదరూపమైన యోగశాస్త్రమునందు అర్జునవిషాదమను మొదటి అధ్యాయము ముగిసెను.

---

## సాంఖ్యయోగః.

---

సంజయ ఉవాచ.

౧. తంతథాకృపయావిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్।
విషీదంతమిదంవాక్య ముహవాచ మధుసూదనః॥

---

శ్రీభగవాన్ ఉవాచ.

౨. కుతస్త్వాకశ్మలమిదం విషమేసముపస్థితమ్।
అనార్యజుష్టమస్వర్గ్య మకీర్తికరమర్జున॥

౩. క్లైబ్యంమాస్మగమఃపార్థ నైతత్త్వయ్యుపపద్యతే।
క్షుద్రంహృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠపరంతప॥

---

## సాంఖ్య యోగము.

సంజయ వాక్యము.

౧. దయాపరుడై, కన్నీళ్లువిడుచుచు, దుఃఖాక్రాంతుడైన అర్జునునిచూచి, మధుసూదనుడు ఒకవాక్యము పలికెను.

---

శ్రీకృష్ణుల వాక్యము.

౨. ఓయి అర్జునా యుద్ధమునకు ప్రారంభించ బోయ్యే ఇట్టివిషమసమయమందు, శూరులకు అనర్హామైనట్టిన్నీ, స్వర్గమును పొందుటకు విఘాతమైనట్టిన్నీ, అపయశస్సుకు కారణమైనట్టిన్నీ, ఈదుఃఖరూపమైనపిరికితనము, నీకు ఎట్లు గలిగెను.

3. ఓయి అర్జునా, నీవు భయమును పొందకుము, అది నీకుదగినదికాదు, తుచ్ఛమైన ఈఅధైర్యమును విడిచిపెట్టి, యుద్ధమునకులెమ్ము.

---

అర్జున ఉవాచ.

౪. కథంభీష్మమహంసంఖ్యే ద్రోణంచమధుసూదన।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన॥

౫. గురూనహత్వాహిమహానుభావాన్ శ్రేయోభో
క్తుంభైక్షమపీహలోకే।
హత్వార్థకామాంస్తుగురూనిహైవ భుంజీయభో
గాన్రుధిరప్రదిగ్ధాన్॥

౬. నచైతద్విద్మః కతరన్నోగరీయో యద్వాజయేమయ
దివానోజయేయుః।
యానేవహత్వానజిజీవిషామ స్తేవస్థితాః ప్రముఖే
ధార్తరాష్ట్రాః॥

అర్జున వాక్యము.

౪. ఓయి మధుసూదన, పూజార్హులైన భీష్మద్రోణులను ఎదిరించి, బాణములతో, ప్రతియుద్ధము నేను ఎట్లు చేయగలను.

౫. అర్థకాములైన గురువులను సంహరించి, రక్తమిశ్రమైన భోగములను అనుభవించుటకంటె, మహానుభావులైన గురువులను సంహరించక, ఈలోకమందుభిక్షాన్నము భక్షించడము, శ్రేష్ఠముగానున్నది.

౬. యుద్ధముచేసితిమేని, మనము, శత్రువులైనదుర్యోధనాదులను జయించుదుమో, లేక, వారిలే మనలను జయింతురో, ఈజయాపజయములు, మనకు దెలియవు. ఏ దుర్యోధనాదులను చంపినవెనుక, మనముబ్రతికినామేలో, అట్టి దుర్యోధనాదులు మనకు నెదుర్కొని, యుద్ధసన్నద్ధులై వచ్చియున్నారు.

౭. కార్పణ్యదోషోపహతస్వభావః పృచ్ఛామి త్వాం ధర్మ
సంమూఢచేతాః।
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే శిష్యస్తే
హం శాధి మాం త్వాం ప్రపన్నమ్।

౮. నహి ప్రపశ్యామి మమాపనుద్యా ద్యచ్ఛోకముచ్ఛో
షణమింద్రియాణామ్।
అవాప్య భూమావసపత్నమృద్ధం రాజ్యం సురాణామపి
చాధిపత్యమ్॥

---

సంజయ ఉవాచ.

౯. ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః।
నయోత్స్య ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవహ॥

౭. నేను, ఇప్పుడు, స్వాధీనముతప్పిన మనస్సుగలవాడనుగానున్న, ధర్మము తెలియని వాడనుగానున్న, ఉన్నాను, గనుక, ఇప్పుడు నేను ఏకార్యము చేయడము యుక్తమని, నిన్ను అడిగెదను. ఏకార్యము శ్రేయస్కరమో, అట్టికార్యము నాకుసెలవిమ్ము, నేను నీకు శిష్యుడను, నిన్ను శరణుపొందినవాడను, గనుక, నన్ను శిక్షింపుము.

౮. నాయింద్రియములను శోషింపచేయు ఈ దుఃఖము, ఏకార్యము చేయుటవల్ల నివర్తించునో, అట్టికార్యము నాకు తెలియలేదు. భూమండలాధిపత్యమున్న, ఇంద్రత్వమున్నకూడా, ఈ దుఃఖమునుపోగొట్టచాలవు.

---

సంజయుని వాక్యము.

౯. శత్రుసంహారకుడైన అర్జునుడు, పైనచెప్పినరీతిగా పలికి, గోవిందునిచూచి, యుద్ధము చేయనని చెప్పి, ఊరక యుండెను.

౧౦. తమువాచహృషీకేశః ప్రహసన్నివభారత।
సేనయోరుభయోర్మధ్యే విషీదంతమిదంవచః॥

---

శ్రీభగవాన్ ఉవాచ,

౧౧. అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చభాషసే।
గతాసూనగతాసూంశ్చ నానుశోచంతిపండితాః॥

౧౨. నత్వేవాహంజాతునాసం నత్వంనేమేజనాధిపాః।
నచైవనభవిష్యామ స్సర్వేవయమతఃపరమ్॥

౧౩. దేహినోస్మిన్ యథాదేహే కౌమారం యౌవనం జరా।
తథాదేహాంతరప్రాప్తిర్ధీరస్తత్రనముహ్యతి॥

౧౦. యుద్ధసన్నద్ధులైన ఉభయసేనల మధ్యమందు దుఃఖించుచున్న అర్జునునిచూచి, హృషీకేశుడు, చిరునవ్వుతో, ఈదిగువ వివరించేలాగున పలికెను.



శ్రీకృష్ణుల వాక్యము.

౧౧. నీవు, దుఃఖింపదగనివార్లనుకూర్చి, దుఃఖించితివి. పండితవాక్యములు పలుకుచున్నావు. ఆత్మానాత్మవివేకజ్ఞులు, మృతులైనవారిని గురించిగాని, జీవించియుండువార్లను గురించిగాని, దుఃఖింపరు.

౧౨. నేనేమి, నీవేమి, ఈ రాజులందరేమి, ఇంతకుమునుపు ఒకప్పుడున్ను, లేకపోయినవారముగాము. ఇకెప్పుడు, లేకపోయే వారము గాము. మనమందరము నిత్యులమై యుండువారము.

౧౩. దేహికి, ఈ దేహమందు, బాల్యము, యౌవనము, ముసలితనము ఎట్టివో, దేహాంతరము పొందడమున్ను అట్టిదే గనుక, విద్వాంసుడు, ఈ విషయమునందు, మోహమును జెందడు.

౧౪. మాత్రాస్పర్శాస్తుకౌంతేయశీతోష్ణసుఖదుఃఖదాః।
ఆగమాపాయినోనిత్యాస్తాంతితిక్షస్వభారత॥

౧౫. యంహినవ్యథయంత్యేతేపురుషంపురుషర్షభ।
సమదుఃఖసుఖంధీరం సోమృతత్వాయకల్పతే॥

౧౬. నాసతోవిద్యతేభావో నాభావోవిద్యతేసతః।
ఉభయోరపిదృష్టోంత స్త్వనయో స్తత్వదర్శిభిః॥

౧౭. అవినాశితుతద్విద్ధి యేనసర్వమిదంతతం।
వినాశమవ్యయస్యాస్య నకశ్చిత్కర్తుమర్హతి॥

౧౮. అంతవంతఇమేదేహా నిత్యస్యోక్తాశ్శరీరిణః।
అనాశినోప్రమేయస్య తస్మాద్యుధ్యస్వభారత॥

౧౪. ఓయీ అర్జునా, సంయోగ వియోగములుగలిగి, అనిత్యములైన విషయములు, శీతోష్ణసుఖదుఃఖములను ఇచ్చునవి, వాటిని నీవు సహింపుము.

౧౫. ఓఅర్జున, సుఖదుఃఖములయందు సమానుడై, ధీరుడైన ఎవ్వని, విషయసంబంధములు వేధింపవో, అట్టి పురుషుడే, మోక్షార్హుడు.

౧౬. అసత్ పదార్థమునకు సత్తలేదు. సత్ పదార్థమునకు అసత్తలేదు. తత్వజ్ఞానులచేత, ఈ సదసత్తుల యొక్క నిర్ణయము, చేయబడినది.

౧౭. ఏవస్తువుచేత, ఈ సమస్త జగత్తు వ్యాపింపబడియున్నదో, అట్టివస్తువు, నాశములేనిదిగా తెలియుము. వికార రహితమైన యావస్తువును, నాశనముచేయుటకు, ఎవ్వడూ అర్హుడుగాడు.

౧౮. నిత్యుడై, నాశరహితుడై, ప్రమాణమునకు గోచరముగాని దేహికి, అనిత్యమైన దేహములు నచ్చినట్లు, చెప్పబడియున్నది, గనుక, ఓయి అర్జునా, నీవు ఇపుడు యుద్ధము చేయుము.

౧౯. యఏనం వేత్తి హంతారం యశ్చైనంమన్యతేహ
తమ్।
ఉభౌతౌనవిజానీతో నాయంహంతినహన్యతే॥

౨౦. నజాయతే మ్రియతేవాకదాచి న్నాయంభూత్వా
భవితా వానభూయః।
అజోనిత్యశ్శాశ్వతోయంపురాణో నహన్యతేహ
న్యమానేశరీరే॥

౨౧. వేదావినాశినంనిత్యం యఏనమజమవ్యయం।
కథంసపురుషఃపార్థకంఘాతయతిహంతికం॥

౨౨. వాసాంసిజీర్ణానియథావిహాయ నవాని గృహ్ణాతి
నరోపరాణి।
తథాశరీరాణి విహాయజీర్ణా న్యన్యానిసంయాతి
నవానిదేహీ॥

౧౯. దేహి చంపెడువాడనియు, చచ్చెడు వాడనియు, ఎవరు అభిప్రాయబడుచున్నారో, వారిరువురున్ను, మూఢులని తెలియుము. దేహి, ఒకరిని చంపేవాడుగాడు, ఒకరిచేత చంపబడేవాడుగాడు.

౨౦. ఈదేహి, పుట్టేవాడుగాడు, చచ్చేవాడుగాడు, స్థిరరూపుడు, అనాదియైనవాడు, కనుక, దేహములు నశించునేగాని, దేహికి ఎప్పుడును నాశనములేదు.

౨౧. ఓయి అర్జునా, ఏపురుషుడు, ఈ ఆత్మనిత్యుడనిన్ని, ఏకరూపియనిన్ని, వికారరహితుడనిన్ని, పుట్టువులేనివాడనిన్ని, క్షయరహితుడనిన్ని, తెలిసికొనుచున్నాడో, అట్టి పురుషుడు, ఒకరిని ఎట్లు చంపును, మఱి ఒకరిచేత ఎట్లు చంపించును.

౨౨. మనుష్యుడు, జీర్ణవస్త్రములను పారవైచి, నూతన వస్త్రములను ఏప్రకారము ధరించుచున్నాడో, ఆప్రకారమే, శిథిలములైన దేహములను ఆత్మవిడిచి, నూతనములైన ఇతరశరీరములను, గ్రహించుచున్నాడు.

౨౩. నైనంఛిందంతిశస్త్రాణి నైనందహతిపావకః।
నచైనంక్లేదయంత్యాపో నశోషయతిమారుతః॥

౨౪. అచ్ఛేద్యోయమదాహ్యోయ మక్లేద్యోశోష్య ఏ
వచ।
నిత్యస్సర్వగతఃస్థాణు రచలోయంసనాతనః।

౨౫. అవ్యక్తోయమచింత్యోయ మవికార్యోయముచ్యతే।
తస్మాదేవంవిదిత్వైనం నానుశోచితుమర్హసి॥

౨౬. అథచైనంనిత్యజాతం నిత్యంవామన్యసేమృతం।
తథాపిత్వం మహాబాహో నైవంశోచితుమర్హసి॥

౨౩. ఈ ఆత్మను, ఆయుధములు భేదింపచాలవు. అగ్ని దహింప చాలదు. ఉదకములు తడుపచాలవు. వాయువు శోషింపచాలదు.

౨౪. ఈ ఆత్మ, భేదింపదగనిదై, దహింపదగనిదై, తడుపదగనిదై, శోషింప దగనిదై, నాశ రహితమైనది గానున్న, సర్వవ్యాపిగా నున్న, స్థిరస్వభావిగా నున్న, చలనము లేనిదిగా నున్న, అనాది యైనదిగా నున్న, ఉన్నది.

౨౫. ఈ ఆత్మ కన్నులకు అగోచరమనియు, మనస్సుకు అచింత్యమనియు, కర్మేంద్రియములకు విషయము గాదనియు, తెలియుము. అట్లు తెలిసినపిమ్మట, ఈ ఆత్మను గురించి, నీవు దుఃఖింపదగవు.

౨౬. ఓయి అర్జునా, శరీరధర్మములైన జననమరణములు, దేహికేయున్నవని, ఒకవేళ నీవు దలచినా, నీవు, అందుకున్నా దుఃఖించుటకు, అర్హుడవు కావు.

౨౭. జాతస్యహి ధ్రువోమృత్యు ర్ధ్రువంజన్మమృతస్యచ।
తస్మాదపరిహార్యేర్థే నత్వంశోచితు మర్హసి॥

౨౮. అవ్యక్తాదీనిభూతాని వ్యక్తమధ్యానిభారత।
అవ్యక్తనిధనాన్యేవ తత్రకాపరిదేవనా॥

౨౯. ఆశ్చర్యవత్పశ్యతికశ్చిదేన మాశ్చర్యవద్వదతితథైవ
చాన్యః।
ఆశ్చర్యవచ్చైన మన్యశ్శృణోతి శ్రుత్వాప్యేనంవేద
నచైవకశ్చిత్॥

౨౭. ఎందుకనగా, పుట్టిన వానికి మరణము నిశ్చయము, మరణము పొందినవానికి తిరుగా జన్మము నిశ్చయము, ఇట్లు తప్పింపకూడని పనులకు, నీవు దుఃఖించడము సరిగాదు.

౨౮. ఓయి అర్జునా, ప్రాణికోట్లయొక్క పూర్వస్థితి వ్యక్తముగానిది. మధ్యకాలమునందు అగుపడుచున్నది. అంత్యకాలమందున్ను అవ్యక్తముగా గలది. ఇట్టి ప్రాణికోట్లవిషయమై, నీవు దుఃఖపడుట యెందుకు.

౨౯. ఈ ఆత్మను, ఒకా నొకడు, యోగసిద్ధివల్ల అత్యద్భుత వస్తువుగా చూచుచున్నాడు. మఱియొకడు, ఈ ఆత్మను, అత్యద్భుత వస్తువని చెప్పుచున్నాడు. మరియొకడు, ఈ ఆత్మ, అత్యద్భుత వస్తువని, వినుచున్నాడు. ఈ ప్రకారము చూచిన్నీ, నోటచెప్పిన్నీ, వినిన్ని, దాని స్వరూపమును, ఎవ్వడున్నూ ఎరుంగడు.

౩౦. దేహీనిత్యమవధ్యోఽయం దేహేసర్వస్యభారత।
తస్మాత్సర్వాణిభూతాని నత్వంశోచితుమర్హసి॥

౩౧. స్వధర్మమపిచావేక్ష్య నవికంపితుమర్హసి।
ధర్మ్యాద్ధియుద్ధాచ్ఛ్రేయోన్యత్ క్షత్రియస్యనవి
ద్యతే॥

౩౨. యదృచ్ఛయాచోపపన్నం స్వర్గద్వారమపావృతం।
సుఖినఃక్షత్రియాఃపార్థ లభంతేయుద్ధమీదృశం॥

౩౩. అథచేత్త్వంధర్మ్యమిమం సంగ్రామంనకరిష్యసి।
తతస్స్వధర్మంకీర్తించ హిత్వాపాపమవాప్స్యసి

౩౦. ఓయి అర్జునా, సమస్తప్రాణికోట్లయొక్క దేహములు సంహరింపబడగా, వాటికి అంతర్యామి యైన ఆత్మ, ఎప్పుడున్ను సంహరింపబడేదిగాదు. గనుక, నీవు, ప్రాణికోట్లనుగుఱించి దుఃఖింప నర్హుడవుగావు.

౩౧. నీక్షత్రియజాతి ధర్మములు. నీవు ఎఱింగియు, ఇప్పుడు చంచల చిత్తుఁడవుగా నుండడము, సరిగాదు. క్షత్రియునకు, ధర్మముతోఁగూడిన యుద్ధమునకంటె, వేరు శ్రేయస్కరమైన కార్యములేదు.

౩౨. ప్రయత్నములేకనే ప్రాప్తమైన యుద్ధము, స్వర్గ ద్వారముగా నెంచదగినది. దానిని, నీవు వదలిపెట్టుచు న్నావు. నీవంటి క్షత్రియులందఱు, స్వర్గాపేక్షగలవారై, తనంతట లభించిన యుద్ధమును, జేయుచున్నారు.

౩౩. ధర్మయుక్తమైన ఈ యుద్ధమును, నీవు చేయక పోయితివేని, నీక్షత్రియ ధర్మమును, యశస్సును, పోగొట్టు కొన్ని, పాపమును పొందగలవు.

౩౪. అకీర్తించాపిభూతాని కథయిష్యంతి తేవ్యయాం।
సంభావితస్యచాకీర్తి ర్మరణాదతిరిచ్యతే॥

౩౫. భయాద్రణాదుపరతం మన్యంతేత్వాం మహారథాః।
యేషాంచత్వం బహుమతో భూత్వాయాస్యసి లా
ఘవమ్॥

౩౬. అవాచ్యవాదాంశ్చబహూన్ వదిష్యంతితవాహితాః
నిందంతస్తవసామర్థ్యం తతోదుఃఖతరన్నుకిమ్॥

౩౭. హతోవాప్రాప్స్యసేస్వర్గం జిత్వావాభోక్ష్యసే
మహీమ్।
తస్మాదుత్తిష్ఠకౌంతేయ యుద్ధాయకృతనిశ్చయః॥

౩౪. ఇంతేగాదు, సమస్తప్రాణులు, నీఅపయశస్సును, శాశ్వతముగా చెప్పుకొనుచుందురు. శౌర్యధైర్యాది గుణములు గలవారికి, అపయశస్సుకంటే, మరణము మేలుగదా.

౩౫. ఈయుద్ధమునకు సన్నద్ధులై వచ్చియుండే మహారథికులందరు, నీవుభయపడి, యుద్ధములోనుంచితొలంగినట్లుగా, తలుచుదురు: నీ ధైర్యశౌర్యాది గుణములకు, ఇంతకుమునుపు నిన్ను సన్మానించినవారు, ఇప్పుడు, నిన్ను అలక్ష్యము జేయుదురు.

౩౬. మఱియు, నీశత్రువులు, నీసామర్థ్యమునుదూషింపుచూ, చెప్పకూడని అనేకమాటలు జెప్పుదురు. అంతకంటె దుఃఖము ఏమియున్నది.

౩౭. ఓయి అర్జునా, యుద్ధములో శత్రువులచేత సంహరింపబడితివా, నీకు స్వర్గప్రాప్తికలుగును. లేక, శత్రువులను నీవుజయించితివా, భూమండలాధిపత్యభోగములు గలుగును, గనుక యుద్ధము జేయుటకు నిశ్చయించినవాడవై, లెమ్ము.

౩౮. సుఖదుఃఖేసమేకృత్వాలాభాలాభౌజయాజయౌ।
తతోయుద్ధాయయుజ్యస్వనైవంపాపమవాప్స్యసి॥

౩౯. ఏషాతేభిహితాసాంఖ్యేబుద్ధిర్యోగేత్విమాంశృణు।
బుద్ధ్యాయుక్తోయయాపార్థకర్మబంధంప్రహాస్యసి॥

౪౦. నేహాభిక్రమనాశోస్తిప్రత్యవాయోనవిద్యతే।
స్వల్పమప్యస్యధర్మస్యత్రాయతేమహతోభ
యాత్॥

౪౧. వ్యవసాయాత్మికాబుద్ధి రేకేహకురునందన।
బహుశాఖాహ్యనంతాశ్చ బుద్ధయోవ్యవసాయి
నామ్॥

౩౮. సుఖదుఃఖములను, లాభాలాభములను, జయాపజయములను, సమముగాజూచి, తర్వాత, యుద్ధమునకు ప్రారంభము జేయుము, అట్లు చేసితివేని, నీకు పాపము లేదు.

౩౯. ఓయి అర్జునా, ఇదివఱకు, ఆత్మవిచారమైన జ్ఞానము ఉపదేశింపబడినది, ఇకను, యోగవిషయమైన జ్ఞానమును వినుము. ఈ యోగమార్గమును అనుసరించుటవలన, నీవు, కర్మబంధము నివర్తించుకోగలవు.

౪౦. ఈ కర్మయోగము ప్రారంభించి, నిర్విఘ్నముగా జరుగకపోయినా, కొదవలేదు. దానివల్ల పాపము సంభవింపదు. ఈ యోగమును, స్వల్పమాత్రము ప్రారంభము చేసినా, అది, జననమరణభయమునుంచి, నివర్తింప చేయుచున్నది.

౪౧. ఓయిఅర్జునా, ఈ యోగమందు, నిశ్చయాత్మకమైనబుద్ధి ఒక్కటే ముఖ్యము, నిశ్చయములేనివారి బుద్ధులు, అంత్యములులేక, అనేకభేదములై యుండుచున్నవి.

౪౨. యామిమాంపుష్పితాంవాచం ప్రవదన్త్యవిప
శ్చితః।
వేదవాదరతాఃపార్థనాన్యద స్తీతివాదినః॥

౪౩. కామాత్మానస్స్వర్గపరాజన్మకర్మ ఫలప్రదామ్।
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతింప్రతి॥

౪౪. భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృతచేతసామ్।
వ్యవసాయాత్మికాబుద్ధి స్సమాధానవిధీయతే॥

౪౨. ఓయీ అర్జునా, వేదములయొక్క అర్థవాద ములయందు ఆసక్తులైన అవివేకులు, స్వర్గఫలముకంటె వేఱులేదనిచెప్పెడు వేదవాక్యములను, నమ్ముచున్నారు, అట్టివాక్యములు, వార్లకు, పుష్పగొత్తులతోనిండిన తీగెల రీతి, రమ్యముగా తోచుచున్నవి.

౪౩. కోరికలుగల మనస్సుగలవారు, స్వర్గాది భోగములే ఉత్తమపురుషార్థములుగా దలచి, స్వర్గఫలానంతరమందు, జన్మమునే కర్మఫలముగా నిచ్చునట్టి సుఖప్రభుత్వముల ప్రాప్తినిగూర్చి, విశేషముగాజెప్పెడు వేదవాక్యములనే, పలుమారు, ప్రమాణముగా జెప్పుచున్నారు.

౪౪. ఈ పైనజెప్పిన ప్రకారము, అర్థవాదమైన వేదముల మధురవాక్యములయందు మనస్సులయించి, భోగైశ్వర్యములను గోరిన జనులకు, స్థిరమైనబుద్ధి ఎన్నడూ గలుగదు.

౪౫. త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥

౪౬. యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే।
తావాన్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥

౪౭. కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన।
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి॥

౪౫. ఓయిపార్థ, వేదములు, త్రైగుణ్యవిషయములై యుండునవి, నీవు, త్రైగుణ్యరహితుడవున్ను, శీతోష్ణాది సుఖదుఃఖరహితుడవున్ను, శాశ్వత సత్త్వగుణ విశిష్టుడ వున్ను, యోగక్షేమ రహితుడవున్ను, ఆత్మజ్ఞానము గల వాడవున్ను, కమ్ము.

౪౬. అనేకకూపములు, స్నానపానాదులైన వేర్వేరు పనులకు, వేర్వేరుగా నెట్లు ఉపయోగించునో, ఆప్రకా రమే, పెద్దతటాకమందుగల జలము, అన్నికార్యములకు తానొకటే ఉపయోగించుచున్నది, అటువలెనే, ఆత్మ జ్ఞానియైన బ్రాహ్మణుడు, వేదోక్తములైన సమస్తకర్మ ఫలములను, ఒక్కచోటైన [illegible]యందే. పొందుచు న్నాడు.

౪౭. నీవు, నిత్యనైమిత్తికాది[illegible]కర్మ ఫల ములయందు కోరికలేకనే, శ్రద్ధతో నాచర[illegible]ము. కర్మఫల ములయందుఆశయుంచి, కర్మలు జేయకుము. అట్లని, కర్మ ను వదలిబెట్టవలదు.

౪౮. యోగస్థఃకురుకర్మాణి సంగంత్యక్త్వాధనంజయ।
సిద్ధ్యసిద్ధ్యోస్సమోభూత్వా సమత్వంయోగఉచ్యతే॥

౪౯. దూరేణహ్యవరంకర్మబుద్ధియోగాద్ధనంజయ।
బుద్ధౌశరణమన్విచ్ఛ కృపణాఃఫలహేతవః॥

౫౦. బుద్ధియుక్తోజహాతీహ ఉభేసుకృతదుష్కృతే।
తస్మాద్యో[redacted]స్వ యోగఃకర్మసుకౌశలం॥

౫౧. [redacted]బుద్ధియుక్తాహి[redacted] ఫలంత్యక్త్వామనీషిణః।
జన్మబంధవినిర్ముక్తాః ప[redacted]ంగచ్ఛంత్యనామయమ్॥

౪౮. ఓయి ధనంజయ, ప్రాప్తి అప్రాప్తులయందు సమదృష్టి కలగడమే, యోగమని చెప్పుదురు. నీవు, అట్టి యోగమును అభ్యసించినవాడవై, జయాపజయములను సమముగాజూచి, కోరికలు విడిచి, యుద్ధమనే కర్మమును జేయుము.

౪౯. ఓయి ధనంజయ, జ్ఞానయోగముకంటే, కర్మయోగము నికృష్టమైనది. జ్ఞాన యోగమునందు నీవు శరణు పొందుము. స్వర్గాది ఫలహేతువులైన కర్మలు, నికృష్టములైనవి.

౫౦. ఈ లోకమునందు, జ్ఞానయోగము గలవానికి పుణ్యపాపములు అంటవు. [illegible] జ్ఞానయోగమునకు యత్నమును జేయుము. [illegible] యం[illegible] ఫలాపేక్ష లేక పోవడమే, యోగమనబడుచున్న[illegible]

౫౧. జ్ఞానయోగులు, క[illegible] ఫలముల[illegible] జన్మబంధములులేనివారై, నిరు[illegible]ద్రవమైన మోక్షస్థానమును, పొందుచున్నారు.

౫౨. యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి।
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ॥

౫౩. శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా।
సమాధావచలా బుద్ధి స్తదా యోగమవాప్స్యసి॥

---

అర్జున ఉవాచ.

౫౪. స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ।
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్॥

శ్రీభగవానువాచ.

౫౫ ప్రజహాతి [illegible]దా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్।
ఆత్మన్యేవాత్మనా తుష్ట[illegible] స్థితప్రజ్ఞ స్తదోచ్యతే॥

౫౨. ఎప్పుడైతే, మోహము వల్ల కలిగిన కల్మషమును, నీబుద్ధి వదలి పెట్టుచున్నదో, అప్పుడే నీకు, అది వఱకు వినిన వేదార్థములున్ను, ఇకను వినదగిన వేదార్థములున్ను, సమాప్తియగుచున్నవి.

౫౩. వేద శ్రవణముచేత, ముందు చలింప జేయబడిన నీబుద్ధి, ఎప్పుడైతే అచంచలమై, సమాధిలో నుండునో, అప్పుడు, నీవు యోగమును పొందగలవు.

---

అర్జున వాక్యము.

౫౪. ఓ కేశవ ఈ పైనచెప్పినప్రకారము, సమాధియందు స్థితప్రజ్ఞగల పురుషునకు; ఏమి లక్షణము, వాడు ఎట్లు మాటలాడును, ఎట్లుండును, ఎట్లు నడుచును.

---

శ్రీకృష్ణుల వాక్యము.

౫౫. ఓయిపార్థ, ఎప్పుడైతే, ప్రత్యగాత్మ స్వరూపమునందు, తనకు తానే ఆనందించి, మనోగతములైన సమస్తకామములను, విడిచిపెట్టు చున్నాడో, అప్పుడు, స్థితప్రజ్ఞుడని చెప్పబడును.

౫౬. దుఃఖేష్వనుద్విగ్నమనా స్సుఖేషువిగతస్పృహః।
వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే॥

౫౭. యస్సర్వత్రానభిస్నేహ స్తత్తత్ ప్రాప్యశుభాశు
భమ్।
నాభినందతినద్వేష్టి తస్యప్రజ్ఞాప్రతిష్ఠితా॥

౫౮. యదాసంహరతేచాయం కూర్మోంగానీవసర్వశః।
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్యప్రజ్ఞాప్రతిష్ఠితా॥

౫౯. విషయావినివర్తంతే నిరాహారస్య దేహినః
రసవర్జంరసోప్యస్య పరందృష్ట్వానివర్తతే॥

౫౬. ఆధ్యాత్మిక, ఆధి భౌతిక, ఆధిదైవిక, దుఃఖములు గలిగినపుడు, భయపడని మనస్సు గలవాడున్ను, సుఖములయందు ఆశ లేనివాడున్ను, భయము, రోషము, ప్రీతి, లేనివాడున్ను, ఎపుడు అగునో, అపుడు, వాడు, స్థితప్రజ్ఞుడైన మునియని జెప్పబడును.

౫౭. ఏపురుషుడు, సకల విషయములయందు అభిలాష లేనివాడై, అప్రార్థితప్రాప్తములైన శుభాశుభములను బొందియు, సుఖదుఃఖములను జెందడో, అట్టిపురుషుడు, స్థితప్రజ్ఞుడని జెప్పబడును.

౫౮. మఱియు, తాబేలు, తన కరచరణాద్యవయవములను లోపలికి ఈడ్చుకొనురీతిగా, ఎప్పుడైతే, యోగి, తన ఇంద్రియములను, సర్వ విషయములలోనుంచి మరలించుకొనుచున్నాడో, అపుడు, అతడు స్థిరప్రజ్ఞుడగును.

౫౯. ఉపవాసాదులు జేయు పురుషునకు, ఇంద్రియములనుంచి, ఆయా ఇంద్రియ విషములు మాత్రము నివర్తించునేగాని, అభిలాష వదలదు. పరమాత్మను, జ్ఞానముచేత తెలిసికొన్నిన పురుషునికైతేనో, అభిలాష కూడా నివర్తించును.

౬౦. యతతోహ్యపికౌంతేయ పురుషస్యవిపశ్చితః।
ఇంద్రియాణిప్రమాథీని హరంతిప్రసభంమనః॥

౬౧. తానిసర్వాణిసంయమ్య యుక్తఆసీతమత్పరః।
వశేహియస్యేంద్రియాణి తస్యప్రజ్ఞాప్రతిష్ఠితా॥

౬౨. ధ్యాయతో విషయాన్పుంస స్సంగ స్తేషూప జా
యతే।
సంగాత్సం జాయతేకామః కామాత్ క్రోధోభిజా
యతే॥

౬౩. క్రోధాద్భవతిసమ్మోహ స్సమ్మోహాత్ స్మృతివిభ్ర
మః।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి

౬౦. ఓయి కౌంతేయా, బ్రహ్మప్రాప్తికొఱకు, ఇంద్రియనిగ్రహము చేయుటకు ప్రయత్నముచేసే వివేకులయొక్క మనస్సునుగూడా, ఈ ఇంద్రియములు, బలాత్కారముగా చలింపజేయుచున్నవి.

౬౧. అట్టి ఇంద్రియములను నిగ్రహించి, యోగియై, నాయందు ఆసక్తి గలవాడై, యుండవలసినది. ఎవరికైతే, యింద్రియములు స్వాధీనములై యుండునో, అట్టి పురుషులు స్థితప్రజ్ఞ గలవారు.

౬౨. విషయములను దలచే వానికి, తదాసక్తి గలుగుచున్నది. ఆయాసక్తిచేత భోగేచ్ఛ పుట్టుచున్నది. ఆభోగేచ్ఛకు విరోధము గలుగునపుడు, క్రోధము గలుగుచున్నది.

౬౩. క్రోధమువల్ల అవివేకము గలుగుచున్నది. అందువలన విస్మృతి గలుగును. తదనంతరము బుద్ధి నశించును. దానిపిదప, తాను చెడిపోవును.

౬౪. రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్।
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి॥

౬౫. ప్రసాదేసర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే।
ప్రసన్నచేతసోహ్యాశు బుద్ధిఃపర్యవతిష్ఠతి॥

౬౬. నాస్తిబుద్ధిరయుక్తస్య నచాయుక్తస్య భావనా।
నచాభావయతశ్శాంతి రశాంతస్యకుతస్సుఖమ్॥

౬౭. ఇంద్రియాణాంహిచరతాం యన్మనోనువిధీయతే।
తదస్యహరతిప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి॥

౬౪. ఎవ్వడైతే, ప్రియాప్రియములులేక, ఇంద్రియములను తన మనస్సునకు స్వాధీనము చేసికొనుచున్నాడో, అట్టివాడు, శరీరపోషక మాత్రేంద్రియ విషయములను, అనుభవించువాడైనప్పటికిన్ని, వాడు, నిర్మలత్వమును పొందుచున్నాడు.

౬౫. ఇట్టి నిర్మల చిత్తముగల పురుషుని, ఏ దుఃఖమున్ను అంటదు. అట్టి స్వచ్ఛమైన మనస్సుగల పురుషునకు, అతిత్వరలో, బుద్ధి స్థిరమగుచున్నది.

౬౬ ఇంద్రియ నిగ్రహములేనివానికి, ఆత్మవిషయమైన బుద్ధిలేదు, ఆత్మస్వరూప భావనయున్ను లేదు. పరబ్రహ్మభావన జేయనివానికి, చిత్తోపరతిలేదు, వానికి, బ్రహ్మానంద సుఖము, ఎచ్చటనుంచి గలుగును.

౬౭. ఎవనియొక్క ఇంద్రియములు, వాని మనస్సునకు స్వాధీనములేక, విషయములయందు ఇచ్ఛావిహారముగానుండునో, అట్టి మనస్సు, వానియొక్క ఆత్మానాత్మవివేకమును, నీళ్లలోని ఓడను, గాలి త్రిప్పటలు పెట్టిన రీతిగా, త్రిప్పటలు బెట్టును.

౬౮. తస్మాద్యస్యమహాబాహో నిగృహీతానిసర్వశః।
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్యప్రజ్ఞాప్రతిష్ఠితా॥

౬౯. యానిశాసర్వభూతానాం తస్యాంజాగర్తిసంయమీ।
యస్యాంజాగ్రతిభూతాని సానిశాపశ్యతోమునేః॥

౭౦. ఆపూర్యమాణమచలప్రతిష్ఠం సముద్రమాపఃప్రవి
తద్వత్కామాయంప్రవిశంతి సర్వేసశాంతిమాప్నో
తినకామకామీ॥

౬౮. ఓయి అర్జున, ఎవనియొక్క ఇంద్రియములు. సమస్త విషయములనుంచి త్రిప్పబడినవో, అట్టి పురుషునిబుద్ధి, స్థితప్రజ్ఞయగుచున్నది.

౬౯. ఆత్మానాత్మ వివేకజ్ఞానము, పామరులకు. గోచరముగానిదై, చీకటివలెయుండునది. ఆచీకటియందే, ఆత్మజ్ఞానముగలవాడు, స్వస్వరూపమును తెలిసికొనుచున్నాడు. ఏ జాగ్రదవస్థయందు, సమస్తభూతములు, విషయముల ననుభవించుచున్నవో, ఆజాగ్రదవస్థ, జ్ఞానికి అంధకారమువంటిది.

౭౦. సమస్తనదీనదముల జలములు, సముద్రములో ప్రవేశించిన్నీ, ఆసముద్రము, హద్దుమీరకనే స్థిరముగానున్నది. ఆప్రకారమే, ఇంద్రియవిషయములన్నియు, అచంచలమనస్సుగల పురుషునియందు ప్రవేశించినా, ఆ పురుషుడు, నిర్వికారుడై, శాంత చిత్తముగలవాడుగా నుండును. విషయాసక్తుడైన పురుషుడు, శాంతిని పొందచాలడు.

౭౧. విహాయకామాన్యస్సర్వాన్ పుమాంశ్చరతిని
స్పృహః।
నిర్మమోనిరహంకార స్సశాంతిమధిగచ్ఛతి॥

౭౨. ఏషాబ్రాహ్మీస్థితిఃపార్థనైనాం ప్రాప్యవిముహ్యతి।
స్థిత్వాస్యామంతకాలేపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి॥

---

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
సాం ఖ్య యో గో నా మ
ద్వితీయోధ్యాయః.

---

౭౧. ఏ పురుషుడు, సమస్త కామములను వదలి, ఆత్మాభిమానములేక, అహంకారమమకారములువిడిచి, సంచరించు చున్నాడో, అట్టి పురుషుడు, మోక్షమును బొందును.

౭౨. ఓయి పార్థ, ఈపైన జెప్పినది బ్రహ్మతత్త్వము. ఈ బ్రహ్మతత్త్వము తెలిసినవారు, మరల మోసపోరు. ఇట్టి బ్రహ్మతత్త్వము, అవసానకాలమందు కూడ గలిగిన వానికి, మోక్షము గలుగును. బాల్యము మొదలు, ఈ జ్ఞానముగలవాని విషయమై, యేమని జెప్పవచ్చును.



ఇట్లని ఉపనిషద్రూపమైనట్టియు పరబ్రహ్మవిద్యయైనట్టి
భగవద్గీతలనెడు శ్రీకృష్ణార్జున సంవాదరూపమైన
యోగశాస్త్రమునందు సాంఖ్యయోగమను
రెండవ అధ్యాయము ముగిసెను.

# కర్మయోగః.

అర్జున ఉవాచ.

౧. జ్యాయసీచేత్కర్మణస్తే మతాబుద్ధిర్జనార్దన।
తత్కింకర్మణిఘోరేమాం నియోజయసికేశవ॥

౨. వ్యామిశ్రేణైవవాక్యేనబుద్ధింమోహయసీవమే।
తదేకంవదనిశ్చిత్య యేనశ్రేయోహమాప్నుయామ్॥

---

శ్రీభగవాన్ ఉవాచ.

౩. లోకేస్మిన్ద్వివిధానిష్ఠా పురాప్రోక్తామయానఘ।
జ్ఞానయోగేనసాంఖ్యానాం కర్మయోగేనయోగినామ్॥

౪. నకర్మణామనారంభాన్నైష్కర్మ్యంపురుషోశ్నుతే।
నచసన్న్యసనాదేవ సిద్ధింసమధిగచ్ఛతి॥

## కర్మ యోగము.



అర్జున వాక్యము.

౧. ఓ జనార్దనా, జ్ఞానమార్గము, కర్మమార్గమున కంటె శ్రేష్ఠమాయనేని, నన్ను, ఘోరమైనకర్మయందు ఎందుకు ప్రేరేపణ చేయుచున్నావు.

౨. సంశయవాక్యములచేత, నాబుద్ధిని కలవరబెట్టు వానివలెనున్నావు. దేనిచేత నేను శ్రేయస్సునుబొందు దునో, ఆ ఒక్కటిని నిశ్చయించి, నాకు జెప్పుము.

---

శ్రీకృష్ణుల వాక్యము.

౩. విచారపరులకు జ్ఞానయోగముచేతను, కర్మనిష్ఠు లకు కర్మచేతను, రెండు విధములైన నిష్ఠ నాచేతచెప్ప బడినది.

౪. పురుషుడు, కర్మారంభముచేయనందువల్ల, వానికి జ్ఞానయోగనిష్ఠ కలుగదు. కర్మపరిత్యాగ మాత్రము వలన, పురుషుడు, నైష్కర్మ్యలక్షణజ్ఞానసిద్ధిని బొందడు.

౫. నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః॥

౬. కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే

౭. యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున।
కర్మేంద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే॥

౮. నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః।
శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః॥

౯. యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః।
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగస్సమాచర॥

౫. పురుషుఁడు, క్షణమైనను, కర్మ చేయక నుండఁడు. సర్వజనము, ప్రకృతిలోఁబుట్టిన గుణములచేత, స్వాధీనము లేనిదై, కర్మను చేయుచున్నది.

౬. వివేకశూన్యుఁడై, ఎవ్వఁడైతే, కర్మేంద్రియములను నిగ్రహించి, మనస్సుచేత ఇంద్రియ విషయములను చింతించు చున్నాఁడో వాఁడు, దబ్బర యాచారము గల వాఁడని చెప్పఁబడును

౭. ఓయి అర్జున, ఎవ్వఁడైతే, మనస్సుచేత ఇంద్రియములను నిగ్రహించి, ఫలాకాంక్ష లేకనే, కర్మను జేయుచున్నాఁడో, వాఁడు, ఉత్తముఁడనఁబడును.

౮. నీవు, కర్మను నియమముగా జేయుము. కర్మ చేయక యుండుటకంటే, కర్మ చేయడము శ్రేష్ఠము. కర్మ లేకపోయిన, నీకు, దేహయాత్ర కూడా జరుగదు.

౯. ఓయి అర్జున, భగవదర్థమైన కర్మ దక్క, తక్కిన కర్మ, బంధకము, భగవదర్థమైన కర్మను ఫలకాంక్ష లేని వాఁడవై, నీవు ఆచరింపుము.

౧౦. సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।
అనేనప్రసవిష్యధ్వ మేషవోఽస్త్విష్టకామధుక్॥

౧౧. దేవాన్భావయతానేన తేదేవాభావయంతువః।
పరస్పరంభావయంత శ్రేయఃపరమవాప్స్యథ॥

౧౨. ఇష్టాన్భోగాన్ హివోదేవా దాస్యంతే యజ్ఞభావి
తాః।
తైర్దత్తానప్రదాయైభ్యో యోభుఙ్క్తే స్తేనఏవసః॥

౧౩. యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః।
భుంజతేతేత్వఘంపాపా యేపచంత్యాత్మకార
ణాత్॥

౧౪. అన్నాద్భవంతిభూతాని పర్జన్యాదన్నసంభవః।
యజ్ఞాద్భవతిపర్జన్యో యజ్ఞఃకర్మసముద్భవః॥

౧౦. చతుర్ముఖబ్రహ్మ, ప్రజలను యజ్ఞములతోకూడ సృష్టించి, ఈయజ్ఞములవల్ల మీరు వృద్ధిపొందుడు, అవి మీకు అభీష్టముల నిచ్చునని, పలికెను.

౧౧. ఈ యజ్ఞములచేత దేవతలను పూజించిన. వారు, మిమ్ములను వృద్ధి పొందింపుదురు, మీరు, పరస్పర సహాయభూతులై, క్షేమము పొందగలరు.

౧౨. యజ్ఞముచేత సంతోషించిన దేవతలు, మనుష్యులకు, అభీష్టములైన భోగములనిత్తురు. వారిచేత నివ్వబడిన భోగములను, వారికి సమర్పింపక, ఎవ్వడైతే అనుభవించుచున్నాడో, వాడు చోరుడు.

౧౩. యజ్ఞశేషమును, ఎవ్వరు భుజింపుచున్నారో, వారు, సర్వపాపములనుంచి విముక్తులగుదురు. ఎవ్వరైతే, ఆత్మార్థమై పాకముచేసి కొనుచున్నారో, వారు, పాపమునే భుజింపుచున్నారు.

౧౪. ప్రాణులు, అన్నమువలన బుట్టుచున్నారు. అన్నము, వర్షదేవతవలన బుట్టుచున్నది. వర్షదేవత, యజ్ఞము వలన బుట్టుచున్నది. యజ్ఞము, కర్మవలన గలుగుచున్నది.

౧౫. కర్మబ్రహ్మోద్భవంవిద్ధి బ్రహ్మాక్షర సముద్భవమ్।
తస్మాత్సర్వగతంబ్రహ్మ నిత్యంయజ్ఞే ప్రతిష్ఠితమ్॥

౧౬. ఏవంప్రవర్తితంచక్రం నానువర్తయతీహయః।
అఘాయురింద్రియారామో మోఘంపార్థ సజీవతి॥

౧౭. యస్త్వాత్మరతిరేవస్యా దాత్మతృప్తశ్చమానవః।
ఆత్మన్యేవచసంతుష్ట స్తస్యకార్యంనవిద్యతే॥

౧౮. నైవతస్యకృతేనార్థో నాకృతేనేహకశ్చన।
నచాస్యసర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః॥

౧౯. తస్మాదసక్తస్సతతం కార్యంకర్మసమాచర।
అసక్తోహ్యాచరన్కర్మ పరమాప్నోతిపూరుషః॥

౧౫. కర్మ, వేదమువల్ల బుట్టినదిగా దెలియుము, ఆవేదము, పరమాత్మవల్ల బుట్టినది. సర్వవ్యాపియైన ఆపరమాత్మ; యజ్ఞమునందు ఎల్లప్పుడు ప్రతిష్ఠితమైయున్నయది.

౧౬. ఓయి పార్థ, ఎవ్వడైతే, ఈ ఆజ్ఞాచక్రమును అనువర్తింపడో, వాడు, పాపిగా, విషయాసక్తుడుగా, వ్యర్థముగా, బ్రతుకుచున్నవాడు.

౧౭. ఎవ్వడైతే, ఆత్మయందురతిగలిగినవాడో, ఆత్మయందుతృప్తిబొందినవాడో, ఆత్మయందే సంతోషించువాడో, అట్టివానికి, కర్మతోటి పనిలేదు.

౧౮. అటువంటి పురుషునికి, కర్మచేసిన దానివల్లగాని, చేయక బోయిన దానివల్లగాని, ప్రయోజనములేదు. అట్టివానికి, లోకవిషయములతోటి, ఏ ప్రయోజనమున్ను లేదు.

౧౯. గనుక, ఫలసంగ వర్జితుడవై, కర్మను ఎల్లప్పుడు ఆచరింపుము, అట్లుచేయు పురుషునకు, మోక్షము, సిద్ధముగా ప్రాప్తమగును.

౨౦. కర్మణైవహిసంసిద్ధి మాస్థితాజనకాదయః।
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్కర్తుమర్హసి॥

౨౧. యద్యదాచరతిశ్రేష్ఠ స్తత్తదేవేతరోజనః।
సయత్ప్రమాణంకురుతే లోక స్తదనువర్తతే॥

౨౨. నమేపార్థాస్తికర్తవ్యం త్రిషులోకేషుకించన।
నానవాప్తమవాప్తవ్యం వర్తఏవచకర్మణి॥

౨౩. యదిహ్యహంనవర్తేయం జాతుకర్మణ్యతంద్రితః।
మమవర్త్మానువర్తంతే మనుష్యాఃపార్థసర్వశః॥

౨౪. ఉత్సీదేయురిమేలోకా నకుర్యాంకర్మచేదహమ్।
సంకరస్యచకర్తాస్యా ముపహన్యామిమాః ప్రజాః॥

౨౦. జనకాదులు, కర్మానుష్ఠానముతోనే, జ్ఞాన సిద్ధిని బొందిరిగదా, లోకులు, అమార్గప్రవర్తులుగా కుండుట కై, నీవు, కర్మను అనుష్ఠించ నర్హుడవు.

౨౧. ఉత్తముడు, ఏయేకర్మలను ఆచరించు చున్నాడో, ఆయాకర్మలనే, పామర జనమున్ను ఆచరించును. ఉత్తముడు, దేనిని ప్రమాణముగా నొప్పుచున్నాడో, పామరజనమున్ను, ఆప్రమాణమునే అనువర్తించుచున్నది.

౨౨. మూడు లోకములయందున్ను, నాకు, చేయదగిన కర్మలేదు. పొందనిదిగాని, పొందదగ్గదిగాని, లేదు. అయినను, నేను, కర్మయందు వర్తించుచునే యున్నాను.

౨౩. ఓయి పార్థ, నేను, కర్మజేయక బోయితినేని, మనుష్యులందరు, అన్ని విధముల, నన్ను అనువర్తించు దురు.

౨౪. నేను, కర్మను వదలితినేని, జనులు చెడిపోవుదురు. వర్ణసంకరమును చేసినవాడ నగుచున్నాను. అప్పుడు, ఈజనులను, చెరిపినవాడ నగుదును.

౨౫. సక్తాఃకర్మణ్యవిద్వాంసో యథాకుర్వంతిభారత।
కుర్యాద్విద్వాంస్తథాసక్తశ్చికీర్షుర్లోకసంగ్రహమ్॥

౨౬. నబుద్ధిభేదంజనయే దజ్ఞానాంకర్మసంగినామ్।
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్యుక్తస్సమాచరన్॥

౨౭. ప్రకృతేఃక్రియమాణాని గుణైఃకర్మాణిసర్వశః।
అహంకారవిమూఢాత్మా కర్తాహమితిమన్యతే॥

౨౮. తత్త్వవిత్తుమహాబాహో గుణకర్మవిభాగయోః।
గుణాగుణేషువర్తంత ఇతిమత్వానసజ్జతే॥

౨౫. ఓయి భారత, పామరులు, అపేక్షతో, కర్మను ఏప్రకారముచేయుచున్నారో, ఆప్రకారమే, విద్వాంసుడు, లోకోపకారార్థమై, అపేక్షలేకనే, కర్మనుచేయవలయును.

౨౬. విద్వాంసుడు, కర్మయందు ఆసక్తిగల అవివేకులకు, కర్మాసక్తిబుద్ధిని ఛలింప జేయకూడదు. మరియెట్లన్నను, తాను, ఫలాపేక్షలేకనే కర్మజేయుచు, సమస్తకర్మలను, పామరులచేత, ఆచరింప జేయవలయును.

౨౭. అహంకార మోహితమైన మనస్సుగలవాడు, తాను, కర్తయని తలచుచున్నాడు. కర్మలు, ప్రకృతిగుణములచేత, జేయబడుచున్నవి.

౨౮. తత్వజ్ఞానియైతేనో, గుణకర్మ విభజనములు జేసి; ఇంద్రియరూపములైన గుణములు, విషయరూపములైనగుణములయందు, వర్తింపుచున్నవి యని ఎరింగి, వాటియందు ఆసక్తియుంచడు.

౨౯. ప్రకృతేర్గుణసమ్మూఢా స్సజ్జంతేగుణకర్మసు
తానకృత్స్నవిదోమందాన్ కృత్స్నవిన్నవిచాల
యేత్॥

౩౦. మయిసర్వాణికర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా।
నిరాశీర్నిర్మమోభూత్వా యుధ్యస్వవిగతజ్వరః॥

౩౧. యేమేమతమిదంనిత్య మనుతిష్ఠంతిమానవాః।
శ్రద్ధావంతోనసూయంతో ముచ్యంతేతేపికర్మభిః

౩౨. యేత్వేతదభ్యసూయంతో నానుతిష్ఠంతిమేమతమ్।
సర్వజ్ఞానవిమూఢాంస్తాన్ విద్ధినష్టానచేతసః॥

౨౯. ప్రకృతిగుణములచేత మోహితులైనవారు, గుణజన్యములైన కర్మలయందు, ఆసక్తులగుచున్నారు. ఈగుణకర్మ వ్యాపారములను తెలిసికొనినవారు, గుణకర్మలను దెలియని మూఢులను, చలింపచేయవలదు.

౩౦. గనుక, సమస్త కర్మలను నాయందు వుంచి, జ్ఞానముచేత నిష్కాముడవై, అహంకారములేనివాడవై, సంతాపము విడిచినవాడవై, యుద్ధము జేయుము.

౩౧. ఏమనుష్యులు, పైనజెప్పిన నా అభిప్రాయమును విశ్వసించి, అసూయలేక, అనువర్తించుచున్నారో, వారలు, పుణ్యపాప కర్మల ఫలములలోనుంచి, విముక్తులగుచున్నారు.

౩౨. ఏమనుష్యులైతే, ఈ పైజెప్పిన అభిప్రాయమునందు, అసూయగలవారై, అనుష్ఠానములేక యుండుచున్నారో, అట్టి అవివేకులు, జ్ఞానశూన్యులై, చెడిపోవుదురు.

33. సదృశంచేష్టతేస్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి।
ప్రకృతింయాంతిభూతాని నిగ్రహఃకింకరిష్యతి॥

3౪. ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగద్వేషౌవ్యవస్థితౌ।
తయోర్నవశమాగచ్ఛేత్తౌహ్యస్యపరిపంథినౌ॥

3౫. శ్రేయాన్స్వధర్మోవిగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మేనిధనంశ్రేయః పరధర్మోభయావహః॥

---

అర్జున ఉవాచ.

౬. అథకేనప్రయుక్తోయం పాపంచరతిపూరుషః।
అనిచ్ఛన్నపివార్ష్ణేయ బలాదివనియోజితః

---

౩౩. జ్ఞానవంతుడుగూడా, స్వకీయమైన జన్మాంతర కర్మవాసనకు దగినట్లు, ప్రవర్తించుచున్నాడు. సమస్త ప్రాణులున్ను, వారివారి జన్మాంతర కర్మవాసనలను, బొందుచున్నారు గనుక, కర్మేంద్రియ నిగ్రహమువలన అగుపని యేదియు లేదు.

౩౪. ఇంద్రియములకు, ఇంద్రియ విషయములయందు, రాగద్వేషములు గలుగుచున్నవి. అట్టిరాగద్వేషములకు, స్వాధీనుడుగాగూడదు. ఆ రాగద్వేషములు, వీనికి శత్రువులు.

౩౫. యథావిధిగా జేయబడిన పరధర్మమునకంటె, గుణహీనమైన స్వధర్మము, శ్రేష్ఠము. స్వధర్మానుష్ఠానమునందు మరణముబొందినా, శ్రేష్ఠమేను. పరధర్మము, నరకమును గలుగజేయును.

---

అర్జున వాక్యము.

౩౬. ఓయికృష్ణ, పురుషుడు, కోరనివాడైనా, దేనిచేత ప్రేరేపింపబడినవాడై, బలాత్కారముగా, ప్రేరేపింపబడిన వానివలెనే, పాపకర్మను జేయుచున్నాడు.

---

శ్రీభగవాన్ ఉవాచ.

౩౭. కామఏషక్రోధఏష రజోగుణసముద్భవః।
మహాశనోమహాపాప్మా విద్ధ్యేనమిహవైరిణమ్॥

౩౮. ధూమేనావ్రియతేవహ్ని ర్యథాదర్శోమలేనచ।
యథోల్బేనావృతోగర్భ స్తథాతేనేదమావృతమ్॥

౩౯. ఆవృతంజ్ఞానమేతేన జ్ఞానినోనిత్యవైరిణా।
కామరూపేణకౌంతేయ దుష్పూరేణానలేనచ॥

౪౦. ఇంద్రియాణిమనోబుద్ధి రస్యాధిష్ఠానముచ్యతే।
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్॥

౪౧. తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ నియమ్యభరతర్షభ।
పాప్మానంప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్॥

శ్రీకృష్ణుల వాక్యము.

౩౭. రజోగుణములో బుట్టిన ఈ కామము, తృప్తి లేనిది, ఈక్రోధము, పాపభూతమైనది. ఈ రెండింటిని, శత్రువులుగా నెరుంగవలయును.

౩౮. పొగ, నిప్పునున్ను, తుప్పు, అద్దమునున్ను, మావి గర్భ పిండమునున్ను, ఏరీతిగా గప్పియున్నవో, ఆప్రకారమే, కామము, జ్ఞానమును కప్పుకొని యున్నయది.

౩౯. ఓయి కౌంతేయ, మరిన్ని, ఈకామము, తృప్తి లేనిది, ఇచ్ఛారూపమైనది, కొరతగానే యుండునది, మరిన్ని, జ్ఞానికి నిత్యశత్రువైనది, ఇట్టికామము, జ్ఞానమును గప్పుకొని యున్నయది.

౪౦. ఈకామము, మనోబుద్ధులచేత, జ్ఞానమునుగప్పి, పురుషుని, మోహింప జేయుచున్నది.

౪౧. ఓయి అర్జున, గనుక, నీవు ప్రథమత, ఇంద్రియములను నిగ్రహింపుము. తదనంతరము, ఆత్మజ్ఞానమును అనుభవజ్ఞానమును నశింపజేసే కామమును. పాపియని లెస్సగా దెలిసి, విడిచిపెట్టుము.

౪౨. ఇంద్రియాణిపరాణ్యాహురింద్రియేభ్యఃపరంమనః।
మనసస్తుపరాబుద్ధి ర్యోబుద్ధేఃపరతస్తుసః॥

౪౩. ఏవంబుద్ధేఃపరంబుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా।
జహిశత్రుం మహాబాహో కామరూపందురాస
దమ్॥

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
కర్మ యోగో నామ
తృతీయోధ్యాయః.

౪౨. ఇంద్రియములు, దేహమునకంటె శ్రేష్ఠములు. మనస్సు, ఇంద్రియములకంటే శ్రేష్ఠము. బుద్ధి, మనస్సుకంటే శ్రేష్ఠము. ఆత్మ, బుద్ధికంటే శ్రేష్ఠము.

౪౩. ఓయి అర్జున, ఈప్రకారము, బుద్ధికంటె శ్రేష్ఠమైన ఆత్మను, లెస్సగా దెలిసికొని, బుద్ధిచేత మనస్సును నిగ్రహించి, దుఃఖోత్పత్తికి కారణభూతమైన కామమును, చంపుము.



ఇట్లని ఉపనిషద్రూపమైనట్టియు పరబ్రహ్మవిద్యయైనట్టి
భగవద్గీతలనెడు శ్రీకృష్ణార్జునసంవాదరూపమైన
యోగశాస్త్రమునందు కర్మయోగమను
మూడవ అధ్యాయము ముగిసెను.



## జ్ఞాన యోగః.

---

శ్రీభగవాన్ ఉవాచ.

౧. ఇమంవివస్వతేయోగం ప్రోక్తవానహమవ్యయమ్।
వివస్వాన్ మనవేప్రాహ మనురిక్ష్వాకవేబ్రవీత్॥

౨. ఏవంపరంపరాప్రాప్త మిమంరాజర్షయోవిదుః।
సకాలేనేహమహతా యోగోనష్టఃపరంతప॥

3. సఏవాయంమయాతేద్య యోగఃప్రోక్తఃపురాతనః।
భక్తోసిమేసఖాచేతి రహస్యంహ్యేతదుత్తమమ్॥

---

# జ్ఞాన యోగము.

---

శ్రీకృష్ణులవాక్యము.

౧. శాశ్వతమైన ఈ యోగవిద్యను, సూర్యునికి, నేను ఉపదేశము చేసితిని. అతడు, తనకొమారుడైన వైవస్వతమనువునకు, ఉపదేశించెను. అతను, ఇక్ష్వాకునకు, ఉపదేశించెను.

౨. ఈప్రకారము, పరంపరగా నుపదేశింపబడిన ఈ యోగవిద్యను, రాజఋషులు తెలిసికొనిరి. బహుకాలమైనందువల్ల, ఆ యోగవిద్య, ఈ లోకమునందు నశించెను.

3. నీవునాభక్తుడవు, స్నేహితుడవు, అని, గోప్యమై, శ్రేష్ఠమైనట్టి ఈ యోగవిద్యను, నీకు, ఆను పూర్వికముగా, నిప్పుడు, ఉపదేశించితిని.

---

అర్జున ఉవాచ.

౪. అపరంభవతోజన్మ పరంజన్మవివస్వతః।
కథమేతద్విజానీయాం త్వమాదౌప్రోక్తవాని

---

శ్రీభగవానుఉవాచ.

౫. బహూనిమేవ్యతీతాని జన్మానితవచార్జున।
తాన్యహంవేదసర్వాణినత్వంవేత్థపరంతప॥

౬. అజోపిసన్నవ్యయాత్మా భూతానామీశ్వరోపిసన్।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయ
యా॥

౭. యదాయదాహిధర్మస్య గ్లానిర్భవతిభారత
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానంసృజామ్యహమ్॥

అర్జున వాక్యము.

౪. సూర్యునిజన్మము, పూర్వము గలిగినది. నీజన్మ ము, పిదప గలిగినది. అట్లుండగా, నీవు, సూర్యునికి ఈ యోగవిద్యను ఉపదేశము చేసితివని, ఎట్లు తెలిసికొనదును.

---

శ్రీకృష్ణుల వాక్యము.

౫. ఓయి అర్జున, నాకున్ను, నీకున్ను, ఈవరకు, అనేక జన్మములు అయినవి· అవి యన్నియు, నేను ఎఱుంగుదును, నీవు ఎరుంగవు.

౬. నేను పుట్టనివాడను, అవికారుడను, ప్రాణులకు నియామకుడను, ఐనా, స్వకీయమైన ప్రకృతిని యవలంబించి, నామాయచేత, పుట్టుచున్నాను.

౭. ఓయిభారత, ఎప్పుడెప్పుడైతే ధర్మమునకు చెరుపు వచ్చునో, అధర్మమునకు అభివృద్ధిగలుగునో, అప్పుడప్పుడు, నేను అవతరించుచున్నాను.

౮. పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృ
తామ్।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥

౯ జన్మకర్మచమేదివ్య మేవంయోవేత్తితత్త్వతః।
త్యక్త్వాదేహంపునర్జన్మ నైతిమామేతిసోఽర్జున॥

౧౦. వీతరాగభయక్రోధా మన్మయామాముపాశ్రితాః।
బహవోజ్ఞానతపసా పూతామద్భావమాగతాః॥

౧౧. యేయథామాం ప్రపద్యంతే తాంస్తథైవభజమ్య
హమ్।
మమవర్త్మానువర్తంతే మనుష్యాఃపార్థసర్వశః॥

౮. మఱియు, శిష్టపరిపాలన, దుష్టనిగ్రహ, ధర్మసంరక్షణ కొఱకు, ప్రతియుగమునందు, నేను అవతరించుచున్నాను.

౯. ఓయి అర్జున, ఎవ్వఁడైతే, నాదివ్య జన్మమును, కర్మను, యథార్థముగా తెలిసికొనుచున్నాఁడో, వాఁడు, దేహము చాలించినపిదప, వేరే జన్మమును పొందఁడు, నన్నే పొందుచున్నాఁడు.

౧౦. కామమును, క్రోధమును, భయమును, వదలిపెట్టినవారై, నాస్వరూపులై, నన్ను ఆశ్రయించిన మహానుభావులు, జ్ఞానయోగముచేత పరిశుద్ధులై, నాస్వరూపమును పొందినారు.

౧౧. ఓయి పార్థ, ఎవరెవరు, ఏయే విధముగా, నన్ను ఉపాసించు చున్నారో, వారి వారిని, ఆయా ప్రకారములుగా, నేనుఅనుగ్రహించుచున్నాను. గనుక, సమస్తమైనవారలు, నామార్గమునే, సర్వ ప్రకారములుగా, అనుసరించు చున్నారు.

౧౨. కాంక్షంతఃకర్మణాంసిద్ధిం యజంతఇహదేవతాః।
క్షిప్రంహిమానుషేలోకే సిద్ధిర్భవతికర్మజా॥

౧౩. చాతుర్వర్ణ్యంమయాసృష్టం గుణకర్మవిభాగశః।
తస్యకర్తారమపిమాం విద్ధ్యకర్తారమవ్యయమ్॥

౧౪. నమాంకర్మాణిలింపంతి నమేకర్మఫలేస్పృహా।
ఇతిమాంయోభిజానాతి కర్మభిర్నసబధ్యతే॥

౧౫. ఏవంజ్ఞాత్వాకృతంకర్మ పూర్వైరపిముముక్షుభిః।
కురుకర్మైవతస్మాత్త్వం పూర్వైఃపూర్వతరంకృతమ్॥

౧౨. ఈ లోకమునందు మనుష్యులు, ఫలాపేక్ష చేత, దేవతలను పూజించుచున్నారు. ఈ మనుష్య లోకమునందు, కర్మఫలము, శీఘ్రములో లభించుచు న్నది.

౧౩. గుణములు, కర్మలు, వీట్ల భేదములచేత, నాలుగువర్ణములు, నాచేత సృజింపబడినవి. ఆ నాలుగువర్ణములకు, నేను కర్తనైనను, అవికారుణ్ణిగనుక, నన్ను, కర్తగానివానిగా తెలిసికొనుము.

౧౪. కర్మలు, నన్ను అంటవు, కర్మఫలములయందు, నాకు ఇచ్ఛలేదు. ఈరీతిగా నన్ను తెలిసికొనిన జ్ఞానికి, కర్మఫలములు బంధములుగావు.

౧౫. ఈ ప్రకారముగా తెలిసికొని, ముముక్షువులైన పూర్వీకులచేత, కర్మ జేయబడినది. గనుక, నీవును, పూర్వీకులచేత అనాదిగా జేయబడిన కర్మను, జేయుము.

౧౬. కింకర్మ కిమకర్మేతి కవయోప్యత్ర మోహితాః।
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసే శుభాత్॥

౧౭. కర్మణోహ్యపిబోద్ధవ్యం బోద్ధవ్యంచవికర్మణః।
అకర్మణశ్చబోద్ధవ్యం గహనాకర్మణోగతిః॥

౧౮. కర్మణ్యకర్మయఃపశ్యే దకర్మణిచకర్మయః।
సబుద్ధిమాన్మనుష్యేషు సయుక్తఃకృత్స్నకర్మకృత్॥

౧౯. యస్యసర్వేసమారంభాః కామసంకల్పవర్జితాః।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుఃపండితంబుధాః॥

౧౬. కర్మయనగా నెద్ది, అకర్మయనగా నెద్ది, ఈ విషయమునందు, విద్వాంసులుగూడా భ్రమించిరి. ఆ కర్మాకర్మలయొక్క విషయమును, నీకొరకై చెప్పుచున్నాను. దానిని తెలిసికొనిన, నీవు, క్షేమము పొందగలవు.

౧౭. కర్మ ఫలానిదనియు, నిషిద్ధకర్మ ఫలానిదనియు, కర్మాభావము ఫలానిదనియు, ఈ మూడు స్థితులను, చక్కగా దెలియవలయును, ఈ కర్మాకర్మ వికర్మలయొక్క, యథార్థస్థితి తెలిసికొనడము, అశక్యము.

౧౮. కర్మయందు, కర్మాభావమును, ఎవడు తెలిసికొనుచున్నాడో, కర్మాభావమునందు, కర్మను, ఎవడు తెలిసికొనుచున్నాడో, వాడు, మనుష్యులలోన బుద్ధిమంతుండు, వాడే యోగి, వాడే సమస్తకర్మలు చేసినవాడు.

౧౯. ఎవనికర్మలైతే, కామసంకల్పములేనివో, ఎవనికర్మలు, జ్ఞానమనే అగ్నిచేత దహింపబడినవో, అట్టివానిని, పండితుడని విద్వాంసులు చెప్పుదురు.

౨౦. త్యక్త్వాకర్మఫలాసంగం నిత్యతృప్తోనిరాశ్రయః।
కర్మణ్యభిప్రవృత్తోపి నైవకించిత్కరోతిసః॥

౨౧. నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః।
శారీరంకేవలంకర్మ కుర్వన్నాప్నోతికిల్బిషమ్॥

౨౨. యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతోవిమత్సరః।
సమస్సిద్ధావసిద్ధౌచ కృత్వాపిననిబధ్యతే॥

౨౩. గతసంగస్యముక్తస్య జ్ఞానావస్థితచేతసః।
యజ్ఞాయాచరతఃకర్మ సమగ్రంప్రవిలీయతే॥

౨౪. బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్।
బ్రహ్మైవతేనగంతవ్యం బ్రహ్మకర్మసమాధినా॥

౨౦. కర్మఫలాపేక్షనువిడిచి, నిత్యతృప్తుఁడై, విషయ ప్రవృత్తిలేనివాఁడు, కర్మయందు ప్రవర్తించినవాఁడైనా, అట్టివాఁడు, కర్మ చేసినవాఁడు కాచాలఁడు.

౨౧. కోరికలు వదలిపెట్టి, చిత్తస్వాధీనముగలిగి, సమస్తవిషయములయందు అభిమానము వదలి, శరీర పోషణమాత్రము కొరకు, ఉపయుక్తమైన కర్మనుచేయు పురుషుని, పాపము స్పృశింపదు.

౨౨. అప్రార్థిత లాభముచేత సంతోషించి, ద్వంద్వగుణ ములకు లోఁబడక, మత్సరములేక, సిద్ధ్య సిద్ధులయందు సముఁడై, కర్మ చేసినవాఁడు, కర్మబద్ధుఁడు కాఁడు.

౨౩. ఆసక్తిలేనివాఁడై, ముక్తుఁడై, జ్ఞానమందు స్థిర బుద్ధి గలవాఁడై, భగవత్ప్రీత్యర్థమై చేయు వానియొక్క కర్మ, నిశ్శేషముగా నశించుచున్నది.

౨౪. యజ్ఞపాత్రే బ్రహ్మమే, హోమద్రవ్యము బ్ర హ్మమే, అగ్ని బ్రహ్మమే, హోమకర్త బ్రహ్మమే, బ్రహ్మ కర్మ సమాధిచేత పొందదగిన ఫలము బ్రహ్మమే.

౨౫. దైవమేవాపరేయజ్ఞం యోగినఃపర్యుపాసతే।
బ్రహ్మాగ్నావపరేయజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి॥

౨౬. శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషుజుహ్వతి
శబ్దాదీన్విషయానన్యే ఇంద్రియాగ్నిషుజుహ్వతి॥

౨౭. సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణిచాపరే।
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతిజ్ఞానదీపితే॥

౨౫. కొందరు యోగులు, ఫలాసక్తిచేత. దేవతా యజన సాధనమైన యజ్ఞమునే, జేయుచున్నారు. మరికొందరు జ్ఞానులు, బ్రహ్మమనే అగ్నియందు, కర్మమనేహవిస్సును, హోమము చేయుచున్నారు.

౨౬. మరికొందరు యోగులు, జ్ఞానేంద్రియములను, నిగ్రహమనే అగ్నియందు, హోమముచేసి, నశింప జేయుచున్నారు. మరికొందరు, శబ్దాది విషయములను, ఇంద్రియములనే అగ్నియందు హోమముచేసి, నశింప జేయుచున్నారు.

౨౭. మరికొందరు, సమస్తములైన జ్ఞానేంద్రియ కర్మేంద్రియములయొక్క శబ్దాదివిషయములను, ప్రాణాది దశవాయువులయొక్క బహిర్గమనాది కర్మలను, జ్ఞానముచేత ప్రజ్వలింపబడిన ఇంద్రియ నిగ్రహమనెడిఅగ్నియందు హోమముచేసి, నశింపజేయుచున్నారు.

౨౮. ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథాపరే।
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చయతయస్సంశితవ్రతాః॥

౨౯. అపానేజుహ్వతిప్రాణం ప్రాణేపానంతథాపరే।
ప్రాణాపానగతీరుధ్వా ప్రాణాయామపరాయణాః॥

౨౮. మరికొందరు, పుణ్యతీర్థాదులయందు, ద్రవ్యదానమనే యజ్ఞకర్మ జేయుచున్నారు. కొందరు, దేహములను కృశింపజేయడమనే యజ్ఞకర్మ జేయుచున్నారు. కొందరు, ప్రాణాయామాది యోగములనే యజ్ఞకర్మ జేయుచున్నారు. కొందరు, వేదపారాయణ వేదార్థపరిజ్ఞానములనే యజ్ఞకర్మ చేయుచున్నారు. కొందరు, ఇంద్రియములను జయింపడమనే యజ్ఞకర్మ జేయుచున్నారు. మరికొందరు, కఠినమైన నియమములనే యజ్ఞకర్మ జేయుచున్నారు.

౨౯. మరికొందరు, అపానమునందు ప్రాణవ్యాపారమునున్ను, ప్రాణమునందు అపాన వ్యాపారమునున్ను, మరికొందరు, పూరక రేచక కుంభక ప్రాణాయామములయందు, ప్రాణాపాన వాయువుల గతులను, లయింపజేయుచున్నారు.

౩౦. అపరేనియతాహారాః ప్రాణాన్ ప్రాణేషుజుహ్వతి
సర్వేప్యేతేయజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః ॥

౩౧. యజ్ఞశిష్టామృతభుజో యాంతిబ్రహ్మసనాతనమ్ ।
నాయంలోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యఃకురుసత్తమ ॥

౩౨. ఏవంబహువిధాయజ్ఞా వితతాబ్రహ్మణోముఖే ।
కర్మజాన్విద్ధితాన్సర్వా నేవంజ్ఞాత్వావిమోక్ష్యసే ॥

౩౦. మరికొందరు, మితమైన ఆహారములు గలవారగుచు, ప్రాణవాయువులను వశీకృత వాయువులయందు, లయింపజేయుచున్నారు. ఈపైనజెప్పిన సమస్తయోగపురుషులు, యజ్ఞకర్మలు దెలిసినవారు గనుక, తమ పాపములను, యజ్ఞకర్మలచేత, నశింపజేయుచున్నారు.

౩౧. ఓయి అర్జున, యజ్ఞకర్మలో మిగిలిన శేషమును భుజించినవారు, శాశ్వతమైన బ్రహ్మమునుపొందుచున్నారు. ఈ పైనజెప్పిన యజ్ఞకర్మలలో, నొకటినైనా జేయనివానికి, ఈ లోకమునందు సౌఖ్యముగలుగదు. అట్టివానికి, పరలోకప్రాప్తి ఎక్కడిది.

౩౨. ఈపైనజెప్పిన రీతిగా, నానావిధములైన యజ్ఞకర్మలు వేదమువల్ల విధింపబడినవి. ఆ యజ్ఞములన్నియు, కర్మరూపములని దెలియుము. ఈ ప్రకారము తెలిసికొంటివేని, నీవు, సంసారబంధములోనుంచి,నివర్తుడవగుచున్నావు.

౩౩. శ్రేయాన్ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞఃపరంతప।
సర్వంకర్మాఖిలంపార్థ జ్ఞానేపరిసమాప్యతే॥

౩౪. తద్విద్ధిప్రణిపాతేన పరిప్రశ్నేనసేవయా।
ఉపదేక్ష్యంతి తేజ్ఞానం జ్ఞానినస్తత్వదర్శినః

౩౫. యద్జ్ఞాత్వానపునర్మోహ మేవంయాస్యసిపాండవ।
యేనభూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథోమయి॥

౩౬. అపిచేదసిపాపేభ్య స్సర్వేభ్యఃపాపకృత్తమః।
సర్వంజ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి॥

౩౩. ఓయి పార్థ, ద్రవ్యసాధన సాధ్యమైన యజ్ఞముకంటే, జ్ఞానస్వరూపమైన యజ్ఞము బహుశ్రేష్ఠము. సమస్తకర్మలు బ్రహ్మజ్ఞానమునందు, లయించుచున్నవి.

౩౪. ఇట్టి బ్రహ్మజ్ఞానమును, తత్వవిదులైన జ్ఞాననిష్ఠులను ఆశ్రయించి, వారికి శిశ్రూషలు జేసి, సాష్టాంగనమస్కారములు జేసి, ప్రార్థనజేసి, తెలిసికొనుము. వారు, ఉపదేశము జేయుదురు.

౩౫. ఓయి అర్జున, పరబ్రహ్మజ్ఞానమును బొందితివేని, మరల నీకు, ఇట్లు బుద్ధి మోహము గలుగదు. ఈ నజెప్పిన పరబ్రహ్మ జ్ఞానమువల్ల, సమస్త చరాచరభూతములను, ఆత్మరూపమైన నాయందు, దర్శింపగలవు.

౩౬. పాపిష్ఠులలో, నీవు మహాపాపివైనా, సమస్తపాపమును, ఈజ్ఞానమనే తెప్పచేత, దాటగలవు.

౩౭. యథైధాంసిసమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున।
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతేతథా॥

౩౮. నహిజ్ఞానేనసదృశం పవిత్రమిహవిద్యతే।
తత్స్వయంయోగసంసిద్ధః కాలేనాత్మనివిందతి॥

౩౯. శ్రద్ధావాఀల్లభతేజ్ఞానం తత్పరస్సంయతేంద్రియః
జ్ఞానంలబ్ధ్వాపరాంశాంతి మచిరేణాధిగచ్ఛతి॥

౪౦. అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మావినశ్యతి।
నాయంలోకోఽస్తినపరో నసుఖంసంశయాత్మనః॥

౩౭. ఓయి అర్జున, చక్కగా ప్రజ్వలించే అగ్ని, దారువులను ఏప్రకారము భస్మముజేయుచున్నదో, ఆప్రకారమే, జ్ఞానమనే అగ్ని, సమస్తకర్మలను, భస్మముజేయుచున్నది.

౩౮. ఈలోకమునందు, జ్ఞానముకంటె వేరేపావనమైనది లేదు. ఆజ్ఞానమును, యోగసిద్ధుడు, కాలానుగుణ్యముగా, తానే తనయందు పొందుచున్నాడు.

౩౯. శ్రద్ధయు, జ్ఞానాపేక్షయు, ఇంద్రియనిగ్రహము, గలపురుషుడు, జ్ఞానమునుపొందును. అట్లు జ్ఞానమును పొంది, అతిశీఘ్రములో, ఉత్కృష్టమైన చిత్తోపరతిని పొందును.

౪౦. జ్ఞానములేనివాడున్ను, శ్రద్ధలేనివాడున్ను, సంశయాత్మగలవాడున్ను, చెడిపోవును. సంశయాత్మకునికి, ఇహలోక పరలోక సుఖములు, గలుగవు.

౪౧. యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్।
ఆత్మవంతంనకర్మాణి నిబధ్నంతిధనంజయ॥

౪౨. తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థంజ్ఞానాసినాత్మనః।
ఛిత్త్వైనంసంశయంయోగ మాతిష్ఠోత్తిష్ఠభారత॥



ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే
జ్ఞా న యో గో నా మ
చతుర్థోధ్యాయః.

౪౧. ఓయి ధనంజయ, యోగముచేత కర్మలు విడిచినవాఁడై, జ్ఞానముచేత సంశయ విముక్తుఁడై, దృఢమైన మనస్సుగలవాఁడైన పురుషుని, కర్మలు బంధింపవు.

౪౨. ఓయి భారత, అజ్ఞానసంభూతమైన నీమనస్సులోని సంశయమును, జ్ఞానమనే ఖడ్గముచేత ఖండించి, యోగమును అనుష్ఠింపుము, యుద్ధమునకులెమ్ము.



ఇట్లని ఉపనిషద్రూపమైనట్టియు, పరబ్రహ్మవిద్యయైనట్టి
భగవద్గీతలనెడు శ్రీకృష్ణార్జున సంవాదరూపమైన
యోగశాస్త్రమునందు జ్ఞానయోగమను
నాల్గవ అధ్యాయము ముగిసెను.

---

# కర్మసన్న్యాసయోగః.



అర్జున ఉవాచ.

౧. సన్న్యాసంకర్మణాం కృష్ణ పునర్యోగంచశంససి ।
యచ్ఛ్రేయఏతయోరేకం తన్మేబ్రూహిసునిశ్చితమ్ ॥



శ్రీభగవాన్ ఉవాచ.

౨. సన్న్యాసఃకర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ ।
తయోస్తుకర్మసన్న్యాసాత్కర్మయోగోవిశిష్యతే ॥

# కర్మసన్న్యాసయోగము.



## అర్జున వాక్యము.

౧. ఓయికృష్ణ, నీవు ఒకప్పుడు, కర్మలను పరిత్యాగము జేయమనిన్నీ, మరి ఒకప్పుడు, కర్మలను జేయమనిన్నీ, జెప్పుచున్నాడవు. ఈరెండింటిలో ఎద్ది శ్రేష్ఠమో. అది నాకు నిశ్చయించి చెప్పుము.



## శ్రీకృష్ణుల వాక్యము.

౨. కర్మపరిత్యాగమున్ను, కర్మానుష్ఠానమున్ను, ఈ రెండుమార్గములు మోక్షసాధకములేను, అయినా, ఈ రెండుమార్గములలో, కర్మపరిత్యాగమునకంటే, కర్మానుష్ఠానము శ్రేష్ఠముగానున్నయది.

౩. జ్ఞేయస్సనిత్యసన్న్యాసీ యోనద్వేష్టినకాంక్షతి।
నిర్ద్వంద్వోహిమహాబాహో సుఖంబంధాత్ప్రము
చ్యతే॥

౪. సాంఖ్యయోగౌపృథగ్బాలాః ప్రవదంతినపండితాః
ఏకమప్యాస్థితస్సమ్య గుభయోర్విందతేఫలమ్॥

౫. యత్సాంఖ్యైఃప్రాప్యతేస్థానం తద్యోగై రపి గమ్య
తే।
ఏకంసాంఖ్యంచయోగంచ యఃపశ్యతిసపశ్యతి॥

౬. సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయో
గతః।
యోగయుక్తోమునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి॥

౩. ఓయి అర్జున, ఎవ్వనికి ద్వేషములేదో, ఎవనికికోరికలు లేవో, ఆకర్మయోగి నిత్యసన్న్యాసి. అతడు అనాయాసముగా, కర్మబంధములోనుంచి, విముక్తుడగుచున్నాడు.

౪. కర్మసన్న్యాసమైన సాంఖ్యమున్ను, కర్మానుష్ఠానమైన యోగమున్ను, ప్రత్యేకములని మూఢులు జెప్పుదురేగాని జ్ఞానులు జెప్పరు. ఈ రెండింటిలో, నొకటిని బాగుగా అభ్యసించినవానికి, ఆ రెండింటిఫలములు చెందుచున్నవి.

౫. సన్న్యాసముచేత పొందేస్థానము, కర్మచేతనూ పొందవచ్చును. ఎవ్వడైతే, సన్న్యాసమును, కర్మను, ఒక్కటిగానే తెలిసికొనుచున్నాడో, వాడే తెలిసినవాడు.

౬. ఓయి అర్జున, కర్మలేని సన్న్యాసమును పొందడము, కష్టము. కర్మానుష్ఠానముగల జ్ఞాని, శీఘ్రముగా బ్రహ్మమును పొందును.

౭. యోగయుక్తోవిశుద్ధాత్మా విజితాత్మాజితేంద్రియః।
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి నలిప్యతే॥

౮. నైవకించిత్కరోమీతి యుక్తోమన్యేవతత్త్వవిత్।
పశ్య౯ శృణ్వ౯ స్పృశ౯ జిఘ్రన్న శ్నన్గచ్ఛ౯ స్వప౯
శ్వస౯॥

౯. ప్రలప౯ విసృజ౯ గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి।
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంతఇతిధారయ౯॥

౭. కర్మయోగము చేయువాడు, చిత్తశుద్ధిగలిగి, మనస్సును స్వాధీనములోనుంచుకొని, ఇంద్రియములను జయించి, సమస్తభూతములు తానుగానున్న, తాను సమస్తభూతములుగానున్న, భావించి, కర్మలుచేసినా, కర్మలచేత బంధింపబడడు.

౮, ౯. బ్రహ్మజ్ఞాని, కండ్లతో చూచుచు, చెవులతో వినుచు, దేహముచేత తాకుచు, ముక్కుచేత వాసన చూచుచు, జిహ్వచేత భక్షించుచు, కాళ్లచేత నడుచుచు, నిద్రించుచు, శ్వాసనిశ్వాసములు విడుచుచు, మాటలాడుచు, మూత్రపురీషములను విడుచుచు, విషయములను అంగీకరించుచు, కన్నులుమూయుచు, తెరుచుచు, ఇంద్రియములు ఇంద్రియ విషయములయందు ప్రవర్తించుచున్నవేగాని, పరబ్రహ్మమైనతాను, ఏమియు చేయలేదని, చిత్తశుద్ధిగలిగి తలచును.

౧౦. బ్రహ్మణ్యాధాయకర్మాణి సంగంత్యక్త్వాకరోతియః।
లిప్యతేనసపాపేన పద్మపత్రమివాంభసా॥

౧౧. కాయేనమనసాబుద్ధ్యా కేవలైరింద్రియైరపి।
యోగినఃకర్మకుర్వంతి సంగంత్యక్త్వాత్మశుద్ధయే॥

౧౨. యుక్తఃకర్మఫలంత్యక్త్వా శాంతిమాప్నోతినైష్ఠికీమ్।
అయుక్తఃకామకారేణ ఫలేసక్తోనిబధ్యతే॥

౧౩. సర్వకర్మాణిమనసా సన్న్యస్యాస్తేసుఖంవశీ।
నవద్వారేపురేదేహీ నైవకుర్వన్నకారయన్॥

౧౦. ఏ పురుషుడైతే, కర్మలను బ్రహ్మార్పణముజేసి, ఆసక్తివిడిచి, వాటిని అనుష్ఠించుచున్నాడో అట్టి పురుషుఁడు, తామరాకును నీళ్లు అంటని రీతిగా, పాపముచేత స్పృశింపబడఁడు.

౧౧. కర్మయోగులు, చిత్తశుద్ధికొఱకు, ఫలాసక్తి లేకనే, శరీరము చేతను, మనస్సుచేతను, బుద్ధిచేతను, మమతాశూన్యమైన ఇంద్రియములచేతను, కర్మలు చేయుచున్నారు.

౧౨. ఫలాపేక్ష విడిచి కర్మలు జేయువాఁడు, పారమార్థికమైన చిత్తశాంతిని బొందుచున్నాఁడు. యోగి కానివాఁడు, కామప్రేరేపణచేత కర్మలుజేసి, బద్ధుఁడగుచున్నాఁడు.

౧౩. ఇంద్రియ నిగ్రహము గలవాఁడు, మనస్సుచేత సమస్త కర్మలను వదలిపెట్టి, నవద్వారములుగల పట్టణమనే దేహమునందు, తాను, కర్మ చేయనివాఁడై, మఱి ఒకరిచేత చేయించనివాఁడై, అనాయాసముగా నుండును.

౧౪. నకర్తృత్వంనకర్మాణి లోకస్యసృజతిప్రభుః।
నకర్మఫలసంయోగం స్వభావస్తుప్రవర్తతే॥

౧౫. నాదత్తేకస్యచిత్పాపం నచైవసుకృతంవిభుః।
అజ్ఞానేనావృతంజ్ఞానం తేనముహ్యంతిజంతవః॥

౧౬. జ్ఞానేనతుతదజ్ఞానం యేషాంనాశితమాత్మనః।
తేషామాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతితత్పరమ్॥

౧౭. తద్బుద్ధయస్తదాత్మాన స్తన్నిష్ఠాస్తత్పరాయణాః।
గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః॥

౧౪. ఈశ్వరుడు కర్తృత్వమును బుట్టించ లేదు, కర్మలను బుట్టించలేదు, కర్మఫల సంబంధమును గలుగ జేయలేదు, ఇవి అన్నియు, ప్రకృతివల్ల గలిగినవి.

౧౫. ఈశ్వరుడు, పురుషులయొక్క పాపమునుగాని, పుణ్యమునుగాని, గ్రహింపడు. జ్ఞానమును, అజ్ఞానము గప్పియున్నది, గనుక, పురుషులు, కర్తృత్వాద్యభిమానముచేత, మోహమును బొందుచున్నారు.

౧౬. ఎవ్వరికైతే, తమ అజ్ఞానము, జ్ఞానముచేత నశింపబడినదో, వారికి, జ్ఞానము, సూర్యునివలె, పరమాత్మను స్పష్టముగా నగుబరచుచున్నయది.

౧౭. పాపములను, జ్ఞానముచేత నశింపజేసినవారు, పరబ్రహ్మమునందే బుద్ధిగలవారై, అదే ఆత్మస్వరూపముగా గలవారై, అందే అభినివేశము గలవారై, అదే ఉత్కృష్టగతియని నిశ్చయించినవారై, పునరావర్తిరహితమైన, మోక్షమును, బొందుచున్నారు.

౧౮. విద్యావినయసంపన్నే బ్రాహ్మణేగవిహస్తిని।
శునిచైవశ్వపాకేచ పణ్డితాస్సమదర్శినః॥

౧౯. ఇహైవతైర్జితస్సర్గో యేషాంసామ్యేస్థితంమనః।
నిర్దోషంహిసమంబ్రహ్మ తస్మాద్బ్రహ్మణితేస్థితాః॥

౨౦. నప్రహృష్యేత్ప్రియంప్రాప్య నోద్విజేత్ప్రాప్యచా
ప్రియమ్।
స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణిస్థితః॥

౧౮. జ్ఞానులు, విద్యావినయములతో గూడిన బ్రాహ్మణునియందును, గోవునందును, ఏనుగయందును, శునకమందును, దానివండి భక్షించువానియందును, ఐక్యానుసంధానముజేసి, సమానదృష్టి గలవారగుదురు.

౧౯. ఎవ్వరియొక్క అంతఃకరణము, సమస్తమునందు, సమదృష్టిని బొందుచున్నదో, వారిచేతను, ఈ జన్మమునందే, మోక్షము జయింపబడినది. ఏకారణమువల్ల, పరబ్రహ్మము, ఏకమై, నిర్దోషమై, యున్నదో, ఆ కారణమువల్ల, సమదృష్టిగలవారు, పరబ్రహ్మమునందున్నవారు.

౨౦. పరబ్రహ్మమునందున్న బ్రహ్మవిత్తు, భ్రమవిడిచి, స్థిరబుద్ధిగలవాడై, ఇష్టమును బొందినపుడు సంతోషింపడు, అనిష్టమును బొందినపుడు దుఃఖింపడు.

౨౧. బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మనియత్సుఖమ్।
సబ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే॥

౨౨. యేహిసంస్పర్శజాభోగా దుఃఖయోనయఏవతే।
ఆద్యంతవంతఃకౌంతేయ నతేషురమతేబుధః॥

౨౩. శక్నోతీహైవయస్సోఢుంప్రాక్శరీరవిమోక్షణాత్।
కామక్రోధోద్భవంవేగం సయుక్తస్ససుఖీనరః॥

౨౪. యోఽంతస్సుఖోఽంతరారామస్తథాంతర్జ్యోతిరేవయః।
సయోగీబ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి॥

౭౧. ఆసక్తిలేకనే, ఇంద్రియవిషయముల యందు, యేసుఖమును, యోగి, అనుభవించుచున్నాడో, ఆసుఖమునే, పరబ్రహ్మమునందున్ను, అనుభవించుచున్నాడు.

౨౨. ఓయి అర్జున, విషయేంద్రియములవలన పుట్టు సుఖములు, ఆద్యంతములుగలవిగనుక, ఆ సుఖములను, దుఃఖాస్పదములుగా దెలియుము, అందువలన, పెద్దలు, ఆ విషయభోగములయందు, ఆసక్తి వుంచరు.

౨3. ఏ పురుషుడు, ఈ శరీరము విడుచుటకు మునుపు, కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములవలన బుట్టిన ఆవేశమును, జయింప సమర్థుడగునో, అట్టిపురుషుడే యోగి, అతడే బ్రహ్మానందసుఖమును అనుభవించువాడు.

౨౪. ఏ పురుషుడు, ఆత్మసుఖియై, ఆత్మారాముడై, జ్ఞానస్వరూపియై, అంతఃప్రకాశుడై యుండునో, అట్టి యోగి, బ్రహ్మస్వరూపియై, మోక్షమును పొందుచున్నాడు.

౨౫. లభంతే బ్రహ్మనిర్వాణ మృషయఃక్షీణకల్మషాః।
ఛిన్నద్వైధాయతాత్మాన స్సర్వభూతహితేరతాః॥

౨౬. కామక్రోధవియుక్తానాం యతీనాంయతచేతసామ్।
అభితో బ్రహ్మ నిర్వాణం వర్తతేవిదితాత్మనామ్॥

౨౭. స్పర్శాన్కృత్వాబహిర్బాహ్యాం శ్చక్షుశ్చైవాంతరే
భ్రువోః।
ప్రాణాపానౌసమౌకృత్వా నాసాభ్యంతరచారిణౌ॥

౨౮. యతేంద్రియమనోబుద్ధి ర్మునిర్మోక్షపరాయణః।
విగతేచ్ఛాభయక్రోధో యస్సదాముక్తఏవసః॥

౨౫. మహాబుఘలు, పాపవర్జితులై, నిస్సంశయాత్ములై, ఇంద్రియ నిగ్రహము గలవారై, సమస్తజీవకోట్లకు సౌఖ్యము జేయుటయందు, ఆసక్తిగలవారై, మోక్షమును పొందుచున్నారు.

౨౬. జితేంద్రియులుగా, యతులుగా, నిశ్చయచిత్తులుగా, ఉండు ఆత్మజ్ఞానులకు, మోక్షసుఖము, అంతట యున్నయది.

౨౭, ౨౮. ఏ పురుషుడు, శబ్ద స్పర్శ రూప రస గంధ విషయములను, ఇంద్రియ వ్యాపారములకు వెలిజేసి, దృష్టిని భ్రూమధ్యమునందు నిలిపి, ప్రాణాపాన వాయువులను, నాసికములద్వారా సమమైన శ్వాసనిశ్వాసములుగాజేసి, ఇంద్రియములను, మనస్సును, బుద్ధిని, స్వాధీనముజేసికొని, ఇచ్ఛ, భయము, క్రోధములను జయించి, మోక్షాసక్తుడై యుండునో, అట్టి మహాపురుషుడే, ముక్తుడని ఎరుంగుము.

౨౯. భోక్తారంయజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరమ్।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వామాం శాంతిమృ
చ్ఛతి॥



ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
కర్మసన్న్యాస యోగోనామ
పంచమోధ్యాయః.



౨౯. మహాపురుషుఁడు, నన్ను, సమస్త యజ్ఞతపస్సులను అనుభవించువాఁడనియు, సమస్త లోకములకు నియామకుఁడనియు, సమస్త చరాచరభూతములకు ఉపకారియనియు, ఎఱింగి, మోక్షమును పొందుచున్నాఁడు.



ఇట్లని ఉపనిషద్రూపమైనట్టియు పరబ్రహ్మవిద్యయైనట్టి
భగవద్గీతలనెడు శ్రీకృష్ణార్జునసంవాదరూపమైన
యోగశాస్త్రమునందు కర్మసన్న్యాస
యోగమను
అయిదవ అధ్యాయము ముగిసెను.



# ఆత్మసంయమయోగః.

---

శ్రీభగవానువాచ.

౧. అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః।
స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః॥

౨. యం సన్న్యాసమితి ప్రాహుర్యోగం తం విద్ధి పాండవ।
న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన॥

3. ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే।
యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే॥

# ఆత్మసంయమ యోగము.

---

శ్రీకృష్ణులవాక్యము.

౧. ఎవ్వడు, కర్మ ఫలాపేక్ష లేక, చేయతగ్గ కర్మలను చేయుచున్నాడో, వాడు, కర్మపరిత్యాగము చేసిన సన్న్యాసియు, చిత్తశుద్ధి గలిగిన యోగియు, అగుచున్నాడు. వాడు, యోగ శాస్త్ర సమ్మతముగా అగ్నిహోత్ర దానాదికర్మలను వదలిన యోగికంటె, అధికుడు.

౨. ఓయి అర్జున, సన్న్యాసమని దేనిని చెప్పుచున్నారో, దానినే, కర్మయోగమని తెలిసికొనుము. సంకల్పత్యాగము చేయనివాడు, యోగికాచాలడు.

౩. జ్ఞానయోగమును పొంద నిచ్ఛయించిన మునులకు, ఫలత్యాగ పూర్వక కర్మ, సాధనముగా నున్నది. జ్ఞానము గలిగినపిదప, కర్మనివృత్తియనే కర్మనే, సాధనముగా దెలియుము.

౪. యదాహిచేంద్రియార్థేషు నకర్మస్వనుషజ్జ్యతే।
సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే॥

౫. ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్।
ఆత్మైవహ్యాత్మనోబంధు రాత్మైవరిపురాత్మనః॥

౬. బంధురాత్మాత్మన స్తస్య యేనాత్మైవాత్మనాజితః।
అనాత్మనస్తుశత్రుత్వే వర్తేతాత్మైవశత్రువత్॥

౭. జితాత్మనఃప్రశాంతస్య పరమాత్మాసమాహితః।
శీతోష్ణసుఖదుఃఖేషు తథామానావమానయోః॥

౪. ఎప్పుడైతే, శబ్ద స్పర్శ రూప రసగంధవిషయముల యందున్ను, నిత్యనైమిత్తికాది కర్మలయందున్ను ఆసక్తుడు గాకయుండునో, అప్పుడు, సమస్తసంకల్పముల ను పరిత్యజించినవాడై, జ్ఞానము బొందినవాడని, చెప్పబడుచున్నాడు.

౫. పురుషుడు, తన్ను, తన మనస్సుచేతనే ఉద్ధరించుకొనవలయును, తన్ను, తాను చెరుపుకొనరాదు, నకు, తనమనస్సే బంధువు, తనమనస్సే శత్రువు.

౬. ఏ పురుషుడు, తన మనస్సుచేత, దేహేంద్రియాది సమూహమును జయించుచున్నాడో, అట్టివానికి, తనమనస్సు ఉపకారి యగును. ఆ యింద్రియ జయము లేనివానికి, మనస్సు శత్రువై యుండును.

౭. జితేంద్రియుడై, ఉపశాంతిని పొందినవాడు, పరమాత్మస్వరూపుడై, శీతోష్ణములయందును, సుఖదుఃఖములయందును, మానావమానములయందును, సముడై సుఖించుచుండును.

౮. జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థోవిజితేంద్రియః।
యుక్తఇత్యుచ్యతేయోగీ సమలోష్టాశ్మకాంచనః॥

౯. సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థద్వేష్యబంధుషు।
సాధుష్వపిచపాపేషు సమబుద్ధిర్విశిష్యతే॥

౧౦. యోగీయుంజీతసతత మాత్మానంరహసిస్థితః॥
ఏకాకీయతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః॥

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య 11
స్థిరమాసనమాత్మనః।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం
చైలాజినకుశోత్తరం॥
12 తత్రైకాగ్రం మనః కృత్వా
యతచిత్తేంద్రియక్రియః।
ఉపవిశ్యాసనే యుంజ్యాద్
యోగమాత్మవిశుద్ధయే
13 సమం కాయశిరోగ్రీవం
ధారయన్నచలం స్థిరః।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం
దిశశ్చానవలోకయన్॥
14 ప్రశాంతాత్మా విగతభీః
బ్రహ్మచారివ్రతే స్థితః।
మనః సంయమ్య మచ్చిత్తో
యుక్త ఆసీత మత్పరః।
15 యుంజన్నేవం సదాత్మానం

౧౫. యుంజన్నేవం సదాత్మానం యోగీనియత మానసః।
శాంతింనిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి॥

౧౬. నాత్యశ్నతస్తుయోగోఽస్తి నచైకాంతమనశ్నతః।
నచాతిస్వప్నశీలస్య జాగ్రతోనైవచార్జున॥

౧౭. యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్యకర్మసు।
యుక్తస్వప్నావబోధస్య యోగోభవతిదుఃఖహా।

౧౮. యదావినియతంచిత్త మాత్మన్యేవావతిష్ఠతే।
నిస్పృహస్సర్వకామేభ్యో యుక్తఇత్యుచ్యతేతదా॥

౧౯. యథాదీపోనివాతస్థోనేంగతేసోపమాస్మృతా।
యోగినోయతచిత్తస్య యుంజతో యోగమా
త్మనః॥

అర్జున ఉవాచ.

33. యోయంయోగ స్త్వయాప్రోక్త స్సామ్యేనమధుసూ
దన।
ఏతస్యాహంనపశ్యామి చంచలత్వాత్ స్థితింస్థిరామ్॥

3౪. చంచలంహిమనఃకృష్ణ ప్రమాథిబలవద్దృఢమ్।
తస్యాహంనిగ్రహంమన్యే వాయోరివసుదుష్కరమ్।

---

శ్రీభగవాన్ ఉవాచ.

3౫. అసంశయం మహాబాహో మనోదుర్నిగ్రహం
చలమ్।
అభ్యాసేనతుకౌంతేయ వైరాగ్యేణచగృహ్యతే॥

అర్జున వాక్యము.

౩౩. ఓయి మధుసూదన, నీవు జెప్పిన సమత్వమ యోగము, అసాధ్యముగా నున్నయది. మనస్సు చంచ మైనది గనుక, ఈ యోగముయొక్క స్థిరమైనస్థితి, నా తెలియలేదు.

౩౪. ఓయి కృష్ణ, మనస్సు చంచలమైనదియు, క్షో బెట్టునదియు, నిగ్రహింప శక్యము గానిదియు, దృఢమైన యుగా, ఉన్నయది. వాయువును స్వాధీనము జేసికొనడమ ఎంత కష్టమో, మనస్సును స్వాధీనము జేసికొనడము, అం తకష్టమని తలచుచున్నాను.

---

శ్రీకృష్ణుల వాక్యము.

౩౫. ఓయి అర్జున, మనస్సు చంచల మైనదియు, నిగ్రహింప శక్యము గానిదియు, అనుటకు సంశయము లేదు. అట్లుండినను, ఆత్మానుసంధానాభ్యాసము చేతను వైరాగ్యముచేతను, అట్టి మనస్సును, స్వాధీనము జేసికొన వచ్చును.

౩౬. అసంయతాత్మనా యోగో దుష్ప్రాపఇతిమేమతిః।
పశ్యాత్మనాతుయతతా శక్యోవాప్తుముపాయతః॥

---

అర్జున ఉవాచ.

౩౭. అయతిశ్శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః।
అప్రాప్యయోగసంసిద్ధిం కాంగతింకృష్ణగచ్ఛతి॥

౩౮. కచ్చిన్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్రమివనశ్యతి।
అప్రతిష్ఠోమహాబాహో విమూఢోబ్రహ్మణఃపథి

౩౬. చిత్తస్వాధీనము లేనివానికి, యోగము అసాధ్యము. చిత్తస్వాధీనము గలవాడు, తగిన యుపాయములచేత ప్రయత్నబడి, యోగికావచ్చునని, నా అభిప్రాయము.

---

అర్జున వాక్యము.

౩౭. ఓయి కృష్ణ, యోగమునందు శ్రద్ధయు, ప్రయత్నములు, గలిగియు, నియమము లేకపోయినందున చంచలమనస్సుగలిగితే, వానికి, యోగఫలము లేకబోవుచున్నదిగదా, అట్టివాని గతి, యేమి అగుచున్నది.

౩౮. ఓయి కృష్ణ, పరమాత్మానుసంధానము జేయలేని మూఢుడు, నిరాశ్రయుడై, కర్మజ్ఞాన మార్గములరెండింటియందు భ్రష్టుడై, చెదిరిబోయిన మేఘమువలె, చెడిపోవక యుండునా యేమి.

3౯. ఏతంమేసంశ యంకృష్ణ ఛేత్తుమర్హస్య శేషతః।
త్వదన్యస్సంశయస్యాస్య ఛ్ఛేత్తానహ్యుపపద్యతే॥



శ్రీభగవాన్ ఉవాచ.

౪౦. పార్థనైవేహనాముత్ర వినాశ స్తస్యవిద్యతే।
నహికల్యాణకృత్కశ్చి ద్దుర్గతింతాతగచ్ఛతి॥

౪౧. ప్రాప్యపుణ్యకృతాఙ్లోకానుషిత్వాశాశ్వతీస్సమాః
శుచీనాంశ్రీమతాంగేహేయోగభ్రష్టోభిజాయతే।

౪౨. అథవాయోగినామేవ కులేభవతిధీమతామ్।
ఏతద్ధిదుర్లభతరం లోకేజన్మ యదీదృశమ్॥

౩౯. ఓయి కృష్ణ, నాకు గలిగిన యీ సంశయమును, నిశ్శేషముగా నివర్తింప జేయుటకు, నీవే తగుదువు. ఈసంశయమును బోగొట్టుటకు. నీవుదక్క, మరి యొకడు దొరకడు.

---

శ్రీకృష్ణులవాక్యము.

౪౦. ఓయి పార్థ, అట్టి యోగభ్రష్టునకు, ఇహపరలోకములయందు, నాశములేదు. నాయనా, మంచిచేసినవాడు, ఒకప్పుడున్ను చెరుపు నొందడు.

౪౧. యోగభ్రష్టుడు, పుణ్యముజేసినవారి లోకములనుబొంది, అనేక వత్సరములు వసించి, సదాచారవంతులైన శ్రీమంతుల గృహమునందు, బుట్టుచున్నాడు.

౪౨. అట్లు గాకపోయినా, అట్టి యోగభ్రష్టుడు, నిశ్చలాత్మక బుద్ధిగల యోగుల వంశమునందు, బుట్టుచున్నాడు. అట్టి జన్మము గలగడము, లోకమునందు, అతిదుర్లభమై యుండును.

౪౩. తత్ర తంబుద్ధిసంయోగం లభతేపౌర్వదైహికమ్।
యతతేచతతో భూయ స్సంసిద్ధౌకురునందన॥

౪౪. పూర్వాభ్యాసేనతేనైవ హ్రియతేహ్యవశోపిసః।
జిజ్ఞాసురపియోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే॥

౪౫. ప్రయత్నాద్యతమానస్తు యోగీసంశుద్ధకిల్బిషః।
అనేకజన్మసంసిద్ధ స్తతోయాతిపరాంగతిమ్॥

౪౩. ఓయి అర్జున, పైనజెప్పిన ప్రకారము, యోగి కులమునందు బుట్టి, పూర్వ జన్మమునందు సంపాదించిన ఆత్మానాత్మ వివేకజ్ఞానమును, బొందు చున్నాడు. అటు పిమ్మట, జ్ఞానసిద్ధి నిమిత్తమై, ప్రయత్నము జేయుచు న్నాడు.

౪౪. పైనజెప్పిన యోగభ్రష్టుడు, స్వాధీన మానస్సు లేనివాడైనా, పూర్వజన్మాభ్యాసముచేత, ఇంద్రియ విష యములలో నుంచి నివర్తుడగు చున్నాడు. యోగస్వ రూపమును దెలియ నిశ్చయించిన వాడుకూడా, వేదోక్త కర్మానుష్ఠాన ఫలములకు అతిక్రమించిన వానిగా, దెలి యుము.

౪౫. జ్ఞాననిష్ఠుడు, పరబ్రహ్మైక్యమునకు ప్రయత్నము లు జేయుచున్నవాడై, పాపవిముక్తుడై, అనేకజన్మ సం స్కారములవలన పరిశుద్ధుడై, తర్వాత, సర్వోత్కృష్ట మైన మోక్షమును బొందుచున్నాడు.

౪౬. తపస్విభ్యోఽధికోయోగీ జ్ఞానిభ్యోఽపిమతోఽధికః।
కర్మిభ్యశ్చాధికోయోగీ తస్మాద్యోగీభవార్జున॥

౪౭. యోగినామపిసర్వేషాం మద్గతేనాంతరాత్మనా।
శ్రద్ధావాన్భజతేయోమాం సమేయుక్తతమో
మతః॥

---

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
ఆత్మసంయమ యోగోనామ
షష్ఠోధ్యాయః.

౪౬. ఓయి అర్జున, యోగియైనవాడు, తపస్వుల కంటెను, శాస్త్రార్థ పాండిత్యము గలవారి కంటెను, కర్మనిష్ఠులకంటెను, అధికుడు. ఆకారణమువలన, నీవు, యోగముగలవాడు కమ్ము.

౪౭. ఎవ్వడైతే, విశ్వాసముగలిగి, నన్ను ఆశ్రయించి, మనస్సుచేత సేవింపుచున్నాడో, వాడు సమస్తయోగులలో శ్రేష్ఠుడని, నామతము.



ఇట్లని ఉపనిషద్రూపమైనట్టియు, పరబ్ర
భగవద్గీతలనెడు శ్రీకృష్ణార్జున సంవా
యోగశాస్త్రమునందు ఆత్మ స
యోగము ను
ఆరవ అధ్యాయము ముగిసె.



# విజ్ఞానయోగః.



శ్రీభగవాన్ ఉవాచ.

౧. మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్మద
దాశ్రయః।
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు॥

౨ జ్ఞానం తేహం సవిజ్ఞాన మిదం వక్ష్యామ్యశేషతః।
యజ్ఞాత్వా నేహ భూయోన్యత్ జ్ఞాతవ్యమవశిష్య

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే।
యతతా మపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥

# విజ్ఞానయోగము.

---

శ్రీకృష్ణుల వాక్యము.

౧. ఓయిపార్థ, నాయందు మనస్సునిలిపి, నన్ను ఆశ్రయించి, యోగాభ్యాసము జేయుచు, సంపూర్ణుడైన నన్ను, నిస్సంశయముగా నెట్లు తెలిసికొనుదువో, దానిని వినుము.

౨. నీకొరకు, అనుభవజ్ఞానముతో గూడిన శాస్త్రీయజ్ఞానమును, సవిస్తారముగా నేను జెప్పెదను. ఈజ్ఞానమును తెలిసికొంటివేని, తెలిసికొనదగిన వేరువిషయము, ఎద్దియున్ను లేకపోవుచున్నది.

3. వేయిగురు మనుష్యులలో, జ్ఞానసిద్ధికొరకు, ఒకానొకడు యత్నముజేయుచున్నాడు. యత్నము జేసినట్టి సిద్ధులలో, ఒకానొకడుమాత్రమే, నన్ను యథార్థముగా తెలిసికొనుచున్నాడు.

౪. భూమిరాపోనలోవాయుః ఖంమనోబుద్ధిరేవచ।
అహంకారఇతీయంమే భిన్నా ప్రకృతిరష్టధా॥

౫. అపరేయమితస్త్వన్యాం ప్రకృతింవిద్ధిమేపరామ్।
జీవభూతాం మహాబాహో యయేదంధార్యతేజ
గత్॥

౬. ఏతద్యోనీనిభూతాని సర్వాణీత్యుపధారయ।
అహంకృత్స్నస్యజగతః ప్రభవఃప్రళయస్తథా॥

౭. మత్తఃపరతరంనాన్య త్కించిదస్తి ధనంజయ।
మయిసర్వమిదంప్రోతం సూత్రేమణిగణాఇవ॥

౮. రసోహమప్సుకౌంతేయ ప్రభాస్మిశశిసూర్యయోః।
ప్రణవస్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషంనృషు॥

౪. భూమి, ఉదకము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము, అని, నామాయ, ఎనిమిదిభేదములుగా నున్నయది.

౫. ఓయి అర్జున, ఈపైనజెప్పిన నామాయాశక్తి, నికృష్టమైనది. దీనికంటెను, జీవభూతమై ఉత్కృష్టమైన ప్రకృతి, మరియొకటియున్నదని తెలియుము. దానిచేతనే ఈప్రపంచము ధరింపబడియున్నది.

౬. ఈ జీవభూతమైన పరప్రకృతే. సమస్తభూతములకు కారణమని, నిశ్చయింపుము, సమస్తజగత్తునకు, ఉత్పత్తిలయస్థానములు, నేనేను.

౭. ఓయి ధనంజయ, నాకంటె అన్యమైన కారణము, వేరొకటిలేదు. ఈ సమస్తప్రపంచము, దారమునందు రత్నములవలె, నాయందు గూర్చబడియున్నది.

౮. ఓయి అర్జున, ఉదకమునందు రసము, సూర్యచంద్రాదులయందు ప్రకాశము, వేదములయందు ప్రణవము, ఆకాశమునందు శబ్దము, పురుషులయందు పౌరుషము,. నేనుగా తెలిసికొనుము.

పుణ్యోగంధఃపృధివ్యాంచ తేజశ్చాస్మివిభావసౌ।
జీవనంసర్వభూతేషు తపశ్చాస్మితపస్విషు॥

౧౦. బీజంమాంసర్వభూతానాం విద్ధిపార్థసనాతనమ్।
బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహమ్॥

౧౧. బలంబలవతాంచాహం కామరాగవివర్జితమ్।
ధర్మావిరుద్ధోభూతేషు కామోస్మిభరతర్షభ

౧౨. యేచైవసాత్వికాభావా రాజసాస్తామసాశ్చయే।
మత్తఏవేతితాన్విద్ధి నత్వహంతేషు తే మయి॥

౯. భూమియందు సుగంధము, అగ్నియందు తేజము, సమస్తభూతములయందు ఆయువు, తపస్వులయందు తపస్సు, నేనుగా తెలిసికొనుము.

౧౦. ఓయిపార్థ, సమస్త చరాచర భూతములకు ఉత్పత్తి కారణమైన అనాదిబీజము, బుద్ధిమంతుల బుద్ధి, తేజస్సుగలవాటియందు తేజస్సు, నేనుగా తెలిసికొనుము.

౧౧. ఓయి అర్జున, బలవంతులయందు కామరాగములులేని బలము, ప్రాణులయందు ధర్మమునకు విరుద్ధముగాని కామము, నేనుగా తెలిసికొనుము.

౧౨. సత్వగుణరూపములైన శమదమాదులు, రజోగుణ రూపములైన గర్వసంతోషాదులు, తామసగుణరూపములైన శోకమోహాదులు, నాయందు ఉత్పన్నములైనవియని, ఎరుంగుము. వాటికి నేను స్వాధీనుడనుగాను, అవి నాకు స్వాధీనములు.

త్రిభిర్గుణమయైర్భావై రేభిస్సర్వమిదంజగత్ ।
మోహితంనాభిజానాతి మామేభ్యఃపరమవ్యయమ్

దైవీ హ్యేషాగుణమయీమమమాయాదురత్యయా
మామేవయే ప్రపద్యంతే మాయామేతాంతరంతితే ।

నమాందుష్కృతి నోమూఢాః ప్రపద్యంతేనరాధ
మాః।
మాయయాపహృతజ్ఞానాఆసురంభావమాశ్రితాః॥

చతుర్విధాభజంతేమాం జనాస్సుకృతినోఽర్జున।
ఆర్తోజిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీచభరతర్షభ॥

౧౩. పైనజెప్పిన సత్వరజస్తమాది గుణ వికారముల చేత, మోహింపబడిన ఈసమస్తజగత్తు, వికారరహితుడై గుణములకంటే పరుడైన నన్ను, తెలిసికొనజాలదు.

౧౪. నాయందు ఉత్పత్తియై, త్రిగుణాత్మకమైన నా మాయను, ఎవ్వరు మీరజాలరు. ఎవ్వరైతే, నన్నే శరణు బొందుచున్నారో, వారు, ఈమాయను అతిక్రమించగలరు.

౧౫. పాపముచేయు జనులున్ను, అవివేకులున్ను, అధములున్ను, నామాయవల్ల జ్ఞానశూన్యులై, అసుర స్వభావులై, హింసాదికర్మలు జేయువారు, నన్ను శరణు పొందరు.

౧౬. ఓయి అర్జున, నన్ను ఆశ్రయించే పుణ్యపురుషులు, నాలుగు తరగతులుగానున్నారు. వారు ఎవ్వరనిన, చోరవ్యాఘ్ర వ్యాధులజేత బీడింపబడినవారు, జ్ఞానాపేక్ష గలవారు, సకాములు; జ్ఞానముగలవారు.

౧౭. తేషాంజ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే।
ప్రియోహిజ్ఞానినోత్యర్థ మహంసచమమ ప్రియః॥

౧౮. ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీత్వాత్మైవ మేమతమ్।
ఆస్థితస్సహియుక్తాత్మా మామేవానుత్తమాంగతిమ్॥

౧౯. బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్య
తే।
వాసుదేవస్సర్వమితి స మహాత్మాసుదుర్లభః॥

౨౦. కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేన్యదేవతాః।
తంతంనియమ మాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వ
యా॥

౧౭. ఈనాలుగుతరగతులవారలలో. అచంచలభక్తిగల ఆత్మజ్ఞాని, అందరికంటే శ్రేష్ఠుడు, అట్టిజ్ఞానికి నేను మిక్కిలి ప్రియుడను, వాడు నాకు ప్రియుడు.

౧౮. ఈ నాలుగు తరగతులవారున్ను ఉత్కృష్టులేను. అయినా, అందులో, జ్ఞాని, నేనేయని నాయభిప్రాయము, ఎందువల్లననగా. అచంచలమనస్సుగల జ్ఞాని, నన్నే ఉత్తమగతిగా నమ్మినవాడు.

౧౯. జ్ఞానార్థ సంస్కారముగల అనేక జన్మములు ఎత్తినతర్వాత, పురుషుడు జ్ఞానియై, సమస్తము వాసుదేవస్వరూపమని, నన్ను శరణుపొందుచున్నాడు. అట్టి మహాపురుషుడు, మిక్కిలి దుర్లభుడు.

౨౦. మనుష్యులు, [redacted]లచేత జ్ఞానశూన్యులై, ఆయాకోరికలనిచ్చు దేవత[redacted]వారి స్వభావములచేత, ఆయా కల్పోక్త [redacted]ను ఆచరించి, శరణుపొందుచున్నారు

౨౧. యోయోయాం యాంతనుంభక్త శ్శ్రద్ధయార్చితు
మిచ్ఛతి।
తస్యతస్యాచలాం శ్రద్ధాం తామేవవిదధామ్యహమ్॥

౨౨. సతయా శ్రద్ధయాయుక్త స్తస్యారాధనమీహతే।
లభతేచతతః కామాన్ మయైవవిహితాన్హితాన్।

౨౩. అంతవత్తుఫలం తే[redacted] తద్భవత్యల్పమేధసామ్।
దేవాన్దేవయజో[redacted]ంతి మద్భక్తాయాంతిమామపి॥

౨౪. అవ్యక్తంవ[redacted]న్నం మన్యం తేమామబుద్ధ
య[redacted]
పరంభావమ[redacted]మమావ్యయమనుత్తమమ్॥
వు [redacted] ౨లాసం తే?

౨౧. ఎవ్వడెవ్వడు, ఏయేకోరికలచేత, ఏయే దేవతలను భక్తిశ్రద్ధలతో భజింపుచున్నాడో, వానివానికి, ఆయా దేవతలయందు శ్రద్ధాభక్తులను, నేను స్థిరము చేయుచున్నాను.

౨౨. అట్టిపురుషుడు, అటువంటి శ్రద్ధచేతను, ఆయా దేవతను ఆరాధించుచున్నాడు. అట్టిదేవతద్వారా, నావల్లనే ఇవ్వబడిన, వానివాని యభీష్టములను, వాడువాడు పొందుచున్నాడు.

౨౩. అల్పబుద్ధిగల ఆపురుషులయొక్క కోరికల ఫలములు, నశించగలవి. దేవత[redacted] బూజించేవారు, ఆయా దేవతల స్థానములను జెందు[redacted]రు. నాభక్తులు, నన్నే పొందుచున్నారు.

౨౪. వ్యక్తముగాని న[redacted]నులు, వ్యక్తుడైనవానిగా తలచుచున్నారు. [redacted]క్షమును తెలియనివారు, నాకు నాశముగలద[redacted]న్నారు.

౨౫. నాహంప్రకాశస్సర్వస్య యోగమాయాసమావృతః।
మూఢోయం నాభిజానాతి లోకోమామజమవ్యయ
మ్॥

౨౬. వేదాహంసమతీతాని వర్తమానానిచార్జున।
భవిష్యాణిచభూతాని మాంతువేద న కశ్చన॥

౨౭. ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేనభారత।
సర్వభూతానిసంమోహం సర్గేయాంతిపరంతప॥

౨౮. యేషాంత్వంత[redacted]తం[redacted]జనానాంపుణ్యకర్మణాం।
తేద్వంద్వమో[redacted]భజంతేమాందృఢవ్రతాః॥

౨౫. యోగమాయవల్ల కప్పబడిన నేను, ఎవ్వరిచే తను తెలిసికొన గూడనివాడను, మూఢుడు, నన్ను జన్మరహితునిగానున్ను, నాశరహితునిగానున్ను, తెలిసికొనజాలడు.

౨౬. ఓయి అర్జున, భూతకాలమునందు ఉండినట్టి, వర్తమాన కాలమునందు ఉండునట్టి, భవిష్యత్కాలమునందు ఉండగల ప్రాణిసమూహములను, నేను ఎరుంగుదును. అయినను, నన్ను, ఎవ్వడున్ను ఎరుంగడు.

౨౭. ఓయి అర్జున, ఈస్థూలదేహమునందు, ఇచ్ఛాద్వేషములవలన బుట్టిన, ద్వంద్వరూపమైన సుఖదుఃఖములయందు మోహముజేత, సమస్తప్రాణులు జన్మకాలమునందే, అవివేకమును జెందుచున్నారు.

౨౮. సుకృతకర్ములుగల పురుషులు, వారిపాపములు నశించినపిదప, ద్వంద్వగుణములైన సుఖదుఃఖములనెడు అవివేకమునుంచి విముక్తులై, చలించని నియమముతో నన్ను సేవించుచున్నారు.

౨౯. జరామరణమోక్షాయ మామాశ్రిత్యయతంతియే।
తేబ్రహ్మతద్విదుఃకృత్స్న మధ్యాత్మంకర్మచాఖిలమ్॥

౩౦. సాధిభూతాధిదైవంమాం సాధియజ్ఞంచయేవిదుః।
ప్రయాణకాలేపిచమాం తేవిదుర్యుక్త చేతసః॥

---

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
విజ్ఞాన యోగోనామ
సప్తమోధ్యాయః.



౨౯. ఎవ్వరైతే, జననమరణ రహితమైన మోక్షాపేక్షతో, నన్ను ఆశ్రయించి, అందులకు దగిన యత్నములం జేయుచున్నారో, అట్టివారు, సమస్త జీవకోటికి నంతర్గతముగానుండు ఆ పరబ్రహ్మమునున్ను, సమస్తకర్మలనున్ను, తెలిసికొనినవారగుదురు.

౩౦. అధిభూత అధిదైవతములతోను, అధి యజ్ఞముతోను, గూడుకొనియుండునన్ను, ఏపురుషులు దెలియుదురో, అట్టిపురుషులు, అంత్యకాలములో గూడా అచంచల మనస్సుగలవారై, నన్ను దెలిసికొనుదురు.



ఇట్లని ఉపనిషద్రూపమైనట్టియు పరబ్రహ్మవిద్యయైనట్టి
భగవద్గీతలనెడు శ్రీకృష్ణార్జునసంవాద రూపమైన
యోగశాస్త్రమునందు విజ్ఞానయోగమను
ఏడవ అధ్యాయము ముగిసెను.



# అక్షరపరబ్రహ్మయోగః.

అర్జున ఉవాచ.

౧. కింతద్బ్రహ్మకిమధ్యాత్మం కింకర్మ పురుషోత్తమ।
అధిభూతంచకింప్రోక్త మధిదైవంకిముచ్యతే॥

అధియజ్ఞఃకథంకోఽత్ర దేహేఽస్మిన్మధుసూదన।
ప్రయాణకాలేచకథం జ్ఞేయోఽసినియతాత్మభిః॥

---

శ్రీభగవాన్ ఉవాచ.

3. అక్షరంబ్రహ్మపరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే।
భూతభావోద్భవకరో విసర్గఃకర్మసంజ్ఞికః॥

# అక్షరపరబ్రహ్మయోగము.



అర్జున వాక్యము.

౧. ఓయి పురుషోత్తమ, ఆ పరబ్రహ్మము ఎద్ది, అధ్యాత్మమనగానేమి, కర్మయనగానెట్టిది, అధిభూతమని ఎద్ది చెప్పబడుచున్నది, అధి దైవమని ఎద్ది చెప్పబడును.

౨. ఓయి మధుసూదన, ఈ శరీరము నందు అధియజ్ఞుడనేవాడు ఎవ్వడు, వాడు ఎట్లున్నవాడు, నిశ్చలచిత్తముగలవార్ల చేత, అవసానకాలమునందు, నీవు ఏవిధముగా దెలియతగిన వాడవు. ఇవి అన్నియు, నాకు, విశదముగా తెలియజేయుము.



శ్రీకృష్ణుల వాక్యము.

3. పరబ్రహ్మము నాశరహితమైనది, ఆ పరబ్రహ్మము యొక్క స్వభావమే, అధ్యాత్మము, ప్రాణులయొక్క ఉత్పత్తి వృద్ధినిమిత్తమై చేయునది, కర్మయనబడును.

౪. అధిభూతంక్షరోభావః పురుషశ్చాధిదైవతమ్।
అధియజ్ఞోఽహమేవాత్ర దేహేదేహభృతాంవర॥

౫. అంతకాలేచమామేవ స్మరన్ముక్త్వాకళేబరమ్।
యఃప్రయాతి సమద్భావం యాతినాస్త్యత్రసంశయః॥

౬. యంయంవాపిస్మరన్భావం త్యజత్యంతేకళేబరమ్।
తంతమేవైతికౌంతేయ సదాతద్భావభావితః॥

౭. తస్మాత్సర్వేషుకాలేషు మామనుస్మరయుధ్యచ।
మయ్యర్పితమనోబుద్ధి ర్మామేవైష్యస్యసంశయః॥

౪. ఓయి అర్జున, నశించునట్టి స్వభావముగల సమస్త చరాచరములు, అధి భూతమనిజెప్పబడును. అధి దైవ మనగా హిరణ్య గర్భస్వరూపుడు. ప్రాణుల యొక్క దేహముల యందు, అంతర్యామియైన అధి యజ్ఞుడనే వాడు, నేనేను.

౫. ఏపురుషుడు, మరణకాలమునందు, నన్నేస్మర ణజేయుచున్నవాడై, శరీరమును విడుచుచున్నాడో, వాడు నన్ను బొందుచున్నాడు. ఇందుకు ఎంతమాత్రిమునం దేహములేదు.

౬. ఓయి కౌంతేయ, పురుషులు, ఏయే దేవతలను, నిశ్చలచిత్తములతో, అంతకాలమునందు స్మరించుచు, దేహములను విడుచుచున్నారో, వారు, ఆయా దేవతల స్వరూపములను బొందుచున్నారు.

౭. గనుక, నీవు, సమస్తకాలములయందు నన్నేచిం తించుచు, యుద్ధముజేయుము. నాయందు అచంచల మనోబుద్ధులను ఉంచితివేని నన్ను పొందగలవు. ఇందు కు సందేహములేదు.

౮. అభ్యాసయోగయుక్తేన చేతసానాన్యగామినా।
పరమంపురుషందివ్యం యాతిపార్థానుచింతయన్॥

౯. కవింపురాణమనుశాసితార మణోరణీయాం సమను
స్మరేద్యః।
సర్వస్యధాతారమచింత్యరూప మాదిత్యవర్ణంతమ
సఃపరస్తాత్॥

౧౦ ప్రయాణకాలేమనసాచలేన భక్త్యాయుక్తోయోగబ
లేనచైవ।
భ్రువోర్మధ్యేప్రాణమావేశ్యసమ్యక్ సతంపరంపురు
షముపైతిదివ్యమ్॥

౮. ఓయి పార్థ, ఎవ్వడైతే, అభ్యాస యోగముతో గూడుకొని, ఇతరచింతలులేని మనస్సుతో, దివ్యరూపుడైన మహాపురుషుని, స్మరణజేయుచున్నాడో, వాడు, ఆ పరమ పురుషునినే పొందుచున్నాడు.

౯. ఆ మహాపురుషుడు సర్వజ్ఞుడు, పురాణపురుషుడు, సమస్తప్రపంచమునకు శిక్షకుడు, సూక్ష్మమైన అణువుకంటె సూక్ష్మరూపి, సమస్తచరాచరములకు కర్మఫలదాయి, చింతింపనశక్యమైన స్వరూపముగలవాడు, సూర్యుని తేజస్సువంటి తేజోరూపముగలవాడు, అజ్ఞానలక్షణమైన అంధకారమునకంటె పరుడు.

౧౦. దేహావసాన కాలమునందు, అచంచలమనస్సుతో భక్తివహించి, యోగజన్యమైన చిత్తస్థైర్యముతో, కనుబొమ్మల మధ్యస్థానమునందు ప్రాణవాయువులను ప్రవేశింపజేసి, పైనచెప్పిన పరమపురుషుని ఎవ్వడు చింతించునో, అట్టియోగపురుషుడు, దివ్యోత్కృష్టమైన మహాపురుషుని పొందుచున్నాడు.

౧౧. యదక్షరంవేద విదోవదంతి విశంతియద్యతయోవీత
రాగాః।
యదిచ్ఛంతో బ్రహ్మచర్యంచరంతి తత్తేపదంసంగ్ర
హేణప్రవక్ష్యే॥

౧౨. సర్వద్వారాణిసంయమ్య మనోహృదినిరుధ్యచ।
మూర్ధ్న్యాధాయాత్మనఃప్రాణ మాస్థితోయోగధా
రణామ్॥

౧౩. ఓమిత్యేకాక్షరంబ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్।
యఃప్రయాతిత్యజన్దేహం సయాతిపరమాంగతిమ్।

౧౧. వేదార్థతత్వములను ఎరింగినవారు, ఏ స్థానము
ను నాశరహితమని జెప్పుచున్నారో, జితేంద్రియులైని
ష్కాములైన సన్న్యాసులు, ఏనాశరహితమైన స్థానము
ప్రవేశించుచున్నారో, ఏ పరమోత్తమమైన పదమును
ఇచ్ఛయించి, పురుషులు గురుకులవాసము జేయుచు, బ్రహ్మ
చర్యవ్రతము సలుపుచున్నారో, అట్టి నాశరహితమైన
పరమోత్తమపదమును, నీకొరకు సంక్షేపముగా జెప్పు
చున్నాను.

౧౨. ఇంద్రియద్వారములను అరికట్టి, మనస్సునుహృ
దయమునందు నిలిపి, తనప్రాణములను సహస్రార చక్ర
మునందు చేర్చి, యోగమును అభ్యసించవలయును.

౧౩. పరబ్రహ్మవాచకమైన, ఓం, అనే ఏకాక్షరము
ను ఉచ్చరించుచు, ఓంకారస్వరూపుడైన నన్ను చింతిం
చుచు, ఎవ్వడైతే దేహమును విడుచుచున్నాడో, అట్టి
వాడు, పరమోత్కృష్టమైన మోక్షపదమును, పొందు
చున్నాడు.

౧౪. అనన్యచేతాస్సతతం యోమాంస్మరతినిత్యశః।
తస్యాహంసులభఃపార్థ నిత్యయుక్తస్యయోగినః॥

౧౫. మాముపేత్యపునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్।
నాప్నువంతి మహాత్మాన స్సంసిద్ధింపరమాంగతాః॥

౧౬. ఆబ్రహ్మభవనాల్లోకాః పునరావర్తినోర్జున।
మాముపేత్యతుకౌంతేయ పునర్జన్మనవిద్యతే॥

౧౭. సహస్రయుగపర్యంత మహర్యద్బ్రహ్మణోవిదుః।
రాత్రింయుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదో
జనాః॥

౧౪. ఓయి పార్థ, ఎవ్వడైతే, విషయాంతరముల యందు ప్రవేశించని నిశ్చలమనస్సుగలిగి, పరబ్రహ్మ స్వరూపుడైన నన్ను, సర్వకాలములయందు చింతించుచున్నాడో, అట్టి నిరంతరధ్యానపరుడైన యోగికి నేను సులభుడను.

౧౫. మహాత్ములైన యోగీశ్వరులు, పరమోత్కృష్టమైన యోగసిద్ధిచే నన్ను బొందినవారై, నాశాస్పదమై దుఃఖాస్పదమైనట్టి జన్మములను, తిరుగాపొందరు.

౧౬. ఓయికౌంతేయ, బ్రహ్మాండమునకు లోబడిన యావత్తు లోకములున్ను, జీవులకు, మరల జన్మములను ఇవ్వగల స్వభావముగలవి. నన్నుపొందిన పిదపనైతేనో పునర్జన్మములులేవు.

౧౭. సహస్ర మహాయుగ కాలనిర్ణయమైన బ్రహ్మ యొక్క పగటినిన్ని, అంతేపరిమాణముగల బ్రహ్మయొక్క రాత్రినిన్ని, ఏ మహాపురుషులు తెలియుదురో, అట్టివారే రాత్రిపగళ్లు తెలిసిన వారలుగా నున్నారు.

అవ్యక్తాద్వ్యక్తయస్సర్వాః ప్రభవంత్యహరాగమే।
రాత్ర్యాగమేప్రలీయంతేతత్రైవావ్యక్తసంజ్ఞకే॥

భూతగ్రామస్సఏవాయం భూత్వాభూత్వాప్రలీయతే।
రాత్ర్యాగమేవశః పార్థ ప్రభవత్యహరాగమే॥

పరస్తస్మాత్తుభావోన్యో వ్యక్తోవ్యక్తాత్సనాతనః।
యస్ససర్వేషుభూతేషు నశ్యత్సునవినశ్యతి॥

౧౮. బ్రహ్మయొక్క పగటికాల ప్రారంభము నందు, అవ్యక్తమైన ప్రకృతిలోనుంచి, వ్యక్తమైన స్థావరజంగమాత్మక సర్వభూత ప్రపంచములు, బుట్టుచున్నవి. ఆ బ్రహ్మకు రాత్రికాల ప్రారంభములో, ఈ సమస్త ప్రపంచములు, అవ్యక్తమైన ప్రకృతిలో మరల లీనమగుచున్నవి.

౧౯. ఓయిపార్థ, ఏ ప్రాణిసమూహము, తత్పూర్వకల్పమునందు బుట్టెనో, ఆప్రాణి సమూహమే, స్వాధీనము లేనిదై, పగలువచ్చినప్పుడెల్ల పుట్టుచు,రాత్రివచ్చినప్పుడెల్ల లీనమగుచు, నున్నది.

౨౦. పైనజెప్పిన భూతమయ ప్రపంచములకు, కారణరూపుడైన ఈశ్వరునకంటే వేరై, ఉత్కృష్టమై, అగోచరమై, శాశ్వతమైయుండు పరబ్రహ్మమనునది, ఒకటిగలదు. ఆపరబ్రహ్మము, సమస్తప్రపంచములు నశించుచుండగా, అది నశించునదిగాదు.

౨౧. అవ్యక్తోక్షరఇత్యుక్త స్తమాహుఃపరమాంగతిమ్
యంప్రాప్యననివర్తంతే తద్ధామపరమంమమ॥

౨౨. పురుషస్సపరఃపార్థ భక్త్యాలభ్యస్త్వనన్యయా।
యస్యాంతస్థానిభూతాని యేనసర్వమిదంతతమ్॥

౨౩. యత్రకాలేత్వనావృత్తి మావృత్తించైవయోగినః
ప్రయాతాయాంతితంకాలం వక్ష్యామిభరతర్షభ॥

౨౧. ఏ పరబ్రహ్మము, ఇంద్రియములకు గోచరము గాక, నాశరహితముగానున్నదని చెప్పబడెనో, అదే, పరమోత్కృష్టమైన మోక్ష స్థానముగా చెప్పబడుచున్నది. ఆస్థానమునుబొందినవారికి, తిరుగా జన్మములులేవు. అదే, నాస్థానమైన పరమపదముగా దెలిసికొనుము.

౨౨. ఓయిపార్థ, ఏ మహాపురుషునియందు, ఈసమస్తజగములు లీనమైయున్నవియో, ఏ మహాపురుషునివల్ల, ఈ సమస్తజగత్తులు వ్యాపింపబడియున్నవియో, అట్టి పరమపురుషుని, ఇతరాసక్తిలేని నిశ్చలభక్తియోగముచేత, పొందవచ్చును.

౨౩. ఓయిఅర్జున, ప్రాణోపాసకులు, దేహమును విడిచినవారై, ఏమార్గమునపోయి తిరిగి జన్మములను పొందరో, కర్మయోగులు, దేహమును విడిచినవారై, ఏ మార్గమునపోయి తిరిగి జన్మములను పొందుచున్నారో, ఆ మార్గములను చెప్పుచున్నాను.

౨౪. అగ్నిర్జ్యోతిరహశ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్।
తత్రప్రయాతాగచ్ఛంతి బ్రహ్మబ్రహ్మవిదోజనాః॥

౨౫. ధూమోరాత్రి స్తథాకృష్ణ షణ్మాసా దక్షిణాయనమ్।
తత్రచాంద్రమసంజ్యోతి ర్యోగీప్రాప్య నివర్తతే॥

౨౬. శుక్లకృష్ణే గతీహ్యేతే జగతశ్శాశ్వతీమతే।
ఏకయాయాత్యనావృత్తి మన్యయావర్తతేపునః॥

౨౪. ఏమార్గమునందు, అగ్న్యభిమాని దేవతయు, దివసాభిమాని దేవతయు, శుక్లపక్ష అభిమాని దేవతయు, ఉత్తరాయణాభిమాని దేవతయు, ప్రాపకులుగా నున్నారో, దేహములనువిడిచి, ఆయర్చురాది మార్గమునబోవు బ్రహ్మోపాసకులు, క్రమముగా ముక్తిని పొందుచున్నారు.

౨౫. ఏమార్గమునందు, ధూమాభిమాని దేవతయు, రాత్ర్యభిమాని దేవతయు, కృష్ణపక్షాభిమాని దేవతయు, దక్షిణాయనాభిమాని దేవతయు ప్రాపకులుగా నున్నారో, దేహములనువిడిచి, ఆ ధూమాది మార్గమునబోవు కర్మయోగులు, చంద్రలోకమును బొంది, కర్మక్షయానంతరము, మరల జన్మముల నెత్తుచున్నారు.

౨౬. పైనచెప్పినప్రకారము, ఈ లోకమునకు, శుక్లకృష్ణములనే జ్ఞాన అజ్ఞాన ప్రకాశములైన రెండుమార్గములు, శాశ్వతముగా నేర్పడియున్నవి. వాటిలో, జ్ఞానప్రకాశమైన శుక్లమార్గము పునర్జన్మములు లేనిదిగాను, అజ్ఞానప్రకాశమైన కృష్ణమార్గము మరల జన్మములు గలదిగాను, ఉన్నది.

౨౭. నైతే సృతీపార్థజానన్ యోగీముహ్యతికశ్చన।
తస్మాత్సర్వేషుకాలేషు యోగయుక్తోభవార్జున॥

౨౮. వేదేషుయజ్ఞేషు తపస్సుచైవ దానేషుయత్పుణ్యఫలం
ప్రదిష్టమ్।
అత్యేతితత్సర్వ మిదంవిదిత్వా యోగీపరం స్థానము
పైతిచాద్యమ్॥

---

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
అక్షరపరబ్రహ్మ యోగోనామ

అష్టమోధ్యాయః.



౨౭. ఓయి పార్థ, పైనచెప్పిన రెండుమార్గములను దెలిసిన యోగులు, మోసబోనేరరు. అందువల్ల, సమస్తకాలములయందు. నీవు యోగముతో కూడిన వాడవు గమ్ము.

౨౮. యోగులు, వేదార్థములు తెలిసికొనుట యందేమి, క్రతువులు జేయుటయందేమి, తపస్సులు జేయునందేమి, దానములు జేయునందేమి, జెప్పియుండు ఫలములను లక్ష్యము జేయరు. వీటియందుగల ఫలములు, పునర్జన్మ హేతువులని దెలిసినవారై, ఆదికారణమై, పరమోత్కృష్టమైనట్టి పరబ్రహ్మమును, పొందుచున్నారు.

---

ఇట్లని ఉపనిషద్రూపమైనట్టియు, పరబ్రహ్మ విద్యయైనట్టి
భగవద్గీతలనెడు శ్రీకృష్ణార్జున సంవాదరూపమైన
యోగ శాస్త్రమునందు అక్షరపరబ్రహ్మ
యోగమను
ఎనిమిదవ అధ్యాయము ముగిసెను.



# రాజవిద్యారాజగుహ్యయోగః.

శ్రీభగవాన్ ఉవాచ.

౧. ఇదంతుతేగుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే।
జ్ఞానంవిజ్ఞానసహితం యజ్జ్ఞాత్వామోక్ష్యసేఽశుభాత్॥

౨. రాజవిద్యారాజగుహ్యం పవిత్రమిదముత్తమమ్।
ప్రత్యక్షావగమంధర్మ్యం సుసుఖంకర్తుమవ్యయమ్॥

౩. అశ్రద్దధానాఃపురుషా ధర్మస్యాస్యపరంతప।
అప్రాప్యమాంనివర్తంతే మృత్యుసంసారవర్త్మని॥

## రాజవిద్యారాజగుహ్య యోగము.

శ్రీకృష్ణులవాక్యము.

౧. అసూయలేనినీకు, శాస్త్రసమ్మతమై, అనుభవముతోగూడుకొనిన, ఈ దిగువవివరించబోయ్యే రహస్యమగుజ్ఞానమును జెప్పెదను. దానిని తెలిసికొనితివేని, అశుభమగు సంసారములోనుంచి, నీవు, నివర్తుడవు కాగలవు.

౨. ఈజ్ఞానము, పరమోత్కృష్టమైనదిగా, పరమపావనమైనదిగా, పరమ శ్రేష్ఠమైనదిగా, పరమరహస్యమైనదిగా, ప్రత్యక్షసుఖబోధకమైనదిగా, ధర్మముతో గూడుకొనినదిగా, నాశరహితమైనదిగా, అభ్యసించుటకు మిక్కిలి సులభకరమైనదిగా, ఉన్నయది.

౩. ఓయి అర్జున, ఇట్టి ఆత్మజ్ఞానధర్మమును విశ్వసించనిపురుషులు, నన్ను పొందక, మృత్యువుతోగూడిన సంసారమునకు, లోబడుచున్నారు.

౪. మయాతతమిదంసర్వం జగదవ్యక్తమూర్తినా।
మత్‌స్థానిసర్వభూతాని నచాహంతేష్వవస్థితః।

౫. నచమత్స్థానిభూతాని పశ్య మేయోగమైశ్వరమ్।
భూతభృన్నచభూతస్థో మమాత్మాభూతభావనః॥

౬. యథాకాశస్థితోనిత్యం వాయుస్సర్వత్రగోమహాన్।
తథాసర్వాణిభూతాని మత్స్థానీత్యుపధారయ॥

౭. సర్వభూతానికౌంతేయ ప్రకృతింయాంతిమామికాం
కల్పక్షయేపునస్తాని కల్పాదౌవిసృజామ్యహమ్।

౪. ఈ సమస్తజగత్తు, ఇంద్రియములకు గోచరము గాని రూపముగల నాచే, వ్యాపింపబడి యున్నది. ఈ సమస్తప్రాణి సమూహములు, నాయందునున్నవి. నేను, ఆప్రపంచముల నంటియున్న వాడనుకాను.

౫. బ్రహ్మాదిస్థావరాంత భూతములు, నాయందున్న వికావు. అయినా, నాయొక్క స్వరూపము, యావత్తు ప్రపంచభూతములను భరించుచు, వృద్ధిపొందించుచు, ఉండినా, నేను, ఆభూతములయందు, సంబంధపడినవాడనుకాను, ఈచమత్కారమైన నాస్వరూపమును తెలిసికొనుము.

౬. అంతట వ్యాపించియున్న మహావాయువు, ఆకాశమునందు ఏ ప్రకారము అణిగియుంటున్నదో, ఆప్రకారము, సమస్తభూత ప్రపంచములు, నాయందు ఉన్నవని, తెలియుము.

౭. ఓయికౌంతేయ, ప్రళయకాలమునందు, సమస్త భూతములు, నాసంబంధమైన ప్రకృతిలో, లయించిపోవుచున్నవి. తిరుగా సృష్టిప్రారంభములో, సమస్తప్రపంచములను, నేను పుట్టించుచున్నాను.

౮. ప్రకృతింస్వామవష్టభ్య విసృజామిపునఃపునః।
భూతగ్రామమిమంకృత్స్న మవశంప్రకృతేర్వశాత్

౯. నచమాంతానికర్మాణి నిబధ్నంతిధనంజయ।
ఉదాసీనవదాసీన మసక్తంతేషుకర్మసు॥

౧౦. మయాధ్యక్షేణప్రకృతిః సూయతేసచరాచరమ్।
హేతునానేనకౌంతేయ జగద్విపరివర్తతే॥

౧౧. అవజానంతిమాంమూఢా మానుషీంతనుమాశ్రితమ్।
పరంభావమజానంతో మమభూతమహేశ్వరమ్॥

౮. అస్వతంత్రమైన ఈ సమస్తభూత సమూహము ను, స్వకీయమైన ప్రకృతియనే మాయను అవలంబించి, ఆప్రకృతి స్వభావమువల్ల, మళ్లీమళ్లీ నేను పుట్టింపుచు న్నాను.

౯. ఓయి ధనంజయ, ఈ సృష్ట్యాది కర్మలయందు, నాకు అభిమానములేదు, లక్ష్యమున్ను లేదు, గనుక, ఈ కర్మలు, నన్ను ఎంతమాత్రము, బంధింపవు.

౧౦. ఓయి కౌంతేయ, సాక్షిభూతమైన నాచేత, స మస్తచరాచర ప్రపంచములు, ప్రకృతియందు పుట్టుచు న్నవి. పైనచెప్పిన నాసాక్షిత్వముచేతనే, ఈసమస్త ప్రపం చము, తిరుగుచున్నది.

౧౧. పరమాత్మస్వరూపమై, ప్రపంచ నియామకమైన, నాతత్వమును దెలియనిమూఢులు, నేను మనుష్యదేహ మును అవలంబించిన కారణముచేత, నన్ను అలక్ష్యము జేయుచున్నారు.

౧౨. మోఘాశామోఘకర్మాణో మోఘజ్ఞానావిచేతసః।
రాక్షసీమాసురీంచైవ ప్రకృతింమోహినీంశ్రితాః॥

౧౩. మహాత్మానస్తుమాంపార్థ దైవీంప్రకృతి మాశ్రితా
భజంత్యనన్యమనసో జ్ఞాత్వాభూతాదిమవ్యయమ్॥

౧౪. సతతంకీర్తయంతోమాం యతంతశ్చదృఢవ్రతాః।
నమస్యంతశ్చమాంభక్త్యా నిత్యయుక్తాఉపాసతే॥

౧౨. అట్టిమూఢులు, నిష్ప్రయోజనములైన ఆశలు గలవారుగా, వ్యర్థమైన కర్మానుష్ఠాతలుగా, నిష్ప్రయోజనమైన జ్ఞానముగలవారుగా, ఉండడమేగాక, హింసారూపమైనట్టిన్నీ, కామక్రోధ లోభమోహ మద మాత్సర్యములతోనిండినట్టిన్నీ, మోహనరూపమైన ప్రకృతికి లోబడినవారై, నన్ను అలక్ష్యము జేయుచున్నారు.

౧౩. ఓయిపార్థ, మహాత్ములైనపురుషులు, దేవతాసంబంధమైన సాత్త్వికప్రకృతిని ఆశ్రయించినవారలై, భూత ...చములకు ముఖ్యకారణమై, నాశరహితమైనట్టి ఫలమును ... తెలిసికొని, ఇతర చింతలులేనివారై, వస్తువున్ను, ...నారు.
ఋక్, యజు,

౧౪. కర్మ... నిగ్రహముగలిగి, దృఢవ్రతులైన సర్వసాక్షిన్ని, సమాధిచింతనముగలవారై, సమస్త డున్ను, ఉత్ప... నన్ను స్మరించుచు, భక్తిశ్రద్ధాయుక్తమున్ను, జగత్తు... కేయుచు, నన్ను సేవించుచున్నారు.
మున్ను, నేనేను.

౧౫. జ్ఞానయజ్ఞేనచాప్యన్యే యజంతోమాముపాసతే।
ఏకత్వేనపృథక్త్వేన బహుధావిశ్వతోముఖమ్॥

౧౬. అహంక్రతురహంయజ్ఞః స్వధాహమహమాషధః
మంత్రోహమహమేవాజ్య మహమగ్ని రహంహు
తమ్।

౧౭. పితాహమస్యజగతో మాతాధాతాపితా
వేద్యంపవిత్రమోంకార ఋక్సాః
సామయజుర్వేదచ

౧౮. గతిర్భర్తాప్రభుస్సాక్షీ నివాసశ్శతశ్చదృఢవ్రతాః
ప్రభవఃప్రళయఃస్థానం నిధానంబీ యుక్తాఉపాసతే॥
శరణంసుహృత్।
బీజమవ్యయం॥

౧౫. మరికొందరు, వాసుదేవస్సర్వమనే జ్ఞానయజ్ఞముచేతను, కొందరు, సర్వము బ్రహ్మమనే అద్వైతభావముచేతను, మరికొందరు, ఉపాస్య ఉపాసక భావముచేతను, కొందరు, సమస్త దైవస్వరూప భావముచేతను, నానావిధములుగా నన్ను సేవింపుచున్నారు.

౧౬. జ్యోతిష్టోమాదిశ్రౌతకర్మము, స్మార్తకర్మము, పైతృక కర్మము, ఓషధీవికారమైన అన్నము, మంత్రము, ఆజ్యాదిహవిస్సు, అగ్ని హోత్రము, హోమకర్మము, నేనేను.

౧౭. ఈ సమస్తజగత్తులకు, తల్లిన్నీ, తండ్రిన్నీ, కర్మఫలమును విధించువాడున్ను, తాతయున్ను, తెలియదగిన వస్తువున్ను, పావనమైన వస్తువున్ను, ఓంకారవర్ణమున్ను, ఋక్, యజు, స్సామవేదములున్ను, నేనేను.

౧౮. కర్మఫలమున్ను, పోషకుడున్ను, ఈశ్వరుడున్ను, సర్వసాక్షిన్ని, ఉనికిపట్టున్ను, ఉపకారియున్ను, మిత్రుడున్ను, ఉత్పత్తిన్ని, స్థితిన్ని, సంహారమున్ను, నిక్షేపమున్ను, జగత్తులకు ఉత్పత్తికారణమైన, నశించని బీజమున్ను, నేనేను.

౧౯. తపామ్యహ మహంవర్షం నిగృహ్ణామ్యుత్సృజామిచ।
అమృతంచైవమృత్యుశ్చ సదసచ్చాహమర్జున॥

౨౦. త్రైవిద్యామాంసోమపాః పూతపాపా యజ్ఞైరిష్ట్వాస్వ
ర్గతింప్రార్థయంతే।
తేపుణ్యమాసాద్యసురేంద్రలోక మశ్నంతి దివ్యాన్
దివిదేవభోగాన్॥

౨౧. తేతంభుక్త్వా స్వర్గలోకంవిశాలం క్షీణేపుణ్యేమర్త్య
లోకంవిశంతి।
ఏవంత్రయీధర్మ మనుప్రపన్నా గతాగతం కామ
కామాలభంతే॥

౨౨. అనన్యాశ్చింతయంతోమాం యేజనాఃపర్యుపాసతే।
తేషాంనిత్యాభియుక్తానాం యోగక్షేమంవహా
మ్యహమ్॥

౧౯. ఓయి అర్జున, నన్ను, ఉష్ణముగానున్ను, వర్షము గానున్ను, వర్షమునునిలిపే వాడనుగానున్ను, అమృతము గానున్ను, మృత్యువుగానున్ను, స్థూల సూక్ష్ములైన ప్రకృతి వికృతులుగానున్ను, సేవింపుచున్నారు.

౨౦. ఎవ్వరైతే, వేదత్రయ వేత్తలై, సోమపానము జేసి, పాపములను నశింపచేసి, అగ్నిష్టోమాది యజ్ఞముల చేత నన్ను పూజించి, స్వర్గప్రాప్తిని కోరుచున్నారో, అట్టి పురుషులు, పవిత్రమైన ఇంద్రలోకములను పొంది, దేవతాభోగములను అనుభవించుచున్నారు.

౨౧. అట్టిపురుషులు, మహత్తైన స్వర్గలోక భోగములను అనుభవించి, వారి పుణ్యకర్మఫలము క్షీణించినపిదప, తిరుగా మనుష్యలోకమునందు జన్మించుచున్నారు. ఈప్రకారము, వేదకర్మలనుకామ్యార్థముతో అనుష్ఠించువారు, మర్త్య స్వర్గలోకములకుపోవుచున్ను, మరల వచ్చుచున్ను, ఉన్నారు.

౨౨. ఏపురుషులైతే, ఇతరాపేక్షలేక, నన్నే శరణు పొంది భజింపుచున్నారో, అట్టి అచంచలచిత్తులైన వారల యోగక్షేమములను, నేనే కాపాడుచున్నాను.

౨౩. యేప్యన్యదేవతాభక్తా యజంతేశ్రద్ధయాన్వితాః।
తేపిమామేవకౌంతేయ యజంత్యవిధిపూర్వకమ్॥

౨౪. అహంహిసర్వయజ్ఞానాం భోక్తాచప్రభురేవచ।
నతుమామభిజానంతి తత్త్వేనాతశ్చ్యవంతితే॥

౨౫. యాంతిదేవ వ్రతాదేవాన్ పితౄన్యాంతి పితృ
వ్రతాః।
భూతానియాంతి భూతేజ్యా యాంతిమద్యాజినో
పిమామ్॥

౨౩. ఓయి కౌంతేయ, ఎవ్వరైతే, ఇతర దేవతాశ్రితులై భక్తిశ్రద్ధలతో ఆయా దేవతలను పూజించుచున్నారో, అట్టిజనులు, మోక్షప్రాప్తియందు ఆసక్తిలేని వారైనా, నన్నే పూజించుచున్నారని తెలియుము.

౨౪. సమస్తశ్రౌత స్మార్తకర్మలను అనుభవించేవాడున్ను, వాటికి ప్రభువున్ను, నేనేను. నాయథార్థ బ్రహ్మతత్వమును ఎరుంగనివారు, పైనచెప్పిన కర్మఫలానుభవములకు స్థానమైన స్వర్గలోకములోనుంచి, మరల, మర్త్యలోకమునకు వచ్చుచున్నారు.

౨౫. ఇంద్రాది దేవతలను, భక్తిశ్రద్ధలతో పూజించేవారు, ఇంద్రాది దేవలోకములనున్ను, పితృదేవతలను ఆశ్రయించిన వారు పితృలోకమునున్ను, వినాయకాది భూతములను పూజించువారు భూతగణ లోకమునున్ను, పొందుచున్నారు. నన్ను భక్తిశ్రద్ధలతో పూజించువారు, నన్నే పొందుచున్నారు.

౨౬. పత్రంపుష్పం ఫలంతోయం యోమేభక్త్యా ప్రయ
చ్ఛతి।
తదహంభక్త్యుపహృత మశ్నామిప్రయతాత్మనః॥

౨౭. యత్కరోషియదశ్నాసి యజ్జుహోషిదదాసియత్।
యత్తపస్యసికౌంతేయ తత్కురుష్వమదర్పణమ్॥

౨౮. శుభాశుభఫలైరేవం మోక్ష్యసేకర్మబంధనైః।
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తోమాముపైష్యసి॥

౨౯. సమోహంసర్వభూతేషు నమేద్వేష్యోస్తినప్రియః।
యేభజంతి తుమాంభక్త్యా మయితే తేషుచాప్య
హమ్॥

౨౬. ఎవ్వడైతే భక్తితో, నాకు, పత్రిమునైనా, పుష్పమునైనా, ఫలమునైనా, ఉదకమునైనా, సమర్పించుచున్నాడో, అట్టి బుద్ధిగలిగినవానిచేత, భక్తిపూర్వకముగా సమర్పింపబడిన ఆ వస్తువులను, నేను భుజించుచున్నాను.

౨౭. ఓయి కౌంతేయ, నీవుచేయుకర్మను, భుజించు పదార్థములను, చేయుహవిస్సులను, చేయుదానములను, చేయుతపస్సును, నాకు అర్పితముజేయుము.

౨౮. నీవు, పైనచెప్పిన ప్రకారము, నివృత్తిమార్గముతోగూడిన ఆత్మ గలవాడవైతే, కర్మసంబంధమైన శుభాశుభ ఫలములలోనుంచి, తప్పించుకోగలవు. అట్లు కర్మఫలములలోనుంచి విముక్తుడవైనపిదప, నాస్థానమైన మోక్షమును పొందగలవు.

౨౯. నేను, సర్వభూత ములకు సముడను, నాకు, ప్రియుడుగాని ద్వేషిగానిలేడు, ఎవ్వడైతే, భక్తి శ్రద్ధలతో నన్నుభజింపుచున్నాడో, అట్టివాడు, నాయందున్నవాడు, అట్టివానియందు, అనుగ్రహ రూపుడై, నేను ఉండువాడను.

౩౦. అపిచేత్సుదురాచారో భజతేమామనన్యభాక్।
సాధురేవసమంతవ్య స్సమ్యగ్వ్యవసితోహిసః॥

౩౧. క్షిప్రంభవతిధర్మాత్మా శశ్వచ్ఛాంతింనిగచ్ఛతి।
కౌంతేయప్రతిజానీహి నమేభక్తఃప్రణశ్యతి॥

౩౨. మాంహిపార్థవ్య పాశ్రిత్య యేపిస్యుః పాపయోన
యః।
స్త్రియోవైశ్యా స్తథాశూద్రా స్తేపియాంతిపరాంగ
తిమ్॥

౩౩. కింపునర్బ్రాహ్మణాఃపుణ్యా భక్తారాజర్షయ స్తథా।
అనిత్యమసుఖంలోక మిమంప్రాప్యభజస్వమామ్॥

౩౦. అతిదురాచారముగల ఎవ్వడైనా, ఇతరమును భజింపక, నన్నే శరణుపొంది భక్తిచేసెనేని, అట్టివాడు, ఆత్మతత్వమెరింగిన మద్భక్తుడు, గనుక, వాడు, సదాచారముగలవాడనే, ఎరుంగుము.

౩౧. అట్టిపురుషుడు, అతిత్వరలో, ధర్మాత్ముడై, నిత్యమైన పరమశాంతిని పొందుచున్నాడు. ఓయి కౌంతేయ, అట్టి దురాచారముగలిగిన నాభక్తుడు, నాశము పొందడని, నీవు ప్రతిజ్ఞచేయుము.

౩౨. ఓయిపార్థ, నికృష్ట జన్మములు గలవారున్ను, స్త్రీలున్ను, వైశ్యులున్ను, శూద్రులున్ను, నన్నే ఆశ్రియించి భక్తిచేయువారయిరేని, అట్టివారున్ను, ఉత్కృష్టమైనగతిని పొందుచున్నారు.

౩౩. కావున, పవిత్రులై, భక్తితో గూడు కొనియున్న బ్రాహ్మణశ్రేష్ఠులున్ను, రాజర్షులున్ను, ఉత్కృష్టమైనగతిని పొందువారనుటకు, సందేహములేదు. క్షణభంగురమై, తుచ్ఛ సుఖములుగల ఈ మర్త్యలోకమునందు, జన్మము ఎత్తినసీవు, నన్ను శరణుపొంది భజింపుము..

3౪. మన్మనాభవమద్భక్తో మద్యాజీమాంనమస్కురు।
మామేవైష్యసియుక్త్వైవ మాత్మానం మత్పరా
యణః॥

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
రాజవిద్యారాజగుహ్య
యోగోనామ
నవమోఽధ్యాయః.

---

౩౪. నీవు, నాయందు మనస్సునిలిపినవాడవై, భక్తి చేసి, నన్ను పూజించి, నాకు నమస్కారములు జేయుము. ఈ ప్రకారము, నీవు, సమస్త కాలములయందు, భక్తిశ్రద్ధలతో, స్థిరచిత్తమును ఉంచితివేని, నన్నే పొందగలవు.

ఇట్లని ఉపనిషద్రూపమైనట్టియు పరబ్రహ్మవిద్యయైనట్టి
భగవద్గీతలనెడు శ్రీకృష్ణార్జునసంవాదరూపమైన
యోగశాస్త్రమునందు రాజవిద్యా
రాజగుహ్యమను
తొమ్మిదవ అధ్యాయము ముగిసెను.



# విభూతియోగః.



శ్రీభగవానువాచ.

౧. భూయఏవమహాబాహో శృణుమేపరమంవచః।
యత్తేహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్య
యా॥

౨. నమేవిదుస్సురగణాః ప్రభవంనమహర్షయః।
అహమాదిర్హి దేవానాం మహర్షీణాంచసర్వశః॥

3. యోమామజమనాదించ వేత్తిలోకమహేశ్వరమ్।
అసమ్మూఢస్సమర్త్యేషు సర్వపాపైఃప్రముచ్యతే॥

# వి భూ తి యో గ ము.



శ్రీకృష్ణుల వాక్యము.

౧. ఓయి అర్జున, ప్రీతితో వినుచున్న నీకు, మేలు చేయ వలెననే కోరిక చేతను, పరమోత్కృష్టమైన ఏ వాక్యమును నేను చెప్పబోవుచున్నానో, దానిని వినుము.

౨. ఇంద్రాది దేవతలు, మహర్షులు, నా ఉత్పత్తిస్థానమును ఎరుంగరు. ఇంద్రాది దేవతలకును, మహర్షులకును, ఉత్పత్తికారణము నేనేగదా.

౩. నన్ను ఆది లేనివాడనియు, పుట్టువు లేనివాడనియు, సమస్తలోకులకు నియామకుడనియు, ఏ పురుషుడు ఎరుంగునో, అట్టి పురుషుడు, మోహమును విడిచినవాడై, సమస్తపాపములచేత విడువబడినవాడగును.

౪. బుద్ధిర్జ్ఞానమసంమోహః క్షమాసత్యందమశ్శమః।
సుఖందుఃఖంభవోభావో భయంచాభయమేవచ॥

౫. అహింసాసమతాతుష్టి స్తపోదానంయశోయశః।
భవంతిభావాభూతానాం మత్తఏవపృథగ్విధాః॥

౬. మహర్షయస్సప్తపూర్వే చత్వారోమనవస్తథా।
మద్భావామానసాజాతా ఏషాంలోకఇమాఃప్రజాః॥

౭. ఏతాం విభూతిం యోగంచ మమయో వేత్తితత్త్వ
తః।
సోవికంపేనయోగేన యుజ్యతేనాత్రసంశయః॥

౪, ౫. బుద్ధి, జ్ఞానము, మోహములేకపోవుట, ఓర్పు, సత్యము, బాహ్యేంద్రియనిగ్రహము, అంతరింద్రియ నిగ్రహము, శాంతి, సుఖదుఃఖములు, ఉత్పత్తి నాశములు, భయము, భయములేక పోవుట, హింసచేయక పోవుట, సమచిత్తత్వము, సంతుష్టి, తపస్సు, దానము, కీర్తి, అపకీర్తి, ఈ నానావిధములైన గుణములు, ప్రాణికోట్లకు, నావల్లనే గలుగుచున్నవి.

౬. మరియు, భృగ్వాదిమహర్షి సప్తకంబు, సనకసనందనాది చతుష్టయంబు, స్వాయంభువాది మనువులు, బ్రహ్మాత్మకంబగు నావలన, మద్గతభావము గలవారై, పుట్టిరి. వారివలన, ఈ సమస్తలోకములయందు, చరాచరరూపములైన భూతములు, పుట్టెను.

౭. ఎవ్వడైతే, ఈపైన చెప్పిన నావిభూతినిన్ని, యోగమహిమనున్ను, చక్కగా తెలిసికొనునో, అట్టివాడు, అచంచలయోగసిద్ధిని, నిస్సంశయముగా పొందుచున్నాడు.

౮. అహంసర్వస్యప్రభవో మత్తస్సర్వంప్రవర్తతే।
ఇతిమత్వాభజంతేమాం బుధాభావసమన్వితాః॥

౯. మచ్చిత్తామద్గతప్రాణా బోధయంతఃపరస్పరమ్।
కథయంతశ్చమాంనిత్యం తుష్యంతిచరమంతిచ॥

౧౦. తేషాంసతతయుక్తానాం భజతాంప్రీతిపూర్వకమ్।
దదామిబుద్ధియోగంతం యేనమాముపయాంతితే

౧౧. తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజంతమః।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేనభాస్వతా॥

౮. సర్వసృష్టికి ఉత్పత్తి కారణమైనవాడను నేనే. నా మహిమవల్లనే, సమస్తప్రపంచములు జరుగుచున్నవి. పండితులు, నాభావమును ఈప్రకారముగా తెలిసినవారై, నన్ను సేవింపుచున్నారు.

౯. మరియు, పండితులు, నాయందు చిత్తముగలవారై, నాయందే ప్రాణములు ఒప్పగించినవారై, నా స్వభావమహిమలను తామెరింగి, ఒకరికొకరు ఉపదేశము చేసికొనుచు, నాకథామృతమువలన సంతుష్టులై, బ్రహ్మానందమును అనుభవించుచున్నారు.

౧౦. ఈప్రకారము, సర్వదా నాయందు ఆసక్తిగలిగి, విశ్వాస పూర్వకముగా సేవించుచున్న మహాత్ములకు, నాలో ఐక్యమునకు హేతువైన జ్ఞానయోగమును, నేను ఇచ్చుచున్నాను.

౧౧. అట్టి మహాపురుషులకు మాత్రమే, నేను దయచేసి, నాసర్వవ్యాపకమైన జ్ఞానప్రకాశముచేత, వారల ప్రకృతి సంబంధమైన అవివేకమనే అంధకారమును, నశింపచేయుచున్నాను.

---

అర్జున ఉవాచ.

౧౨. పరంబ్రహ్మపరంధామ పవిత్రంపరమంభవాన్।
పురుషంశాశ్వతందివ్య మాదిదేవమజంవిభుమ్॥

౧౩. ఆహుస్త్వా మృషయస్సర్వే దేవర్షిర్నారదస్తథా।
అసితోదేవలోవ్యాస స్స్వయంచైవబ్రవీషిమే॥

౧౪. సర్వమేతదృతంమన్యే యన్మాంవదసికేశవ।
నహితేభగవన్వ్యక్తిం విదుర్దేవానదానవాః॥

౧౫. స్వయమేవాత్మనాత్మానం వేత్థత్వంపురుషోత్తమ।
భూతభావనభూతేశ దేవదేవజగత్పతే॥

అర్జున వాక్యము.

౧౨, ౧౩. ఓయికృష్ణ, నీవు పరబ్రహ్మమనియు, పరంధాముడనియు, పరమోత్కృష్టుడనియు, పరమ పావనుడనియు, పురాణ పురుషుండనియు, శాశ్వతుం డనియు, దివ్యమూర్తి యనియు, దేవతలలోన మొదటివాడవనియు, పుట్టువులేనివాడనియు, ప్రభువనియు, దేవఋషియైన నారదుడున్ను, దేవలఋషిన్ని, అసితఋషిన్ని, వేదవ్యాసులున్ను, మహర్షులందరున్ను, వర్ణింతురు. నీవున్ను, అదేరీతిగా, నీమహిమను, నాకు దెలియ చేయుచున్నావు.

౧౪. ఓయి కేశవ, నీవు నాకు ఉపదేశించిన యావద్వాక్యములను, సత్యమని నేను నమ్ముచున్నాను, నీమహిమను, దేవతలుగాని, అసురులుగాని, చక్కగా తెలిసికొనవాలరు.

౧౫. ఓయి పురుషోత్తమ, నీవు ప్రాణులను వృద్ధిపొందించువాడవు, ప్రాణులకు నియామకుడవు, దేవ దేవుడవు, లోకనాయకుడవు, పురుషశ్రేష్ఠుడవు, నీ మహాత్వముదెలియదగినవాడు నీవేగాని, మరియొకడులేడు.

౧౬. వక్తుమర్హస్యశేషేణ దివ్యాహ్యాత్మవిభూతయః।
యాభిర్విభూతిభిర్లోకా నిమాం స్త్వంవ్యాప్యతిష్ఠసి॥

౧౭. కథంవిద్యా మహంయోగిౝ త్వాంసదా పరిచిం
యౝ।
కేషుకేషుచభావేషు చింత్యోసిభగవన్మయా॥

౧౮. విస్తరేణాత్మనోయోగం విభూతించజనార్దన।
భూయఃకథయతృప్తిర్హిశృణ్వతో నాస్తిమేమృతమ్॥

---

శ్రీభగవాౝ ఉవాచ.

౧౯. హంతతేకథయిష్యామి దివ్యాహ్యాత్మవిభూతయః।
ప్రాధాన్యతఃకురుశ్రేష్ఠ నాస్త్యంతోవిస్తరస్యమే॥

౧౬. నీస్వకీయమైన మహాత్మ్యములు, విస్తారముగా ప్రకాశించు చున్నవి. ఈ సమస్త లోకములను, ఏమాహాత్మ్య విస్తారములచేత నీవు వ్యాపించి, ప్రకాశింపజేయు చున్నావో, అవి యన్నియు, సవిస్తారముగా దెలియజేయుటకు, నీవే అర్హుడవు.

౧౭. ఓయోగీశ్వర, నిన్ను సమస్త వేళలయందును, ఏవిధముగా ధ్యానముజేసి, తెలిసికోగలను. నీవు, ఏయే స్వరూపములు గలవాడవుగా, ధ్యానము జేయుటకు, తగినవాడవు.

౧౮. ఓ జనార్దన, నీ సర్వజ్ఞత్వవిభూతి విస్తారములను, సవిస్తారముగా, మరల నాకు సెలవిమ్ము, నీ వాక్యామృత ధారలు ఎంత విననప్పటికిన్ని, నాకు తృప్తిలేదు.

---

శ్రీకృష్ణుల వాక్యము.

౧౯. ఓయి కురుశ్రేష్ఠ, నామాహాత్మ్యములు బహుళములుగా నున్నయవి. వాటిని సంఖ్యపెట్ట నలవిగాదు. అయినా, వాటిలో ముఖ్యములైన కొన్నిటిని, నీకొరకు చెప్పెదను, వినుము.

౨౦. అహమాత్మాగుడాకేశ సర్వభూతాశయస్థితః।
అహమాదిశ్చమధ్యంచ భూతానామంతఏవచ॥

౨౧. ఆదిత్యానామహంవిష్ణు ర్జ్యోతిషాంరవిరంశుమాన్।
మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహంశశీ॥

౨౨. వేదానాంసామవేదోఽస్మి దేవానామస్మివాసవః।
ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మిచేతనా

౨౩. రుద్రాణాంశంకరశ్చాస్మి విత్తేశోయక్షరక్షసామ్।
వసూనాంపావకశ్చాస్మి మేరుశ్శిఖరిణామహమ్॥

౨౪. పురోధసాంచముఖ్యంమాం విద్ధిపార్థబృహస్పతిమ్।
సేనానీనామహంస్కంద స్సరసామస్మిసాగరః॥

౨౦. ఓయి అర్జున, సమస్తభూతముల హృదయము లందున్న పరమాత్మస్వరూపిని నేనే, సమస్తభూతముల యొక్క ఉత్పత్తి, స్థితి, నాశములకు కారణభూతుడను, నేనేను.

౨౧. ద్వాదశాదిత్యులలో విష్ణువనే ఆదిత్యుడు నేనే, జ్యోతిస్వరూపములలో కిరణములుగల సూర్యుడు నేనే, వాయువులలో మరీచి యనువాయువు నేనే, నక్షత్రముల లో చంద్రుఁడు, నేనేను.

౨౨. వేదములలో సామవేదము నేనే, దేవతలలో దేవేంద్రుడు నేనే, ఇంద్రియములలో మనస్సు నేనే, ప్రాణు లలో బుద్ధి, నేనేను.

౨3. ఏకాదశరుద్రులలోశంకరుడు నేనే, యక్షరాక్షస గణములలో కుబేరుడు నేనే, అష్టవసువులలో అగ్నిహోత్రుడు నేనే, ఉన్నతపర్వతములలో మేరుపర్వతము, నేనేను.

౨౪. ఓయిపార్థ, పురోహితులలో దేవపురోహితుడైన బృహస్పతి నేనే, సేనానాయకులలో కుమారస్వామి నేనే, తటాకములలో సముద్రుడు, నేనేను.

౨౫. మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్।
యజ్ఞానాంజపయజ్ఞోస్మి స్థావరాణాంహిమాలయః॥

౨౬. అశ్వత్థస్సర్వవృక్షాణాం దేవర్షీణాంచనారదః।
గంధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలోమునిః॥

౨౭. ఉచ్చైశ్శ్రవసమశ్వానాం విద్ధిమామమృతోద్భవమ్।
ఐరావతం గజేన్ద్రాణాం నరాణాంచనరాధిపమ్॥

౨౮. ఆయుధానామహంవజ్రం ధేనూనామస్మి కామధుక్।
ప్రజనశ్చాస్మికందర్ప స్సర్పాణామస్మి వాసుకిః॥

౨౯. అనంతశ్చాస్మి నాగానాం వరుణోయాదసామహమ్।
పితౄణా మర్యమాచాస్మి యమ స్సంయమతా మ
హమ్॥

౨౫. మహర్షులలో భృగువునేనే, వాక్కులలో ప్రణవమునేనే, యజ్ఞములలో జపయజ్ఞమునేనే, స్థావరములలో హిమవత్పర్వతము, నేనేను

౨౬. వృక్షములలో అశ్వత్థవృక్షమునేనే, దేవఋషులలో నారదుడు నేనే, గంధర్వులలో చిత్రరథుడు నేనే, సిద్ధులలో కపిలమహాముని, నేనేను.

౨౭. అశ్వములలో అమృతముతోగూడా పుట్టిన ఉచ్చైశ్శ్రవమునేనే, గజశ్రేష్ఠములలో ఐరావతమునేనే, మనుష్యులలో రాజును, నేనేను.

౨౮. ఆయుధములలో వజ్రాయుధమునేనే, గోవులలో కామధేనువునేనే, ప్రాణులను పుట్టించే కాముణ్ణినేనే, సర్పశ్రేణిలో రాజైనవాసుకి, నేనేను.

౨౯. నాగుపాములలో అనంతుణ్ణినేనే, జలదేవతలలో వరుణుడునేనే, పితృదేవతలలో అర్యముడునేనే, దండించువార్లలో యముడు, నేనేను.

౩౦. ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్।
మృగాణాంచమృగేంద్రోఽహం వైనతేయశ్చపక్షిణామ్॥

౩౧. పవనఃపవతామస్మి రామశ్శస్త్రభృతామహమ్।
ఝషాణాంమకరశ్చాస్మి స్రోతసామస్మిజాహ్నవీ॥

౩౨. సర్గాణామాదిరంతశ్చ మధ్యంచైవాహమర్జున।
అధ్యాత్మవిద్యావిద్యానాం వాదఃప్రవదతామహమ్॥

౩౩. అక్షరాణామకారోఽస్మి ద్వంద్వస్సామాసికస్య చ।
అహమేవాక్షయఃకాలో ధాతాహం విశ్వతోముఖః॥

౩౪. మృత్యుస్సర్వహరశ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్।
కీర్తిఃశ్రీర్వాక్చనారీణాం స్మృతిర్మేధాధృతిఃక్షమా॥

౩౦. దైత్యులలో ప్రహ్లాదుడునేనే, లెక్కపెట్టువార లలో కాలమునేనే, మృగములలో సింహమునేనే, పక్షు లలో గరుత్మంతుడు, నేనేను.

౩౧. పరిశుద్ధవస్తువులలో వాయువునేనే, ధనుర్ధరు లలో దశరథరాముడునేనే, మత్స్యము మొదలైన జల జంతువులలో మొసలినేనే, నదులలో గంగానది, నేనేను.

౩౨. ఓయి అర్జున, సృష్టులకు ఆది, స్థితి, లయ ములునేనే, విద్యలలో మోక్షవిద్యనేనే, వాదజల్ప వితం డములలో వాదము, నేనేను.

౩౩. అక్షరములలో అకారమునేనే, సమాసముల లో ద్వంద్వసమాసమునేనే, తుదలేనికాలమునేనే, కర్మ ఫలదాయకుడైన విశ్వతోముఖుడనే బ్రహ్మనేనేను.

౩౪. సమస్తలోకములను, నాశముజేయు మృత్యు దేవతనేనే, ఉత్పత్తికాగల వస్తువులకు, ఉత్పత్తిస్థానము నేనే, స్త్రీలయందుకీర్తి, లక్ష్మి, వాక్కు, తెలివి, బుద్ధి, ధైర్యము, ఓర్పు, నేనేను.

3౫. బృహత్సామతథా సామ్నాం గాయత్రీఛందసా
హమ్।
మాసానాంమార్గశీర్షోహమృతూనాంకుసుమాకరః॥

3౬. ద్యూతంచలయతామస్మి తేజ స్తే జస్వినామహమ్।
జయోస్మి వ్యవసాయోస్మి సత్త్వం సత్త్వవతామ
హమ్॥

3౭. వృష్ణీనాంవాసుదేవోస్మి పాండవానాంధనంజయః।
మునీనామప్యహంవ్యాసః కవీనాముశనాకవిః॥

3౮. దండోదమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్।
మౌనంచైవాస్మి గుహ్యానాం జ్ఞానంజ్ఞానవతామ
హమ్॥

3౯. యచ్చాపిసర్వభూతానాం బీజంతదహమర్జున।
నతద స్తివినాయత్స్యాన్మయాభూతంచరాచరమ్॥

3౫. సామవేదములో బృహత్సామమునేనే, ఛందస్సులలో గాయత్రీఛందస్సునేనే, మాసములలో మార్గశీర్షమాసమునేనే, ఋతువులలో వసంతఋతువు, నేనేను.

3౬. వంచకమైన వస్తువులలో జూదమునేనే, తేజోవంతుల తేజస్సునేనే, సాత్వికుల సత్వగుణము, జయము, దారుఢ్యము, ఉద్యోగము, నేనేను.

3౭. యాదవులలో వాసుదేవుడునేనే, పాండవులలో అర్జునుడవైన నీవున్ను నేనే, మునులలో వేదవ్యాసమహామునినేనే, శాస్త్రార్థముల నెరింగినవారలలో శుక్రాచార్యులు, నేనేను.

3౮. దండించువారలయొక్క దండనీతినేనే, జయించ నిచ్ఛయించినవారల జయోపాయములునేనే, గోప్యమైన వస్తువులలో మౌనమునేనే, జ్ఞానవంతులలో జ్ఞానము, నేనేను.

3౯. ఓయి అర్జున, సమస్తభూతములకు బీజము నేనే, నేనుగాని చరాచరభూతములు, లేనేలేవు.

౪౦. నాంతోఽస్తిమమదివ్యానాం విభూతీనాంపరంతప।
ఏషతూద్దేశతఃప్రోక్తో విభూతేర్విస్తరోమయా॥

౪౧ యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవవా।
తత్తదేవావగచ్ఛత్వం మమతేజోంశసంభవమ్॥

౪౨. అథవాబహునైతేన కింజ్ఞానేనతవార్జున।
విష్టభ్యాహమిదంకృత్స్నమేకాంశేనస్థితోజగత్॥

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
విభూతి యోగోనామ
దశమోధ్యాయః.



౪౦. ఓయి అర్జున, నాయొక్క మహాత్మ్యముల విస్తారములకు, అంత్యములేదు. అయినా, నీకొరకై, వాటిని సంక్షేపముగా తెలియజేసితిని.

౪౧. లోకమునందు, ఐశ్వర్యయుక్తమై, బలపరాక్రమయుక్తమై, ఉత్సాహయుక్తమై, కాంతియుక్తమై, ఏయేవస్తువులుగలవో, అవి యావత్తు, నాతేజోభాగ సంభవమైనవిగా, దెలిసికొనుము.

౪౨. ఓయి అర్జున, నామహాత్మ్యముల విస్తారములను, నేర్వేరుగా వివరించవలసిన అవశ్యములేదు, వాటిని, సవిస్తారముగా దెలియవలసినపని, నీకున్ను లేదు, ఈ సమస్త ప్రపంచములు, నాఅనేక అంశములలో, ఒక అంశముచేతనే, వ్యాపింపబడి యున్నవని, తెలియుము.

ఇట్లని ఉపనిషద్రూపమైనట్టియు పరబ్రహ్మవిద్యయైనట్టి
భగవద్గీతలనెడు శ్రీకృష్ణార్జునసంవాదరూపమైన
యోగశాస్త్రమునందు విభూతియోగమను
పదియవ అధ్యాయము ముగిసెను.



# విశ్వరూపసందర్శనయోగః.

---

అర్జున ఉవాచ.

౧. మదనుగ్రహాయపరమం గుహ్యమధ్యాత్మసంజ్ఞితమ్।
యత్త్వయోక్తంవచస్తేన మోహోఽయంవిగతో మమ॥

౨. భవాప్యయౌహిభూతానాం శ్రుతౌవిస్తరశో మయా।
త్వత్తఃకమలపత్రాక్ష మాహాత్మ్యమపిచావ్యయమ్॥

౩. ఏవమేతద్యథాత్థత్వ మాత్మానం పరమేశ్వర।
ద్రష్టుమిచ్ఛామితేరూప మైశ్వరంపురుషోత్తమ॥

## విశ్వరూపసందర్శనయోగము.

---

అర్జునవాక్యము,

౧. నన్ను అనుగ్రహించుకొరకు, నీవు చెప్పిన ఉత్కృష్టమైనట్టియు, రహస్యమైనట్టియు, ఆత్మానాత్మవస్తు వివేకజ్ఞానమైనట్టియు. ఉపదేశవాక్యమువల్ల, నా అజ్ఞానము తొలగిపోయినది.

౨. ఓయి కృష్ణ, నీవల్ల, భూతజాలముల యొక్క ఉత్పత్తినాశములు, సవిస్తారముగా విన్నదేగాక, క్షయరహితమైన నీమహాత్మ్యమునున్ను, చక్కగావింటిని.

3. ఓపరమేశ్వర, నీవుపలికినది యథార్థమే, నీఆత్మస్వరూపము ఎట్టిదని నీవు తెలియజేసితివో, అట్టిమహిమగల నీస్వరూపమును చూచుటకు, నేను మిక్కిలి కోరియున్నాను.

౪. మన్యసేయదితచ్ఛక్యం మయాద్రష్టుమితిప్రభో।
యోగేశ్వరతతోమేత్వం దర్శయాత్మానమవ్యయమ్॥

---

శ్రీభగవాన్ ఉవాచ.

౫. పశ్యమేపార్థరూపాణి శతశోథసహస్రశః।
నానావిధానిదివ్యాని నానావర్ణాకృతీనిచ॥

౬. పశ్యాదిత్యాన్వసూన్రుద్రానశ్వినౌమరుతస్తథా।
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణిభారత॥

౭. ఇహైకస్థంజగత్కృత్స్నం పశ్యాద్యసచరాచరమ్।
మమదేహేగుడాకేశ యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి॥

౪. ఓ యోగయోగీశ్వర, అట్టిమహిమగల నిదివ్యస్వ రూపమును చూచుటకు, నాకు శక్యమని నీవు తలచితి వేని, నీ అవ్యయమైన స్వరూపమును, నాకు దర్శనము ఇమ్ము.

---

శ్రీకృష్ణుల వాక్యము.

౫. ఓయి పార్థ, దివ్యములై, అనేకవిధములై, నానా వర్ణములుగలవై, అనేకవిశేషములుగలవై, అనేకసం ఖ్యలుగల నాస్వరూపమును, చూడుము.

౬. ఓయిభారత, ద్వాదశాదిత్యులను, అష్టవసువు లను, ఏకాదశరుద్రులను, అశ్వినీదేవతలను, సప్తవాయు వులను, చూడుము. ఈవరకు ఎన్నడు నీచేతచూడబడని, అనేక సంఖ్యలుగల అద్భుతములను, ఇప్పుడు చూడుము.

౭. ఓయి అర్జున, మరియు, చరాచరంబగు సమస్త ప్రపంచంబును, ఒక్కస్థానమైన నాదివ్య దేహమునందు చూడుము. ఇవిగాక, జయపరాజయము మొదలైనవియే విషయములను, నీవుచూడ నిచ్ఛయించియున్నావో, వాటి నన్నిటిని చూడుము.

౮. నతుమాంశక్యసేద్రష్టు మనేనైవస్వచక్షుషా।
దివ్యందదామితేచక్షుః పశ్యమేయోగమైశ్వరమ్॥

---

**సంజయ ఉవాచ.**

౯. ఏవముక్త్వాతతోరాజన్ మహాయోగీశ్వరోహరిః।
దర్శయామాసపార్థాయ పరమంరూపమైశ్వరమ్॥

౧౦. అనేకవక్త్రనయన మనేకాద్భుతదర్శనమ్।
అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్॥

౧౧. దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనమ్।
సర్వాశ్చర్యమయందేవ మనంతంవిశ్వతోముఖమ్॥

౮. ఈ ప్రాకృతములైన నీకన్నులతో, నాదివ్య స్వరూపమును చూడనేరవు, నీకు దివ్యదృష్టిని అనుగ్రహించుచున్నాను, దానివల్ల, అద్భుతమైన నాయోగశక్తిని, చూడుము.

---

సంజయుని వాక్యము.

౯. ఓయి ధృతరాష్ట్రమహారాజ, మహాయోగీశ్వరుడైన శ్రీకృష్ణులు, పైనచెప్పినరీతిగాపలికి, సర్వోత్కృష్టమై, దివ్యమైన తన విశ్వరూపమును, అర్జునునికొరకు చూపెను.

౧౦. ఆస్వరూపము, అనేక ముఖములతోను, నేత్రములతోను, అనేక అద్భుతములతోను, బహువిధములైన దివ్యభూషణములతోను, అనేక దివ్యాయుధములతోను కూడుకొనియుండెను.

౧౧. మరియు, దివ్యములైన హారములతోను వస్త్రములతోను, దివ్యపరిమళములైన గంధములతోను, కూడుకొని, అంతటను ముఖములుగలదై, అద్భుతమై, అంత్యములేనిదైన స్వరూపమును, అర్జునుడుచూచెను.

౧౨. దివిసూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా।
యదిభాస్సదృశీసాస్యా ద్భాస స్తస్యమహాత్మనః॥

౧౩. తత్రైకస్థంజగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా।
అపశ్యద్దేవదేవస్య శరీరేపాండవ స్తదా॥

౧౪. తతస్సవిస్మయావిష్టో హృష్టరోమాధనంజయః।
ప్రణమ్యశిరసాదేవం కృతాంజలిరభాషత॥

---

అర్జున ఉవాచ.

౧౫. పశ్యామిదేవాం స్తవదేవదేహే సర్వాం స్తథాభూత
విశేషసంఘాన్।
బ్రహ్మాణమీశం కమలాసనస్థం ఋషీంశ్చ సర్వానుర
గాంశ్చదివ్యాన్॥

౧౨. ఆ దివ్యస్వరూపము యొక్క కాంతి, ఏకకాలమునందు, వేయుగురు సూర్యులు ఆకాశమునందు ప్రకాశించిన, ఎంతకాంతిగా నుండునో, దానికి సమానముగా నుండెను.

౧౩. బహుప్రకారములుగా, వేర్వేరు విధములుగా, ఏర్పరచియుండే సమస్తజగత్తులు, దేవదేవుడైన శ్రీకృష్ణమూర్తి శరీరమునందు ఒక్కటిగా పోగై యుండిన వాటిని, అర్జునుడు చూచెను.

౧౪. అప్పుడు అర్జునుడు, చిత్తవిభ్రాంతినిబొంది, దేహము గగ్గురుపాటుగలవాడై, విశ్వరూపధరుడైన శ్రీకృష్ణస్వామికి శిరసానమస్కరించి, చేతులుముకుళించి, ఈదిగువ చెప్పినరీతిగా, పలికెను.

అర్జున వాక్యము.

౧౫. ఓదేవ, నీదేహమునందు, సమస్తదేవతలు, సమస్తప్రాణికోట్లు, కమలము ఆసనముగాగల చతుర్ముఖబ్రహ్మ, సమస్తఋషులు, దేవసర్పములైన వాసుకి మొదలుగాగలవారు, కనుబడుచున్నారు.

౧౬. అనేకబాహూదర వక్త్ర నేత్రం పశ్యామిత్వాంసర్వ
తోఽనంతరూపమ్।
నాంతంనమధ్యం నపున స్తవాదిం పశ్యామివిశ్వేశ్వర
విశ్వరూప॥

౧౭. కిరీటినంగదినం చక్రిణంచ తేజోరాశిం సర్వతోదీప్తి
మంతమ్।
పశ్యామిత్వాం దుర్నిరీక్షంస మంతాద్దీప్తానలార్క
ద్యుతిమప్రమేయమ్॥

౧౮. త్వమక్షరంపరమంవేదితవ్యం త్వ మస్యవిశ్వస్యపరం
నిధానమ్।
త్వమవ్యయశ్శాశ్వత ధర్మగోప్తా సనాతన స్త్వం పు
రుషోమతోమే॥

౧౬. జగత్తులకు నియామకుడైన ఓదేవ, నీవిశ్వరూపమునకు, అనేకబాహువులు, ఉదరములు, ముఖములు, నేత్రములు, గలిగియున్నవి. నీఆకారము, అపరిమితముగా, అంతట వ్యాపించియున్నది. అయితే, నీస్వరూపమునకు, తుద, మొదలు, మధ్యభాగము, నాకు కనుబడలేదు.

౧౭. కిరీటమును, గదాచక్రములను, ధరించిన నీవిశ్వరూపము, జ్యోతిర్మయమై, అగ్నిసూర్యులకు సమానముగా, అంతట ప్రజ్వలించుచున్నది. అపరిచ్ఛేద్యమైననీస్వరూపమును చూచుటకు, బహుఅశక్యముగానున్నది.

౧౮. ఓజగదీశ్వర, నీవు, పరమోత్కృష్టమైన పరబ్రహ్మమనియు, సమస్తజగత్తులకు ఉత్కృష్టమైన ఆశ్రయమనియు, నాశరహితుడవనియు, ఊర్జితములైన ధర్మరక్షకుడవనియు, పురాణపురుషుడవనియు, తెలియదగినవాడవు.

౧౯. అనాదిమధ్యాంతమనంతవీర్య మనంత బాహుంశశి
సూర్యనేత్రం।
పశ్యామిత్వాందీప్తహుతాశవక్త్రంస్వతేజసావి
శ్వమిదంతపంతమ్॥

౨౦. ద్యావాపృథివ్యోరిదమంతరంహి వ్యాప్తంత్వయైకే
నదిశశ్చసర్వాః।
దృష్ట్వాద్భుతం రూపముగ్రంతవేదం లోకత్రయం
ప్రవ్యథితంమహాత్మన్॥

౨౧. అమీహిత్వా సురసంఘావిశంతి కేచిద్భీతాః ప్రాం
జలయోగృణంతి।
స్వస్తీత్యుక్త్వామహర్షి సిద్ధసంఘాః స్తువంతి త్వాంస్తు
తిభిఃపుష్కలాభిః॥

౧౯. ఓవిశ్వేశ్వర, నీవు, ఆదిమధ్యాంతములులేనివాడవై, అపరిమిత పరాక్రమముగలవాడవై, అనేకబాహువులుగలిగి, సూర్యచంద్రులను నేత్రములుగా ధరించి, ప్రజ్వలింపుచున్న అగ్నియే ముఖమునందు గలవాడవై, ఈ సమస్తప్రపంచములను, నీకాంతిచేత తపింపచేయువాడవుగా, నాకు, కనుబడుచున్నావు.

౨౦. నీఒక్కని స్వరూపముచేత, భూమి, ఆకాశము, అంతరాళము, అన్నీ వ్యాపింపబడి యున్నవి. సమస్త దిక్కులు వ్యాపించిన ఓ మహానుభావ, అద్భుతముగానున్ను, అతి భయంకరముగానున్ను, ఉండే నీస్వరూపమును చూచి, స్వర్గ, మర్త్య, పాతాళమను మూడులోకములు, గడగడవణుకుచున్నవి.

౨౧. నీదివ్య స్వరూపమైన విశ్వరూపమునందు, దేవ సమూహములు శరణుచొచ్చుచున్నవి. అందులో కొందరు, భయమునుచెంది, అంజలి బద్ధులై, నిన్ను స్తోత్రముజేయుచున్నారు. మహాఋషులు, సిద్ధపురుషులు, నీకు జయప్రదవాక్యములు జెప్పుచు, నిన్ను, అనేకవిధములుగా, సంపూర్ణమైన స్తోత్రముజేయుచున్నారు.

౨౨. రుద్రాదిత్యా వసవోయేచసాధ్యా విశ్వేశ్వినౌమరు
తశ్చోష్మపాశ్చ।
గంధర్వయక్షాసురసిద్ధసంఘా వీక్షం తేత్వాంవిస్మి
తాశ్చైవసర్వే॥

౨౩. రూపంమహత్తేబహువక్త్రనేత్రం మహాబాహో
బహుబాహూరుపాదమ్।
బహూదరంబహుదంష్ట్రాకరాళం దృష్ట్వాలోకాః
ప్రవ్యథితాస్తథాహమ్॥

౨౪. నభస్పృశందీప్తమనేకవర్ణం వ్యాత్తాననందీప్తవిశా
లనేత్రమ్।
దృష్ట్వాహిత్వాం ప్రవ్యథితాంతరాత్మా ధృతింనవిం
దామిశమంచవిష్ణో॥

౨౨. ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, సాధ్యులు, విశ్వేదేవతలు, అశ్వినీదేవతలు, సప్తవాయువులు, పితృదేవతలు, గంధర్వ, యక్ష, రాక్షస, సిద్ధసమూహములు, ఆశ్చర్యపరులై, నిన్నే చూచుచున్నారు.

౨౩. అనేకములైన ముఖములు, నేత్రములు, చేతులు, తొడలు, పాదములు, కడుపులు, భయంకరమైన కోరలుగల, నీ అమితాకారమునుజూచి, సమస్తప్రాణులున్ను, నేనున్ను, బహుభయపడుచున్నారము.

౨౪. ఆకాశమును తాకుచున్నట్టియు, జ్వలించుచున్నట్టియు, నానావర్ణములు గలిగినట్టియు, తెరవబడియుండునోర్లు గలిగినట్టియు, ప్రకాశించెడు విశాలనేత్రములు గలిగినట్టియు, నీస్వరూపమునుచూచి, నామనస్సు భీతిచెందియున్నది, గనుక, నాకుధైర్యము, మనస్తుష్టి, లేకయున్నవి.

౨౫. దంష్ట్రాకరాళానిచతే ముఖాని దృష్ట్వైవ కాలానలస
న్నిభాని।
దిశోనజానేనలభేచశర్మ ప్రసీదదేవేశజగన్నివాస॥

౨౬. అమీచత్వాం ధృతరాష్ట్రస్యపుత్రా స్సర్వేసహై
వావనిపాలసంఘైః।
భీష్మోద్రోణ స్సూతపుత్ర స్తథాసౌ సహాస్మదీయైరపి
యోధముఖ్యైః॥

౨౭. వక్త్రాణితేత్వరమాణావిశంతి దంష్ట్రాకరాళాని భయా
నకాని।
కేచిద్విలగ్నా దశనాంతరేషు సందృశ్యంతే చూర్ణితై
రుత్తమాంగైః॥

౨౮. యథానదీనాం బహవోంబువేగా స్సముద్రమేవాభి
ముఖాద్రవంతి।
తథాతవామీ నరలోకవీరా విశంతి వక్త్రాణ్యభివిజ్వ
లంతి॥

౨౫. కోరలచే భయంకరములై, ప్రళయాగ్నిసమానములైన, నీముఖములను చూచుటవలన, నాకు దిక్కులు దెలియకయున్నవి, పైగా, నాకుసుఖములేకయున్నది, జగదాధారుడవైన ఓదేవ, నీవు నాయందు దయచేసి, నాకు ప్రసన్నుడవుకమ్ము.

౨౬, ౨౭. ఈధృతరాష్ట్రపుత్రులైన దుర్యోధనాదులు, భూపాలక రాజసమూహములు, భీష్మద్రోణాచార్యులు, సూతపుత్రుడైనకర్ణుడు, నాయొక్క సేనానాయకులు, అందరుకూడా గుంపులుజేరి, అతివేగముగలవారై, కోరలుగలిగి భయంకరములైన నీముఖములయందు, ప్రవేశించుచున్నారు, వారిలో గొందరు, నీదంతములసందులయందు జిక్కి, శిరస్సులు పొడిపొడిగా జేయబడినవారై, కనుబడుచున్నారు.

౨౮. అనేకములైన పూర్ణప్రవాహనదులు, అతివేగముతో, సముద్రమునందు ఎట్లుప్రవేశించుచున్నవో, ఆ రీతిగా, ఈశూరులందరు, ప్రజ్వలించుచున్న నీముఖములయందు, ప్రవేశించుచున్నారు.

౨౯. యథాప్రదీప్తం జ్వలనంపతంగా విశంతినాశాయ స
మృద్ధవేగాః।
తథైవనాశాయవిశంతిలోకా స్తవాపివక్త్రాణిసమృద్ధ
వేగాః॥

౩౦. లేలిహ్యసే గ్రసమానస్సమంతా ల్లోకాన్ సమగ్రాన్
వదనైర్జ్వలద్భిః।
తేజోభిరాపూర్యజగత్సమగ్రం భాసస్తవోగ్రాః ప్ర
తపంతివిష్ణో॥

౩౧. ఆఖ్యాహి మేకోభవానుగ్రరూపో నమోస్తుతే దేవ
వరప్రసీద।
విజ్ఞాతుమిచ్ఛామి భవంతమాద్యం నహి ప్రజానామి
తవప్రవృత్తిమ్॥

౨౯. మిడతలు, మండుచున్న అగ్నియందు, అధిక వేగముతో ప్రవేశించి, ఎట్లు నశించుచున్నవో, ఆప్రకారమే, అనేకప్రాణులు, అధికవేగముతో నీముఖములయందు ప్రవేశించి, నశించుచున్నారు.

౩౦. జ్వలించుచున్న నీ ముఖములచేత, సమస్తజనులను మ్రింగుచున్న వాడవై, అన్ని దిక్కులయందు, నీ నాలుకలతో ప్రాణుల నీడ్చుకొను చున్నావు, నీభయంకరమైన కాంతులు, సమస్తజగత్తులు నిండి, వాటిని తపింప చేయుచున్నవి.

౩౧. ఓ దేవదేవ, నీకుసాష్టాంగ నమస్కారములు జేయుచున్నాను. నాకొరకు దయజేసి ప్రసన్నుడవుకమ్ము. నీకు, ఇప్పుడు గలిగియుండు ప్రవృత్తికి కారణము, నాకు తెలియలేదు. ఈ భయంకర స్వరూపముగల నీవు, ఎవ్వడవు. ఆద్యుడవైన నిన్ను, తెలిసికొనవలెనని, కోరియున్నాను. దయజేసి నాకుచెప్పుము.

---

శ్రీభగవాన్ ఉవాచ.

3౨. కాలోస్మి లోక క్షయకృత్ప్రవృద్ధో లోకాన్ సమా
హర్తుమిహ ప్రవృత్తః।
ఋతేపి త్వాన భవిష్యంతి సర్వే యేవస్థితాః ప్రత్యనీకే
షు యోధాః॥

33. తస్మాత్త్వముత్తిష్ఠ యశోలభస్వ జిత్వాశత్రూన్ భు
క్ష్వరాజ్యంసమృద్ధమ్।
మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రంభ
వసవ్యసాచిన్॥

3౪. ద్రోణంచభీష్మంచ జయద్రథంచ కర్ణంతథాన్యానపి
యోధవీరాన్।
మయాహతాంస్త్వంజహిమావ్యథిష్ఠా యుధ్యస్వజే
తాసిరణేసపత్నాన్॥

శ్రీకృష్ణుల వాక్యము.

౩౨. నేను, ఈలోకములనెల్ల నశింపజేయు ప్రబలమైన కాలస్వరూపిని, నేను, ఇప్పుడు, ఈలోకములను సంహరించుటకు ఉద్యుక్తుడనైనాను, ఈ ఉభయసేనలయందు యుద్ధము జేయుటకు వచ్చినవారలలో, నీవుదక్క మరి ఎవ్వరును, బ్రతుకగలవారు లేరు.

౩౩. గనుక, నీవు యుద్ధముజేయుటకులెమ్ము, నీశత్రువులనందరినిగెలిచి, కీర్తిబొంది, ఏకచ్ఛత్రాధిపత్యమును అనుభవింపుము. నీ శత్రువులందరు, నాచేత, మునుపే సంహరింపబడినారు, గనుక, నీవు కారణమాత్రుడుగా నుండుము.

౩౪. ఇదివరకే, నాచేతచంపబడిన ద్రోణాచార్యులను, భీష్ములను, సైంధవుని, కర్ణుని, ఇంకా అనేకులైన పరాక్రమశాలురను, గెలువుము, నీవు, వ్యధపడ పనిలేదు. యుద్ధములో, శత్రువులను, నీవు గెలువగలవు.

---

సంజయ ఉవాచ.

౩౫. ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాంజలిర్వేపమానః కిరీటీ।
నమస్కృత్వాభూయ ఏవాహకృష్ణం సగద్గదంభీతభీతః ప్రణమ్య॥

---

అర్జున ఉవాచ.

౩౬. స్థానేహృషీకేశతవప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతేచ।
రక్షాంసిభీతాని దిశోద్రవంతి సర్వేనమస్యంతి చసిద్ధసంఘాః॥

సంజయుని వాక్యము.

౩౫. ఓయి ధృతరాష్ట్రమహారాజ, పైనచెప్పిన శ్రీకృష్ణునిమాటలు, గడగడవణుకుచున్న అర్జునుడువిని, నమస్కారముజేసి, అంజలిబద్ధుడై, మాటిమాటికి భయపడుచు, నమస్కారములుజేయుచు, శ్రీకృష్ణులనుజూచి, ఒకమాట చెప్పెను.

---

అర్జున వాక్యము.

౩౬. ఓ హృషీకేశ, నీవు ఇంతటి మహాపురుషుడవు గనుకనే, నిన్ను సమస్తలోకములు, కీర్తనజేసి, సంతోషించుచున్నవి, నీయందు అధికశ్రద్ధాభక్తులు జేయుచున్నవి, రాక్షసులందరు, నిన్నుచూచి బహుభయమును జెంది, నానాదిక్కులకు పారిపోవుచున్నారు, సమస్తసిద్ధపురుషులు, నీకు నమస్కారములు జేయుచున్నారు.

౩౭. కస్మాచ్చ తేనన మేరన్మహాత్మన్ గరీయసే బ్రహ్మణో
ప్యాదికర్త్రే।
అనంత దేవేశ జగన్నివాస త్వమక్షరం సదసత్తత్పరం
యత్॥

౩౮. త్వమాదిదేవః పురుషః పురాణ స్త్వమస్య విశ్వస్య
పరంనిధానమ్।
వేత్తాసివేద్యంచపరంచధామ త్వయాతతంవిశ్వమ
నంతరూప॥

౩౯. వాయుర్యమోఽగ్నిర్వరుణశ్శశాంకః ప్రజాపతి స్త్వం
ప్రపితామహశ్చ।
నమోనమ స్తేస్తు సహస్రకృత్వః పునశ్చభూయోపిన
మోనమ స్తే॥

౩౭. ఓజగన్నాయక, నీవు పరమశ్రేష్ఠుడవై, బ్రహ్మదేవునికి ఆదికారణ భూతుడవై నందున, నిన్ను సమస్తప్రపంచములు పూజించడము, సహజమైనది. నీవు, అనంతుడవు, జగత్తులకు ఆధారభూతుడవు, నాశములేనివాడవు, సదసత్తులనే జీవశరీరంబులకంటే, ఉత్కృష్టమైన పరబ్రహ్మస్వరూపివి.

౩౮. ఓ పురాణ పురుష, నీవు, సమస్త దేవతలకు ఆదిదేవుడవు, పురాణపురుషుడవు, ఈసమస్తజగత్తులకు పరమాధార భూతుండవు, విశ్వవేత్తవు. మహానుభావులైనపురుషులవల్ల, పొందదగిన మోక్షస్థానము, నీవే, ఈసమస్తజగత్తులు, నీవల్ల, వ్యాపింపబడియున్నవి.

౩౯. ఓకృష్ణ, వాయువు, అగ్ని, వరుణుడు, చంద్రుడు, బ్రహ్మదేవుడు, బ్రహ్మకుతండ్రియైన మహావిష్ణువు, నీవె. నీకు వేయిమార్లు నమస్కారములు, పలుమారునమస్కారములు, మరలమరల నమస్కారములు.

౪౦. నమః పురస్తాదథ పృష్ఠత స్తే నమోస్తుతే సర్వత ఏవ
సర్వ।
అనంతవీర్యామితవిక్రమ స్త్వం సర్వం సమాప్నోషి తత
తోసి సర్వః॥

౪౧. సఖేతి మత్వా ప్రసభం యదుక్తం హేకృష్ణ హే యాదవ
హే సఖేతి।
అజానతా మహిమానం తవేదం మయా ప్రమాదా
త్ప్రణయేన వాపి॥

౪౨. యచ్చావహాసార్థమసత్కృతోసి విహార శయ్యాస
నభోజనేషు।
ఏకోథవాప్యచ్యుత తత్సమక్షం తత్ క్షామయే త్వా
మహమప్రమేయమ్॥

౪౦. ఓ కృష్ణ, నీకు ముందుపక్క, వెనుకపక్క, సమస్త దిక్కులలోనుంచి, నమస్కారములు, అమితమైన సామర్థ్యపరాక్రమములు గలిగిననీవు, సమస్తజగత్తులయందు నిండుగా వ్యాపించియున్నందున, సర్వస్వరూపుడవు, నీవేను.

౪౧. ఓ కృష్ణ, నీమహిమలను, నేను ఈవరలో దెలియక పోయినందున, నాఅజ్ఞానమువల్ల, నిన్ను, ఇదివరకు, స్నేహితుడవని తలచి, ఓ కృష్ణ, ఓ యాదవ, ఓ సఖుడ, అని, సాధారణముగా పిలిచినపలుకులను, నాయందుకటాక్షించి, క్షమింపవలయును.

౪౨. ఓమహానుభావ, నీవు, అప్రిమేయుండవని తెలియక, ఏకాంతంబుననేమి, ఇతరుల సమక్షములోనేమి పరిహాసార్థముగా, విహారశయ్యాసన భోజనవేళలయందు, తిరస్కారముగా మాటలాడిన యపరాధంబులు, దయచేసి క్షమింపుము.

౪౩. పితాసిలోకస్యచరాచరస్య త్వమస్యపూజ్యశ్చగురుర్గ
రీయాన్।
నత్వత్సమో౽స్త్యభ్యధికః కుతోన్యోలోకత్రయేప్య
ప్రతిమప్రభావ॥

౪౪. తస్మాత్ ప్రణమ్యప్రణిధాయకాయం ప్రసాదయే
త్వామహమీశమీడ్యమ్।
పితేవపుత్రస్యసఖేవసఖ్యుః ప్రియఃప్రియాయార్హసి
దేవసోఢుమ్॥

౪౫. అదృష్టపూర్వంహృషితోస్మిదృష్ట్వా భయేనచప్రవ్య
థితంమనోమే।
తదేవమేదర్శయదేవరూపం ప్రసీదదేవేశజగన్నివాస॥

౪౩. నీవు, సమానములేని ప్రభావములుగలవాడవు. చరాచరాత్మకమగు ఈ సమస్తప్రాణులకు తండ్రివి, పూజార్హుడవు, పరమగురుడవు, స్వర్గ మర్త్య పాతాళలోకములయందు, నీకు సమానుడు లేడు, అధికుడు ఎక్కడ నుంచి వచ్చును.

౪౪. ఓకృష్ణ, స్తోత్రార్హుడవైన నీకు, సాష్టాంగముగానమస్కరించి, నాకు ప్రసన్నుడు గావలయునని, ప్రార్థించుచున్నాను. నేను జేసిన సమస్త అపరాధములను, పుత్రుని తప్పులను తండ్రివలెను, చెలికాని తప్పులను చెలికానివలెను, నాయకి తప్పులను నాయకునివలెను, నీవు, సహించి మన్నించవలయును.

౪౫. ఓ జగన్నాయక, ఈవరలో, ఎప్పుడును చూడని నీ విశ్వరూపమును, దర్శనము జేసి, నేను, బహు ఆనందభరితుడనైతిని. అయినా, నామనస్సు, బహు భీతిని జెందియున్నది, నీ పూర్వరూపమును, నాకు దర్శనమిమ్ము. ఓ దేవదేవ, ఓజగదాధారభూతుడవైన స్వామి, నాకు, నీవు ప్రసన్నుడవు కమ్ము.

౪౬. కిరీటినంగదినంచక్రహస్త మిచ్ఛామిత్వాం ద్రష్టుమ
హంతథైవ।
తేనైవరూపేణచతుర్భుజేన సహస్రబాహోభవ వి
శ్వమూర్తే॥

---

శ్రీభగవానువాచ.

౪౭. మయాప్రసన్నేనతవార్జునేదం రూపంపరందర్శితమా
త్మయోగాత్।
తేజోమయంవిశ్వమనంతమాద్యం యన్మేత్వదన్యేన
నదృష్టపూర్వమ్॥

౪౬. అనేక భుజములుగలిగి, విశ్వరూప ధరుడవైన స్వామీ, కిరీటము, గద, చక్రముధరించిన నీ సహజరూపమును, దర్శనము చేయుటకు, చాలా కోరియున్నాను. గనుక, నీవు దయచేసి, నీ సహజమైన చతుర్భుజ రూపమును చూపుము.

---

శ్రీకృష్ణుల వాక్యము.

౪౭. ఓయి అర్జున, నీయందు దయచేసి, నాయోగసామర్థ్యమువల్ల, తుదమొదలు లేనిదియు, అనాదియు, తేజోమయమైనట్టిదియు, నీకంటె నితరులచేత నింతకు మునుపు చూడబడనిదియు, పరమోత్కృష్టమైనదియు నైన, నా విశ్వరూపమును నీకు చూపితిని.

౪౮. నవేదయజ్ఞాధ్యయనైర్నదానైర్నచక్రియాభిర్నత
పోభిరుగ్రైః।
ఏవంరూపశ్శక్యఅహంనృలోకే ద్రష్టుంత్వదన్యేన కు
రుప్రవీర॥

౪౯. మాతేవ్యథామాచ విమూఢభావో దృష్ట్వారూపం
ఘోరమీదృఙ్మమేదమ్।
వ్యపేతభీఃప్రీతమనాఃపునస్త్వం తదేవమేరూపమిదం

---

సంజయ ఉవాచ.

౫౦. ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా స్వకంరూపందర్శ
యామాసభూయః।
ఆశ్వాసయామాసచభీతమేనం భూత్వాపునస్సౌమ్యవ
పుర్మహాత్మా॥

---

౪౮. ఓయి అర్జున, ఈమహత్తైన విశ్వరూపమును, మర్త్యలోకమునందు, నీకు ఒక్కనికే, దర్శనము ఇచ్చితిని, మరి ఒకరు, ఎంత వేదయజ్ఞాధ్యయనములు చేసినవారైనా, ఎంతదానములు జేసినవారలైనా, ఎంత కర్మనిష్ఠులైనా, ఎంత ఉగ్రమైన తపస్సుగలవారైనా, వారికి, దర్శనము ఇచ్చువాడనుకాను.

౪౯. భయంకరమైన నావిశ్వరూపమును చూచినందున, నీకు గలిగిన భయమును, చిత్తవిభ్రాంతిని, వదలుము, నీవు, నిర్భీతుడవై, సంతుష్టమనస్కుడవై, నా సహజమైన రూపమును, చూడుము.

---

సంజయుని వాక్యము.

౫౦. ఓయి ధృతరాష్ట్ర మహారాజ, శ్రీకృష్ణులు, అర్జునునిచూచి, ఈప్రకారము పలికినవాడై, తనసహజరూపమునుచూపి, భయపడియున్న అర్జునుని, ఊరడించెను.

---

అర్జున ఉవాచ.

౫౧. దృష్ట్వేదం మానుషం రూపం తవసౌమ్యంజనార్దన
ఇదానీమస్మిసంవృత్త స్సచేతాఃప్రకృతింగతః॥

---

శ్రీభగవా౯ ఉవాచ.

౫౨. సుదుర్దర్శమిదంరూపం దృష్టవానసియన్మమ।
దేవాఅప్యస్యరూపస్య నిత్యందర్శనకాంక్షిణః॥

౫౩. నాహంవేదై ర్నతపసా నదానేన న చేజ్యయా।
శక్యఏవంవిధోద్రష్టుం దృష్టవానసిమాంయథా॥

౫౪. భక్త్యాత్వనన్యయాశక్య అహమేవంవిధోర్జున।
జ్ఞాతుంద్రష్టుంచతత్త్వేన ప్రవేష్టుంచపరంతప॥

అర్జున వాక్యము.

౫౧. ఓ జనార్దన, ఇప్పుడు, సౌమ్యమైన నీమానుష రూపమునుచూచి. నాకుబుద్ధిస్థిరమైనది, నేను, మనుష్యుల లో కలిసినవాడను, అయితిని.

---

శ్రీకృష్ణుల వాక్యము.

౫౨. నీకు దర్శనమిచ్చిన నాస్వరూపము, అధికదుర్లభ మైనది, ఇట్టి విశ్వరూపమును దర్శించుటకు, దేవతలందరు, సదాకోరుచున్నారు.

౫౩. నీకు 'దర్శనమిచ్చిన విశ్వరూపము, వేదములుచది వినవార్లకుగాని, తపస్సుచేసినవార్లకుగాని, యజ్ఞములు జేసినవార్లకుగాని, లభింపదు.

౫౪. శత్రుతాపనుడవైన ఓయి అర్జున, విశ్వరూప ధరుడనైన నన్ను, ఇతరాశక్తిలేని అచంచల భక్తిచేత మాత్రమే, తెలిసికొనవచ్చును, చూడవచ్చును, పొందవ చ్చును. ఇతరసాధనములులేవు.

౫౫. మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః।
నిర్వైరస్సర్వభూతేషు యస్సమామేతిపాండవ॥

---

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
వి శ్వ రూ ప సం ద ర్శ న
యోగోనామ
ఏకాదశో ధ్యాయః

---

౫౫. ఓయి అర్జున, ఎవ్వడైతే, నాకొరకు సత్కర్మలుజేసి, నేనే ఉత్కృష్టగతియని నమ్మి, నన్నే సర్వప్రకారములచేత పూజించి, ధన, బంధు, పుత్ర, మిత్ర, కళత్రాది సంగమములయందు ఆసక్తివిడిచి, సర్వప్రాణికోట్లయందు నైషమ్యములేక, ఉండుచున్నాడో, అట్టివాడు, నన్ను పొందుచున్నాడు.



ఇట్లని ఉపనిషద్రూపమైనట్టియు, పరబ్రహ్మవిద్యయైనట్టి
భగవద్గీతలనెడు శ్రీకృష్ణార్జున సంవాదరూపమైన
యోగశాస్త్రమునందు విశ్వరూప
సందర్శనయోగమను
పదునొకండవ అధ్యాయము ముగిసెను.



# భక్తియోగః.

---

అర్జున ఉవాచ.

౧. ఏవంసతతయుక్తాయే భక్తాస్త్వాంపర్యుపాసతే।
యేచాప్యక్షరమవ్యక్తం తేషాంకేయోగవిత్తమాః॥

---

శ్రీభగవాన్ ఉవాచ.

౨. మయ్యావేశ్య మనోయేమాం నిత్యయుక్తా ఉపా
సతే।
శ్రద్ధయాపరయోపేతా స్తేమే యుక్తతమామతాః॥

# భక్తి యోగము.

---

అర్జున వాక్యము.

౧. ఓయి కృష్ణ. పైనచెప్పిన ప్రకారము, భగవత్ప్రీతిగా నిరంతరము కర్మలుజేయుచు, నిన్ను సదాధ్యానముచేయువారలలోను, ఇంద్రియములకు గోచరముగా నటువంటి, పరబ్రహ్మను సంధానము జేయువారలలోను యోగిశ్రేష్ఠులు ఎవ్వరు.

శ్రీకృష్ణుల వాక్యము.

౨. ఎవ్వరైతే, నాయందు మనస్సునిలిపి, నిరంతర సమాహిత చిత్తులై, పరమశ్రద్ధతో గూడుకొని, నన్ను ధ్యానము జేయుచున్నారో, అట్టి యుత్తమపురుషులు, నాకు సమ్మతియైనవారు.

౩. యేత్వక్షరమనిర్దేశ్య మవ్యక్తంపర్యుపాసతే।
సర్వత్రగమచింత్యంచ కూటస్థమచలంధ్రువమ్॥
౪. సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్రసమబుద్ధయః।
తేప్రాప్నువంతిమామేవ సర్వభూతహితేరతాః॥

౫. క్లేశోఽధికతరస్తేషా మవ్యక్తాసక్తచేతసామ్।
అవ్యక్తాహిగతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే॥

౬. యేతుసర్వాణికర్మాణి మయిసన్న్యస్యమత్పరాః।
అనన్యేనైవయోగేన మాంధ్యాయంతఉపాసతే॥
౭. తేషామహంసముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్॥
భవామినచిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్॥

3, ౪. ఎవ్వరైతే సమస్తకాలములయందు. ఇంద్రియ నిగ్రహముగలిగి, సమబుద్ధితో, సమస్తప్రాణికోట్లహితము నందు ఆసక్తిగలిగి, నాశరహితమైనట్టియు, నిర్దేశింపగూడనట్టియు, రూపరహితమైనట్టియు, అంతట వ్యాపించియున్నట్టియు, ధ్యానించ కూడనట్టియు, ప్రకృతియందున్నట్టియు, చలించనట్టియు, శాశ్వతమైనట్టి పరబ్రహ్మమును ఉపాసనజేయుచున్నారో, వారు, నన్నే పొందుచున్నారు.

౫. అట్టి పరబ్రహ్మమునందు ఆసక్తమైన చిత్తముగల వార్లకు, అధికతరమైన కష్టముకలుగును. దేహాభిమానముగల పురుషులకు, అధికకష్టములు గలుగకనే, పరబ్రహ్మనిష్ఠసిద్ధింపదు.

౬, ౭. ఓయి పార్థ ఎవ్వరైతే, నన్నే సర్వోత్కృష్టగతిగా దలచి, సమస్తకర్మలను నాకు సమర్పణముజేసి, నన్నే తమ బుద్ధియందునిలిపి, ధ్యానముజేయుచున్నారో, అట్టి చిత్తవృత్తిగలిగినవారలను, అతిశీఘ్రముగా, మృత్యురూపమైన సంసారసాగరమును, దాటించువాడనుగా నున్నాను.

౮. మయ్యేవమన ఆధత్స్వ మయిబుద్ధింనివేశయ।
నివసిష్యసిమయ్యేవ అతఊర్ధ్వంనసంశయః॥

౯. అథచిత్తంసమాధాతుం నశక్నోషిమయిస్థిరమ్।
అభ్యాసయోగేనతతో మామిచ్ఛాప్తుంధనంజయ॥

౧౦. అభ్యాసేప్యసమర్థోసి మత్కర్మపరమోభవ।
మదర్థమపికర్మాణి కుర్వన్సిద్ధిమవాప్స్యసి॥

౧౧. అథైతదప్యశక్తోసి కర్తుంమద్యోగమాశ్రితః
సర్వకర్మఫలత్యాగం తతఃకురుయతాత్మవాన్।

౮. నీమనస్సును, బుద్ధిని, నాయందే ఊర్జితముగా నిలుపుము. అట్లుచేసితివేని, ఈదేహము నశించినపిమ్మట, నిస్సందేహముగా, నన్నే పొందుచున్నావు.

౯. ఓయి ధనంజయ, పైనచెప్పినరీతిగా, నీమనస్సును, బుద్ధిని, నాయందు దృఢముగా నిలుపుటకు, అశక్తుడవైతివేని, నన్ను పొందవలెననే, కోరికగలిగి, మెల్లమెల్లగా, అభ్యాసము జేయుము.

౧౦. అట్లు అభ్యాసముజేయుటకుగూడా, నీకు సామర్థ్యము లేకపోయినట్లాయనా, నావిషయమయ్యే, సమస్తకర్మలుజేయుము, అట్లు, నాప్రీత్యర్థము సత్కార్మ చేసితివేని, నీకు, మోక్షము గలుగును.

౧౧. అందుకున్నూ నీవు అశక్తుడ వైనట్లాయనా, నన్నే ఆశ్రయించి, స్థిరచిత్తము గలవాడవై, నాయందు భారమువేసి, నీవుచేయు కర్మఫలమును, నాకు, అర్పణము చేయుము.

౧౨. శ్రేయోహిజ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానంవిశిష్యతే।
ధ్యానాత్కర్మఫలత్యాగస్త్యాగాచ్ఛాంతిరనంతరమ్॥

౧౩. అద్వేష్టాసర్వభూతానాం మైత్రఃకరుణఏవచ।
నిర్మమోనిరహంకార స్సమదుఃఖసుఖఃక్షమీ॥

౧౪. సంతుష్టస్సతతంయోగీ యతాత్మాదృఢనిశ్చయః।
మయ్యర్పితమనోబుద్ధి ర్యోమద్భక్తస్సమేప్రియః॥

౧౫. యస్మాన్నోద్విజతేలోకో లోకాన్నోద్విజతేచయః।
హర్షామర్షభయోద్వేగై ర్ముక్తోయస్సచమేప్రియః॥

౧౨. అభ్యాస యోగమునకంటే, జ్ఞానము శ్రేష్ఠము. జ్ఞానమునకంటే, ధ్యానము శ్రేష్ఠము. ధ్యానమునకంటే, కర్మఫలత్యాగము శ్రేష్ఠము. అట్టి కర్మఫలత్యాగమువల్ల, మోక్షము ప్రాప్తమగుచున్నది.

౧౩,౧౪. సమస్తభూతములయందు ద్వేషము లేనివాడు, సమస్తప్రాణులకుమిత్రుడు, దయగలవాడు, మమకార అహంకారములు లేనివాడు, సుఖదుఃఖములను సమానముగా చూచువాడు, ఓర్పుగలవాడు, నిత్యసంతోషి, ధ్యానపరుడు, అచంచల మనోవృత్తి గలవాడు, సంశయము లేనివాడు, నాయందు మనోబుద్ధులను ఉంచిన నాభక్తుడు, ఎవ్వడో, వాడు, నాకు ఆప్తుడు.

౧౫. ఎవ్వనివల్ల సర్వజనులకును, సర్వజనులవల్ల ఎవ్వనికిని, భయము లేకపోయి, సంతోషమునకును, భయమునకును, అసూయకును, అతీతుడై యుండునో, అట్టివాడు నాకు పరమ ఆప్తుడు.

౧౬. అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనోగతవ్యథః।
సర్వారంభపరిత్యాగీ యోమద్భక్తస్సమేప్రియః॥

౧౭. యోనహృష్యతినద్వేష్టి నశోచతినకాంక్షతి।
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్యస్సమేప్రియః॥

౧౮. సమశ్శత్రౌచమిత్రేచ తథామానావమానయోః।
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః॥

౧౯. తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టోయేనకేనచిత్।
అనికేతస్స్థిరమతి ర్భక్తిమాన్మేప్రియోనరః॥

౧౬. ఎవ్వడైతే, కోరికలులేక, పవిత్రుడై, సామర్థ్యముగలిగి, పక్షపాతములేక, నిర్భయుడై, కర్మఫలములు గోరక, నాకు భక్తుడుగా నుండునో, అట్టివాడు, నాకు పరమ ఆప్తుడు.

౧౭. ఎవ్వడైతే, సంతోషమునకున్ను, ద్వేషమునకున్ను, దుఃఖమునకున్ను, ఆశకున్ను, శుభాశుభములకున్ను, అతీతుడై, నాయందు భక్తిచేయుచున్నాడో అట్టివాడు, నాకు, పరమ ఆప్తుడు.

౧౮, ౧౯. ఎవ్వడైతే, శత్రుమిత్రులయందున్ను, మానావమానములయందున్ను, శీతోష్ణములయాదున్ను, సుఖదుఃఖములయందున్ను, సమానుడై, సంగరహితుడై నిందాస్తుతులయందు సమానుడై, మౌనముధరించినవాడై, యదృచ్ఛాలాభ సంతుష్టుడై, నివాసరహితుడై, నిశ్చయబుద్ధిగలవాడై, నాయందు భక్తిచేయుచున్నాడో అట్టివాడు, నాకు, పరమ ఆప్తుడు.

౨౦. యేతుధర్మ్యామృతమిదం యథోక్తంపర్యుపాసతే।
శ్రద్ధధానామత్పరమా భక్తాస్తేతీవమేప్రియాః॥

---

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
భక్తియోగోనామ
ద్వాదశోధ్యాయః.

౨౦. ఎవ్వరైతే, నేనే వార్లకు పరమగతియనినమ్మి మోక్షప్రదమైన ఈ అమృతవాక్యములను విశ్వసించి, నేను చెప్పినప్రకారము, శ్రద్ధతో నడుచుకొనుచున్నారో, అట్టి నాభక్తులు, అందరికంటే, నాకు, పరమ ఆప్తులు.



ఇట్లని ఉపనిషద్రూపమైనట్టియు పరబ్రహ్మవిద్య యైనట్టి
భగవద్గీతలనెడు శ్రీకృష్ణార్జునసంవాదరూపమైన
యోగశాస్త్రమునందు భక్తియోగమను
పదిరెండవ అధ్యాయము ముగిసెను.



## క్షే త్ర క్షే త్ర జ్ఞ వి భా గ యో గః.

---

అర్జున ఉవాచ.

౧. ప్రకృతింపురుషంచైవ క్షేత్రంక్షేత్రజ్ఞమేవచ।
ఏతద్వేదితుమిచ్ఛామి జ్ఞానంజ్ఞేయంచకేశవ॥

---

శ్రీభగవాన్ ఉవాచ,

౨. ఇదంశరీరంకౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే।
ఏతద్యోవేత్తితంప్రాహుః క్షేత్రజ్ఞఇతితద్విదః॥

3. క్షేత్రజ్ఞంచాపిమాంవిద్ధి సర్వక్షేత్రేషుభారత।
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానంయత్తత్ జ్ఞానంమతంమమ॥

## క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము.

---

అర్జునవాక్యము.

౧. ఓ కేశవ. ప్రకృతియనగా నేది, పురుషుడనగా నెవ్వడు, క్షేత్రమనగా నెట్టిది, క్షేత్రజ్ఞుడనగా నెవ్వడు, జ్ఞానమనగా నేమి, జ్ఞేయమనగా నేమి, ఇవి సమస్తము. చక్కగా తెలియనిచ్ఛయించి యున్నాను.

---

శ్రీకృష్ణుల వాక్యము.

౨. ఓయి కౌంతేయ, దేహము క్షేత్రమనియు, దేహమును తెలిసికొనువాడు క్షేత్రజ్ఞడనియు, పెద్దలు చెప్పుదురు.

౩. ఓయి అర్జున, సర్వక్షేత్రములయందుండు క్షేత్రజ్ఞుడు, నేనేయని తెలిసికొనుము. ఈ క్షేత్రమునున్ను, తదంతర్గతమైన క్షేత్రజ్ఞునిన్ని, విభజించి తెలియుట ఎద్ది యో, అదియే, జ్ఞానమని చెప్పబడుచున్నది.

౪. తత్ క్షేత్రంయచ్చయాదృక్చ యద్వికారియతశ్చ
యత్।
సచయోయత్ప్రభావశ్చ తత్సమాసేనమేశృణు॥

౫. ఋషిభిర్బహుధాగీతం ఛందోభిర్వివిధై పృథక్।
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః॥

౬. మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవచ।
ఇంద్రియాణిదశైకంచ పంచచేంద్రియగోచరాః॥

౪. ఆ క్షేత్రము ఏదియో, దానిస్వభావము ఎట్టిదో, దానివికారములు ఎవ్వియో, ఏకారణమువల్ల అది ఉత్పత్తియైనదో, వాటినిన్ని, క్షేత్రజ్ఞునిన్ని, వానిస్వభావమునున్ను, సంక్షేపముగా జెప్పుచున్నాను వినుము.

౫. ఈ క్షేత్రక్షేత్రజ్ఞుల స్వరూపనిర్ణయములు, మహర్షులవల్లను, వేదములవల్లను, అనేకవిధములుగా జెప్పంబడియున్నవి. ఇంతయే కాదు, సందేహమునకు ఆస్పదములేని బ్రహ్మసూత్రములవల్లనున్ను, ఎరుంగింపబడియున్నవి.

౬. పంచభూతములైన పృథ్వి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశమున్ను, అహంకారము, బుద్ధి, మాయయున్ను, జ్ఞానేంద్రియములైన త్వక్కు, చక్షు, శ్రోత్ర, జిహ్వ, ఘ్రాణములున్ను, కర్మేంద్రియములైన వాక్కు, పాద, పాణి, పాయు, ఉపస్థలున్ను, మనస్సున్ను, ఇంద్రియగోచరంబులగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములైన పంచతన్మాత్రలున్ను, అంతుచేరి ఇరువదినాలుగు తత్వములాయెను.

౭. ఇచ్ఛా ద్వేషస్సుఖందుఃఖం సంఘాత శ్చేతనాధృతిః।
ఏతత్క్షేత్రంసమాసేన సవికారముదాహృతమ్॥

౮. అమానిత్వమదంభిత్వ మహింసాక్షాంతిరార్జవమ్।
ఆచార్యోపాసనంశౌచం స్థైర్యమాత్మవినిగ్రహః॥

౯. ఇంద్రియార్థేషువై రాగ్య మనహంకారఏవచ।
జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్॥

౧౦. అస క్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు।
నిత్యంచసమచి త్తత్వ మిష్టానిష్టోపప త్తిషు॥

౭. కోరిక, ద్వేషము, సుఖము, దుఃఖము, దేహేంద్రియాది సమూహము, మనోవృత్తి, ధైర్యము, అనేవికారములతో గూడిన ఇరువదినాలుగు తత్వములు, క్షేత్రమని సంగ్రహముగా జెప్పబడినది.

౮. తన్ను తాను పొగడుకొనక యుండుట, తనధర్మము తాను ప్రకాశము జేసికొనక యుండుట, హింసచేయక యుండుట, క్షమ, కృత్రిమము లేకబోవుట, గురుసేవ, బాహ్యాభ్యంతరశుద్ధి, అచంచలము, మనోనిగ్రహము గలుగుట.

౯. ఇంద్రియ విషయములయందు ఆశలేకయుండుట, అహంకారము లేకయుండుట, జన్మము, మరణము, ముసలితనము, రోగము, దుఃఖము, వీట్లయందుగల దోషములను ఆలోచించి తెలిసికొనుట.

౧౦. విషయములయందు ఆసక్తిలేక యుండుట, పుత్రదారగృహాదులకు గలుగు సుఖదుఃఖములు మొదలగునవి, తనవిగావని ఎంచుట, ఇష్టానిష్టప్రాప్తులయందు, సర్వదాసమచిత్తత్వము గలిగియుండుట.

౧౧. మయిచానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ।
వివిక్తదేశసేవిత్వ మరతిర్జనసంసది॥

౧౨. అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్।
ఏతత్ జ్ఞానమితిప్రోక్త మజ్ఞానంయదతో౽న్యథా॥

౧౩. జ్ఞేయంయత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వామృతమశ్ను
తే।
అనాదిమత్పరంబ్రహ్మ నసత్తన్నాసదుచ్యతే॥

౧౪. సర్వతఃపాణిపాదం తత్సర్వతో౽క్షిశిరోముఖమ్।
సర్వతఃశ్రుతిమల్లోకే సర్వమావృత్యతిష్ఠతి॥

౧౧. ఇతర దేవతారాధనలయందు మనస్సుచలించక, నేనేగతియని నమ్మి, నాయందు దృఢమైన భక్తిచేయుట, విజనస్థలవాసియగుట, జనసమూహమునందు అనురాగము లేకయుండుట.

౧౨. ఆత్మజ్ఞానమునందు నిత్యభావము గలుగుట, మోక్షప్రాప్తియందే ప్రయోజన దృష్టియుంచుట, ఇవి అన్నియు. జ్ఞానమని, పెద్దలుజెప్పుదురు. వీటికి ఇతరములన్నియు, అజ్ఞానమని చెప్పబడును.

౧౩. ఇకను, తెలిసికొనదగిన వస్తువు ఏదియో, దానిని చెప్పుచున్నాను. దానిని తెలిసినట్లాయనా, మోక్షప్రాప్తికలుగును. దానినే బ్రహ్మమని చెప్పుచున్నారు, ఆ బ్రహ్మము, ఆదిలేనిది, పరమోత్కృష్టమైనది, వేదవిహితమగుటచే, సత్తైన ఘటపటాదులకంటెను, అసత్తైన శశశృంగాదులకంటెను, విలక్షణమైనది.

౧౪. ఆ బ్రహ్మము, సర్వదిక్కులయందు, చేతులు, కాళ్లు, నేత్రములు, శిరస్సులు, ముఖములు, చెవులు గలిగినదై, సమస్తప్రపంచమును, వ్యాపించియుండునది.

౧౫. సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితమ్।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ॥

౧౬. బహిరంతశ్చ భూతానామచరం చరమేవ చ।
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్॥

౧౭. అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్।
భూతభర్తృ చ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ॥

౧౫. ఆ బ్రహ్మము, సకలేంద్రియ వ్యాపారములచేత ప్రకాశించు దానివలెనుండియు, ఆసకలేంద్రియ వ్యాపారములకు సంబంధము లేనిది, సమస్తప్రపంచములు ధరించినదయిన్నీ, ఎందుల నంటకయుండునది, త్రిగుణాత్మకము గానిదయిన్నీ, సత్వరజస్తమోగుణములను అనుభవించునట్టిది.

౧౬. ఆ బ్రహ్మము, సమస్త చరాచరములయందు, లోపల, వెలుపల, ఉండునది. మిక్కిలి సూక్ష్మరూపము గలిగినది గనుక, తెలిసికొనుటకు అశక్యమైనది. అజ్ఞానికి దూరముగాను, జ్ఞానికి సమీపముగాను, ఉండునట్టిది.

౧౭. ఆ బ్రహ్మము, అపరిచ్ఛిన్నమయిన్ని, సమస్తజీవకోట్లయందు, పరిచ్ఛిన్నమైనదానివలె, ఉండునట్టిది, సమస్తభూతములను భరించునట్టిది, గ్రహించునట్టిది, మరల ఉత్పత్తిచేయునట్టిది, అని తెలిసికొనుము.

౧౮. జ్యోతిషామపితజ్జ్యోతి స్తమసఃపరముచ్యతే।
జ్ఞానంజ్ఞేయంజ్ఞానగమ్యం హృదిసర్వస్యవిష్ఠితమ్॥

౧౯. ఇతిక్షేత్రంతథాజ్ఞానంజ్ఞేయంచో క్తంసమాసతః।
మద్భక్తఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే॥

౨౦. ప్రకృతింపురుషంచైవ విద్ధ్యనాదీఉభావపి।
వికారాంశ్చగుణాంశ్చైవ విద్ధిప్రకృతిసంభవాన్॥

౨౧. కార్యకారణకర్తృత్వే హేతుఃప్రం
పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురు॥
చ్యతే॥

౧౭. ఆబ్రహ్మము, జ్యోతిస్వరూపులైన సూర్యాదులకు ప్రకాశకమైనదనియు, అజ్ఞానమునకు వ్యతిరిక్తమైనదనియు, తెలియదగినదనియు, జ్ఞానగోచరమైనదనియు, సమస్తప్రాణుల హృదయములయందున్నదనియు, పెద్దలు చెప్పుదురు.

౧౮. ఈప్రకారము, క్షేత్రమును, జ్ఞానమును, జ్ఞేయమును, సంగ్రహముగా నీకు చెప్పితిని, ఈభావమును తెలిసికొనిన నాభక్తుడు, నాస్థానమైన మోక్షమునకు, అర్హుడగుచున్నాడు.

౨౦. ప్రకృతి పురుషులు ఇరువురు, అనాదులని తెలిసికొనుము. మనోబుద్ధులకు గలుగు వికారములున్ను, సత్వరజస్తమోగుణములున్ను, మూలప్రకృతివల్ల గలిగినవిగా తెలిసికొనుము.

౨౧. ప్రకృతికి, మాయయనికూడా, పేరుగలదు. ఆ మాయ, శరీరసుఖదుఃఖాదులను పుట్టించుటకు, కారణమని తెలిసికొనుము, క్షేత్రజ్ఞుడనే పురుషుడు, సుఖదుఃఖములను అనుభవించుట యందు, కారణమని తెలిసి కొనుము.

౨౨. పురుషఃప్రకృతిస్థోహి భుఙ్క్తే ప్రకృతిజాన్గుణాన్।
కారణంగుణసఙ్గోస్య సదసద్యోనిజన్మసు॥

౨౩. ఉపద్రష్టానుమంతాచ భర్తాభోక్తామహేశ్వరః।
పరమాత్మేతిచాప్యుక్తో దేహేస్మిన్పురుషఃపరః॥

౨౪. యఏవంవేత్తిపురుషం ప్రకృతించగుణైస్సహ।
సర్వథావర్తమానోపి నసభూయోభిజాయతే॥

౨౨. క్షేత్రజ్ఞుడను పురుషుడు, క్షేత్రమనే ప్రకృతియందున్నవాడు, ప్రకృతివల్ల పుట్టిన గుణములను, పురుషుడు అనుభవించుచున్నాడు. ఈ పురుషునికి, సుఖదుఃఖరూపములైన గుణముల యందు, ఆసక్తి యుండుటచేత, పుణ్యాపుణ్యరూపములైన యోనులయందు, జన్మములకు కారణమగుచున్నది.

౨౩. ఈ క్షేత్రమనే దేహమునందు, క్షేత్రజ్ఞుడనే పురుషుడు, కార్యకరణ వ్యాపారములయందు ఉపద్రష్టయై అనుమోదించు వాడై, భరించువాడై, అనుభవించువాడై, నియామకుడై, ఉత్కృష్టుడై, పరమాత్మగా నున్నవాడు.

౨౪. ఎవ్వరైతే, క్షేత్రజ్ఞుడైన పురుషునిన్ని, క్షేత్రమను ప్రకృతినిన్ని, పైనచెప్పిన ప్రకారము తెలిసికొనుచున్నారో, అట్టివారు, ఏ స్వభావముతోటి వర్తించినా, వారికి. పునర్జన్మములు లేవు.

౨౪. ధ్యానేనాత్మని పశ్యంతి కేచిదాత్మానమాత్మనా।
అన్యేసాంఖ్యేన యోగేన కర్మయోగేనచాపరే॥

౨౫. అన్యే త్వేవమజానంతః శ్రుత్వాన్యేభ్య ఉపాసతే।
తేపిచాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః॥

౨౬. యావత్సంజాయతేకించి త్సత్వం స్థావరజంగమమ్।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్తద్విద్ధిభరతర్షభ॥

౨౪. కొందరుపురుషులు, ధ్యాననిష్ఠులై, మనస్సు చేత, తమలోనంతర్గతమైన పరమాత్మను, దర్శనముజేయుచున్నారు. మరికొందరు, జ్ఞానయోగముచేతను మరికొందరు, నిష్కామమైన కర్మయోగము చేతను, పరమాత్మను దర్శనముజేయుచున్నారు.

౨౫. మరికొందరు, పరమాత్మను, పైనచెప్పిన మార్గములచేత ఎరుంగనివారై, ఆచార్యులవలన ఉపదేశమునుబొంది, ఉపాసనచేయుచున్నారు. వారున్ను, భక్తిశ్రద్ధలతో వేదాంతశ్రవణము జేయువారుగనుక, పునర్జన్మములు లేనివారగుదురు.

౨౬. ఓయి అర్జున, ప్రపంచమునందు, చరాచరవస్తువులు ఎన్ని మార్లుపుట్టుచున్నవో, అంతపర్యంతము,క్షేత్రక్షేత్రజ్ఞులైన ప్రకృతిపురుషులకు, రజ్జుసర్పభ్రాంతివలె,సంసర్గముగలిగియున్నదని, తెలిసికొనుము.

౨౮. సమంసర్వేషుభూతేషు తిష్ఠంతంపరమేశ్వరమ్।
వినశ్యత్స్వవినశ్యంతం యఃపశ్యతిసపశ్యతి॥

౨౯. సమంపశ్యన్హిసర్వత్ర సమవస్థితమీశ్వరమ్।
నహినస్త్యాత్మనాత్మానం తతో యాతిపరాంగతిమ్॥

30. ప్రకృత్యైవచకర్మాణి క్రియమాణానిసర్వశః।
యఃపశ్యతితదాత్మాన మకర్తారంసపశ్యతి॥

౨౮. మాయారూపకమై, నశించగల ప్రపంచస్వరూపములయందు అంతర్గతమై, సమముగావర్తించు పరమేశ్వరుని, శాశ్వతుడని ఎవ్వరు తెలిసికొనుచున్నారో, అట్టివారే, తెలిసినవారని చెప్పబడుదురు.

౨౯. అట్టిపురుషులు, సమస్తప్రాణులయందు, అంతర్గతమైన పరమాత్మ, ఒక్కటేయని, తెలిసి కొనినవారు గనుక, తమలో నంతర్గతమైన పరమాత్మను, దుఃఖపెట్టరు. అందువలన, వారు, ఉత్కృష్టమైన మోక్షమును, పొందుచున్నారు.

3౦. సకలకర్మలు, ప్రకృతి సంబంధమైన గుణముల వల్ల, చేయబడినవిగా, ఎవ్వడు తెలిసికొను చున్నాడో అతడు, తనలో నంతర్గతమైన క్షేత్రజ్ఞుని, ఉపాధిరహితుని గా, తెలిసికొనినవా డగుచున్నాడు.

3౧. యదాభూతపృథగ్భావ మేకస్థమనుపశ్యతి।
తతఏవచవిస్తారం బ్రహ్మసంపద్యతేతదా॥

3౨. అనాదిత్వాన్నిర్గుణత్వా త్పరమాత్మాయమవ్యయః।
శరీరస్థోపి కౌంతేయ నకరోతినలిప్యతే॥

33. యథాసర్వగతంసౌక్ష్మ్యా దాకాశంనోపలిప్యతే।
సర్వత్రావస్థితోదేహే తథాత్మానోపలిప్యతే॥

3౪. యథాప్రకాశయత్యేకః కృత్స్నంలోకమిమంరవిః।
క్షేత్రంక్షేత్రీతథాకృత్స్నం ప్రకాశయతిభారత॥

3౧. పృథక్ స్వరూపములుగానుండు సమస్త భూతములు, ఆత్మయందున్నవిగానున్ను, ఆ ఒక్క ఆత్మవలననే, ఈ సమస్తప్రపంచములు ఉత్పత్తి అయినవిగా, ఎవ్వడు తెలిసికొనుచున్నాడో, అతడు, పరబ్రహ్మస్వరూపుడగుచున్నాడు.

3౨. ఓయి కౌంతేయ, పరమాత్మ, అనాదియై, నాశరహితుడై, గుణరహితుడైన వాడుగనుక, అట్టి పరమాత్మ, దేహాంతర్గతుడయ్యును, కర్మలు జేయువాడు కాడు, కర్మఫలములను అనుభవించువాడున్ను, కాడు.

33. ఆకాశము, సూక్ష్మరూపముగుటవలన, సర్వవ్యాపియయ్యున్ని, వస్తువులను ఎట్లు అంటదో, ఆప్రకారమే, క్షేత్రజ్ఞుడైన పురుషుడు, క్షేత్రములైన శరీరములయందుండినా, కర్మలకు సంబంధపడినవాడు కాడు.

3౪. ఓయి అర్జున, ఒక్కసూర్యుడు, సమస్తజగత్తులను, ఏప్రకారము ప్రకాశింప చేయుచున్నాడో, ఆరీతిగా, క్షేత్రజ్ఞుడనే పురుషుడు, సమస్తక్షేత్రములనే శరీరములను, ప్రకాశింప చేయుచున్నాడు.

౩౪. క్షేత్రక్షేత్రజ్ఞయో రేవ మంతరం జ్ఞానచక్షుషా।
భూతప్రకృతిమోక్షంచ యేవిదుర్యాంతి తేపరమ్॥

---

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
క్షేత్రక్షేత్రజ్ఞవిభాగ
యోగోనామ
త్రయోదశోఽధ్యాయః.

౩౫. ఎవ్వారైతే, పైనచెప్పినప్రకారము, క్షేత్రక్షేత్రజ్ఞులభేదమునున్ను, భూతములయొక్క ప్రకృతినివృత్త్యుపాయమునున్ను, జ్ఞానదృష్టిచేత తెలిసికొనుచున్నారో, వార్లు, పరబ్రహ్మమును పొందుచున్నారు.



ఇట్లని ఉపనిషద్రూపమైనట్టియు, పరబ్రహ్మవిద్యయైనట్టి
భగవద్గీతలనెడు శ్రీకృష్ణార్జున సంవాదరూపమైన
యోగశాస్త్రమునందు క్షేత్రక్షేత్రజ్ఞ
విభాగయోగమను
పదిమూడవ అధ్యాయము ముగిసెను.



# గుణత్రయవిభాగయోగః.

---

శ్రీభగవాన్ ఉవాచ.

౧. పరంభూయః ప్రవక్ష్యామి జ్ఞానానాంజ్ఞానముత్తమమ్।
యజ్జ్ఞాత్వామునయస్సర్వే పరాంసిద్ధిమితోగతాః॥

౨. ఇదంజ్ఞానముపాశ్రిత్య మమసాధర్మ్యమాగతాః।
సర్గేపినోపజాయంతే ప్రళయేనవ్యథంతిచ॥

3. మమయోనిర్మహద్బ్రహ్మ తస్మిన్గర్భందధామ్యహమ్।
సంభవస్సర్వభూతానాం తతోభవతిభారత॥

# గుణత్రియవిభాగయోగము.

---

శ్రీకృష్ణుల వాక్యము.

౧. జ్ఞానములలో పరమోత్కృష్టమైన జ్ఞానమును, తిరుగానీకై చెప్పుచున్నాను, అట్టిజ్ఞానము గలిగేకదా, సమస్తఋషులు, ఉత్కృష్టమైన మోక్షమును పొందిరి.

౨. ఈజ్ఞానమును పొంది, నాతో సమానులైన వారు, బ్రహ్మసృష్టి కాలములోకూడా, జన్మములుపొందరు. బ్రహ్మప్రళయకాలములోనున్ను, దుఃఖమును పొందరు.

3. ఓయి అర్జున, పరబ్రహ్మమైననాకు, ప్రకృతియనునది, భూత సృష్టి కారణముగా నున్నది. అట్టి ప్రకృతియందు, నాఅంశములు ఉంచినవెనుక, సకలభూతప్రపంచములు, ఉత్పత్తియగుచున్నవి.

౪. సర్వయోనిషుకౌంతేయమూర్తయస్సంభవంతియాః।
తాసాంబ్రహ్మమహద్యోని రహంబీజప్రదఃపితా॥

౫. సత్త్వంరజస్తమఇతి గుణాఃప్రకృతిసంభవాః।
నిబధ్నంతిమహాబాహో దేహేదేహినమవ్యయమ్॥

౬. తత్రసత్త్వంనిర్మలత్వా త్ప్రకాశకమనామయమ్।
సుఖసంగేనబధ్నాతి జ్ఞానసంగేనచానఘ॥

౭. రజోరాగాత్మకంవిద్ధి తృష్ణాసంగముద్భవమ్।
తన్నిబధ్నాతికౌంతేయ కర్మసంగేనదేహినమ్॥

౪. ఓయి కౌంతేయ, లోకములలో ఉద్భవించు సమస్త చరాచర భూతజాలములకు, ప్రకృతి తల్లి వంటిది. పరబ్రహ్మస్వరూపియైననేను, బీజమువేయుతండ్రిని.

౫. ఓయి అర్జున, ప్రకృతివల్లనే, సత్వరజస్తమముల నే మూడు గుణములు, గలిగినవి. ఆ గుణములు, ప్రకృతి సంబంధమైన దేహము నందు, అంతర్గతుడుగా నున్ను, నాశరహితుడుగానున్న ఉండెడువానిని, బద్ధుని చేయుచున్నవి.

౬. ఓయి అర్జున, ఆసత్వరజస్తమో గుణములలో సత్వగుణము స్వచ్ఛమైనది, నిర్మలముగా ప్రకాశించునది ఉపద్రవ రహితమైనది. ఆసత్వగుణము, క్షేత్రజ్ఞుని, సుఖముతోను, జ్ఞానముతోను, చేర్చుచున్నది.

౭. ఓయి కౌంతేయ, రజోగుణము, కోరికల స్వరూపమై, ప్రాప్తమైన విషయముల యందు ప్రీతి గలుగ చేయుచున్నది. ఆగుణము, దేహిని, కర్మాసక్తితో బద్ధుని చేయుచున్నది.

౮. తమస్త్వజ్ఞానజంవిద్ధి మోహనంసర్వదేహినామ్।
ప్రమాదాలస్యనిద్రాభి స్తన్నిబధ్నాతిభారత॥

౯. సత్త్వంసుఖేసంజయతి రజఃకర్మణిభారత।
జ్ఞానమావృత్యతుతమః ప్రమాదేసంజయత్యుత॥

౧౦. రజస్తమశ్చాభిభూయ సత్త్వంభవతిభారత।
రజస్సత్త్వంతమశ్చైవ తమస్సత్త్వంరజస్తథా॥

౧౧. సర్వద్వారేషుదేహేస్మిన్ ప్రకాశఉపజాయతే।
జ్ఞానంయదాతదావిద్యా ద్వివృద్ధంసత్త్వమిత్యుత॥

౮. ఓయి అర్జున, తమోగుణము అజ్ఞానమువల్ల పుట్టి నది. అది సమస్తప్రాణులను మోహింపజేయు చున్నది. ఆ గుణము దేహిని ఆలస్యముతోను, నిద్రతోను, అజాగ్రత తోను, బద్ధుని చేయుచున్నది.

౯. ఓయి అర్జున, సత్వగుణము సుఖమునందు ప్రవ ర్తింపచేయునది, రజోగుణము కర్మయందు ప్రవర్తింప చే యునది, తమోగుణమైతేనో, జ్ఞానమునుమరుగుచేసి, ప్ర మాదకార్యములయందు ప్రవర్తింపచేయునది.

౧౦. ఓయి అర్జున, సత్వగుణమైనది, రజస్తమోగుణ ములను తిరస్కరించిన, అది రూఢిగా నిలుచును. రజోగు ణమైనది, సత్వతమో గుణములను తిరస్కరించిన అది రూఢిగానిలుచును. తమోగుణమైనది, సత్వరజోగుణముల ను తిరస్కరించిన, అది రూఢిగానిలుచును.

౧౧. ఎప్పుడైతే, ఈదేహమునందు, దేహద్వారము లైన జ్ఞానేంద్రియములద్వారా, జ్ఞానస్వరూపమైన ఆత్మా నాత్మ తెలివి పుట్టుచున్నదో, అప్పుడు, సత్వగుణము ప్రబ లమైనదని, తెలిసికొనుము.

౧౨. లోభఃప్రవృత్తిరారంభః కర్మణామశమస్స్పృహా।
రజస్యేతానిజాయంతే వివృద్ధేభరతర్షభ॥

౧౩. అప్రకాశోప్రవృత్తిశ్చ ప్రమాదోమోహఏవచ।
తమస్యేతానిజాయంతే వివృద్ధేకురునందన॥

౧౪. యదాసత్త్వేప్రవృద్ధేతు ప్రళయంయాతిదేహాభృత్।
తదోత్తమవిదాంలోకా నమలాన్ప్రతిపద్యతే॥

౧౫. రజసిప్రళయంగత్వా కర్మసంగిషుజాయతే।
తథాప్రలీనస్తమసి మూఢయోనిషుజాయతే॥

౧౨. ఓయి అర్జున, ఎప్పుడైతే ఈ దేహమునందు, ద్రవ్యాకాంక్షయు, సామాన్య చేష్టయు. కర్మాసక్తియు, ఇంద్రియనిగ్రహము లేకపోవుటయు, ఇచ్ఛయు, కలుగుచున్నవో, అప్పుడు, రజోగుణము ప్రబలమైనదని, తెలిసికొనుము

౧౩. ఓయి అర్జున, ఎప్పుడైతే ఈ దేహమునందు, అవివేకము, జబ్బుతనము, అవకాశము లేక పోవుట, మోహము, కలుగుచున్నవో, అప్పుడు, తమోగుణము ప్రబలమైనదని, తెలిసికొనుము.

౧౪. సత్వగుణము ప్రబలమైన దశలో, మరణము సంభవించెనేని, .అప్పుడు, నిర్మలమైన బ్రహ్మాది లోకములను, పొందుచున్నాడు.

౧౫. రజోగుణము ప్రబలమైన దశలో, మరణము సంభవించెనేని, కర్మాసక్తిగల మర్త్యలోకమునందుపుట్టుచున్నాడు. తమోగుణము ప్రబలమైనదశలో, మరణము సంభవించెనేని, శ్వాన వరాహాది నికృష్టజన్మములను ఎత్తుచున్నాడు.

౧౬. కర్మణస్సుకృతస్యాహు సాత్త్వికంనిర్మలంఫలమ్।
రజసస్తుఫలందుఃఖ మజ్ఞానంతమసఃఫలమ్॥

౧౭. సత్త్వాత్సంజాయతేజ్ఞానం రజసోలోభఏవచ।
ప్రమాదమోహౌతమసో భవతోఽజ్ఞానమేవచ॥

౧౮. ఊర్ధ్వంగచ్ఛంతిసత్త్వస్థా మధ్యేతిష్ఠంతిరాజసాః।
జఘన్యగుణవృత్తిస్థా అధోగచ్ఛంతితామసాః॥

౧౯. నాన్యంగుణేభ్యఃకర్తారం యదాద్రష్టానుపశ్యతి।
గుణేభ్యశ్చపరంవేత్తి మద్భావంసోఽధిగచ్ఛతి॥

౧౬. సత్వ గుణమువలన బుట్టిన కర్మకు, తేజోమయ మైనజ్ఞానము ఫలమనియు, రజోగుణము వలన బుట్టిన కర్మకు, దుఃఖప్రాప్తి ఫలమనియు, తమోగుణమువలన బుట్టిన కర్మకు, అజ్ఞానము ఫలమనియు, పెద్దలు వక్కాణింతురు.

౧౭. సత్వగుణమువల్ల, జ్ఞానముబుట్టుచున్నది, రజోగుణమువల్ల, లోభముబుట్టుచున్నది. తమోగుణమువల్ల ఏమరుపాటు, అజ్ఞానము, బుట్టుచున్నవి.

౧౮. సత్వగుణముగలవారు, దేవాది లోకములను పొందుచున్నారు. రజోగుణము గలవారు, మనుష్యలోకమునందు మానవులుగా పుట్టుచున్నారు. నికృష్టవృత్తియందున్న తమోగుణస్థులు, పశ్వాది జన్మములను నరకములను, పొందుచున్నారు.

౧౯. ఎవ్వడైతే, గుణములే కర్తలనియు, తానుసాక్షిభూతుడనియు, తెలిసికొనుచున్నాడో, అట్టివాడు, నాస్వరూపమును పొందుచున్నాడు.

౨౦. గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్।
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తో౽మృతమశ్నుతే॥

---

అర్జున ఉవాచ.

౨౧. కైర్లింగై స్త్రీన్ గుణానేతా నతీతో౽భవతి ప్రభో।
కిమాచారః కథంచైతాం స్త్రీన్ గుణానతివర్తతే॥

---

శ్రీభగవాన్ ఉవాచ.

౨౨. ప్రకాశంచ ప్రవృత్తించ మోహమేవచ పాండవ।
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి॥

౨०. ఎవ్వడైతే, దేహోత్పత్తికి కారణములైన ఈ సత్వరజస్తమోగుణములను, అతిక్రమించుచున్నాడో అట్టి వాడు, జన్మ, మృత్యు, జర, దుఃఖములచేత విడువబడినవాడై, మోక్షమును పొందుచున్నాడు.

---

అర్జునవాక్యము.

౨౧. ఓయి కృష్ణ, ఈ సత్వరజస్తమో గుణములను అతిక్రమించిన వానికి, ఏమి చిహ్నములు ఉండును, వాడు ఎట్టి ఆచారములు గలవాడు, ఈమూడు గుణములనుఅతిక్రమించుటకు, మార్గము ఎద్ది.

---

శ్రీకృష్ణుల వాక్యము.

౨౨. ఓయి అర్జున, త్రిగుణాతీతుడు, ప్రకృతివలన బుట్టిన సత్వగుణ సంప్రాప్తమైన జ్ఞాననిష్ఠ గలిగినప్పటికిని, రజోగుణ సంప్రాప్తమైన లోభకార్యము సంభవించినా, తమోగుణ సంప్రాప్తమైన అజ్ఞానకార్యము జరిగినా, ద్వేషింపడు. ఆయాకార్యములు, ఆయాగుణములయందు అణిగి నివృత్తియైనప్పుడు, వాటిని కోరడు.

౨౩. ఉదాసీనవదాసీనో గుణైర్యోనవిచాల్యతే।
గుణావర్తంతఇత్యేవ యోవతిష్ఠతినేంగతే॥

౨౪. సమదుఃఖసుఖస్స్వస్థ స్సమలోష్టాశ్మకాంచనః।
తుల్యప్రియాప్రియోధీర స్తుల్యనిందాత్మసంస్తుతిః॥

౨౫. మానావమానయోస్తుల్యస్తుల్యోమిత్రారిపక్షయో
సర్వారంభపరిత్యాగీ గుణాతీతస్సఉచ్యతే॥

౨౩. త్రిగుణాతీతుడు, గుణములయందును, గుణకార్యములయందును, లక్ష్యము లేనివాడై, ఉదాసీనుడుగా నుండును, జరిగే సమస్తకార్యములు, త్రిగుణ వ్యాపారములని తెలిసికొని, తాను చలించక యుండును.

౨౪. త్రిగుణాతీతుడు, సుఖదుఃఖములను సమానముగా చూచును, ఆత్మావలోకనము చేయును, మృత్పిండమును, పాషాణమును, బంగారమును, సమముగా చూచును, ప్రియాప్రియములయందు సమదృష్టి యుంచును, ధైర్యము గలవాడగును, నిందాస్తుతులయందు సమమైనవాడుగా నుండును.

౨౫. త్రిగుణాతీతుడు, మానావమానముల యందు సమదృష్టి గలవాడగును, శత్రుమిత్రులయందు సమమైన మనస్సుగల వాడగును, సకలోద్యోగ పరిత్యాగిగానుండును, ఇట్లుండువాడే, త్రిగుణాతీతుడని చెప్పబడును.

౨౬. మాంచయోవ్యభిచారేణ భక్తియోగేనసేవతే।
సగుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయకల్పతే॥

౨౭. బ్రహ్మణోహిప్రతిష్ఠాహ మమృతస్యావ్యయస్యచ।
శాశ్వతస్యచధర్మస్య సుఖస్యైకాంతికస్యచ॥

---

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే
గుణత్రయవిభాగయోగోనామ
చతుర్దశోధ్యాయః.

---

౨౬. ఎవ్వడైతే, నన్ను, అచంచల భక్తియోగము చేత సేవించుచున్నాడో, వాడు, త్రిగుణాతీతుడై, బ్రహ్మ భావముకొరకు, సమర్థుడగుచున్నాడు.

౨౭. పరమాత్మయొక్క విగ్రహ రూపమున్ను, శాశ్వతమైన మోక్షమునకు ఆశ్రయమున్ను, నిత్యమైన ధర్మమునకు మూలస్థానమున్ను, మోక్షసుఖమునకు ఆశ్రయమున్ను, నేనేయని, తెలిసికొనుము.

---

ఇట్లని ఉపనిషదర్థరూపమైనట్టియు, పరబ్రహ్మవిద్యయైనట్టి భగవద్గీతలనెడు శ్రీకృష్ణార్జున సంవాదరూపమైన యోగశాస్త్రమునందు గుణత్రయ విభాగయోగమను

పదినాల్గవ అధ్యాయము ముగిసెను.

---

## పురుషోత్తమప్రాప్తియోగః.

---

శ్రీభగవాన్ ఉవాచ.

౧. ఊర్ధ్వమూలమధశ్శాఖ మశ్వత్థంప్రాహురవ్యయమ్
ఛందాంసియస్యపర్ణాని య స్తంవేదసవేదవిత్॥

౨. అధశ్చోర్ధ్వంచప్రసృతా స్తస్యశాఖా గుణప్రవృ
విషయప్రవాళాః।
అధశ్చమూలాన్యనుసంతతాని కర్మానుబంధీనిమను
లోకే॥

## పురుషోత్తమప్రాప్తియోగము.

---

శ్రీకృష్ణుల వాక్యము.

౧. ఉత్కృష్టమైన మాయాశబళిత బ్రహ్మమే మొదటివేరుగా, నికృష్టమైన మహదహంకారములు కొమ్మలుగా, గల అశ్వత్థమనే సంసార వృక్షము, అనాదియని, పెద్దలు చెప్పుదురు. అట్టి వృక్షమునకు, వేదములు ఆకులవంటివి, అట్టివృక్షస్వరూపమును ఎవ్వడు తెలిసికొనునో, వాడు, వేదార్థములు తెలిసినవాడగును.

౨ అట్టి సంసార వృక్షమునకు, అవ్యక్తాదులనే కొమ్మలు, త్రిగుణములచేత పోషింపబడి, ఊర్ధ్వముఖముగాను, అధోముఖముగాను, వ్యాపించి యున్నవి. ఆకొమ్మలకు, మనుష్యలోకమునందు, కర్మ ఫలములవల్ల బుట్టిన రాగద్వేషాదులు, క్రిందివేళ్లుగాను, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు, చిగుళ్లుగాను ఉన్నవి.

౩. నరూపమస్యే హతథోపలభ్య తేనాంతో నచాదిర్న చ
సంప్రతిష్ఠా।
అశ్వత్థమేనం సువిరూఢమూల మసంగశస్త్రేణ దృఢే
నఛిత్వా॥

౪. తతఃపదం తత్పరిమార్గితవ్యం యస్మిన్గతాన సివర్తంతి
భూయః।
తమేవచాద్యంపురుషంప్రపద్యే యతఃప్రవృత్తిఃప్రసృ
తాపురాణీ॥

౫. నిర్మానమోహా జితసంగదోషా అధ్యాత్మనిత్యావినివృ
త్తకామాః।
ద్వంద్వైర్విముక్తాస్సుఖదుఃఖసంజ్ఞై ర్గచ్ఛంత్యమూఢాః
పదమవ్యయంతత్॥

౩. ఈసంసార వృక్షముయొక్క స్వరూపము, తెలిసి కొనబడ జాలదు. దాని ఆద్యంతములుగాని, స్థితిగాని, దెలియ శక్యముగాదు, బహు దృఢమైన వేర్లుగల ఈ సంసార వృక్షమును, విరక్తియనే ఆయుధముచేత, తెగ గొట్టవలయును.

౪. అట్లు తెగగొట్టినవెనుక, ఏ పరమాత్మవల్ల అనాదియైన సంసార ప్రవృత్తిగలిగెనో, ఏపరమాత్మను పొందినవారికి మరల జన్మములు లేవో, అట్టి పరమాత్మనే, శరణు పొందుచున్నానని, ప్రయత్నము చేయవలయును.

౫. జ్ఞానులు, మానమోహములు వదలి, దారాపత్యాదుల సాంగత్యములువిడిచి, అధ్యాత్మజ్ఞాన విద్యాసక్తులై, కామక్రోధాదులు మాని, శీతోష్ణాది రూపములైన ద్వంద్వములయందు సమానులై, నాశరహితమైన మోక్షమును పొందుచున్నారు.

౬. నతద్భాసయతేసూర్యో నశశాంకోనపావకః।
యద్గత్వాననివర్తంతే తద్ధామపరమంమమ॥

౭. మమైవాంశోజీవలోకే జీవభూతస్సనాతనః।
మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థానికర్షతి॥

౮. శరీరంయదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః।
గృహీత్వైతానిసంయాతి వాయుర్గంధాని వాశ
యాత్॥

౯. శ్రోత్రంచక్షుఃస్పర్శనంచ రసనంఘ్రాణమేవచ।
అధిష్ఠాయమనశ్చాయం విషయానుపసేవతే॥

౬. అట్టి అవ్యయపదమును, సూర్యుడేమి, చంద్రుడేమి, అగ్నిహోత్రుడేమి, ప్రకాశింప చేయచాలరు, ఏ అవ్యయపదమును పొందినవెనుక, మరు జన్మములు లేవో, అట్టిపరమోత్కృష్టమైన పదమే, నాస్థానమని తెలిసికొనుము.

౭. మరియు, అనాదియైన నాయంశమే, లోకమునందు, జీవస్వరూపమై యున్నది. ప్రకృతి సంబంధమై, మనస్సుతోగూడిన జ్ఞానేంద్రియములు, ఆజీవుని, విషయములయందు ఆకర్షించుచున్నవి.

౮. జీవుడు, దేహములయందు ప్రవేశించునప్పుడును, దేహములను విడుచునప్పుడును, వాయువు పుష్పవాసనలు తీసికొనిపోవు చందంబున, ఇంద్రియములనున్ను, వాటితోగూడిన మనస్సునున్ను, తీసికొని పోవుచున్నాడు.

౯. ఈజీవుడు, జ్ఞానేంద్రియములైన త్వక్, చక్షు, శ్రోత్ర, రసన, ఘ్రాణేంద్రియములనున్ను, మనస్సునున్ను అంటి, ఇంద్రియ విషయములైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను, అనుభవించుచున్నాడు.

౧౦. ఉత్క్రామంతం స్థితంవాపి భుంజానంవా గుణాన్వి
తమ్।
విమూఢానానుపశ్యంతి పశ్యంతిజ్ఞానచక్షుషః॥

౧౧. యతంతో యోగినశ్చైనం పశ్యంత్యాత్మన్యవస్థి
తమ్।
యతంతోప్యకృతాత్మానో నైనంపశ్యంత్యచేతసః॥

౧౨. యదాదిత్యగతంతేజో జగద్భాసయతేఖిలమ్।
యచ్చంద్రమసియచ్చాగ్నౌ తత్తేజోవిద్ధిమామకమ్॥

౧౩. గామావిశ్యచభూతాని ధారయామ్యహమోజసా।
పుష్ణామిచౌషధీస్సర్వాః సోమోభూత్వారసాత్మకః॥

౧౦. జ్ఞానశూన్యులైన మూఢులు, ఈజీవుని, దేహము విడిచిపోవు నప్పుడేమి, దేహమునందు వసించియుండు నప్పుడేమి, ఇంద్రియ విషయములను అనుభవించు నప్పుడేమి, గుణయుక్తుడుగా నుండునప్పుడేమి, తెలిసికొనచాలరు. జ్ఞానదృష్టిగలవారు, ఇవి అన్నిటిని, చక్కగా చూచుచున్నారు.

౧౧. యోగులు, తగినప్రయత్నములు జేయువారై, దేహాంతర్గతమైన ఆత్మస్వరూప జీవుని, తెలిసికొనుచున్నారు. ఆత్మజ్ఞానములేని అవివేకులు, ప్రయత్నములుజేసియు, ఆత్మను చూడజాలరు.

౧౨. సూర్యుని యందు, చంద్రునియందు, అగ్నియందు, ఏ తేజస్సు అంతర్గతమై, సమస్తజగత్తులను ప్రకాశింపచేయుచున్నదో, అట్టి తేజస్సు, నా సంబంధమైన తేజస్సని తెలిసికొనుము.

౧౩. నేను, భూమియందు ప్రవేశించి, నాబలముచేత, జీవకోట్లనన్నిటిని మోసికొని యున్నాను, నేనే, రస స్వరూపుడైన చంద్రుడనై, సమస్త ఓషధులను పోషించుచున్నాను.

౧౪. అహం వైశ్వానరోభూత్వా ప్రాణినాం దేహమా
శ్రితః।
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్వి
ధమ్॥

౧౫. సర్వస్యచాహం హృదిసన్నివిష్టో మత్తస్స్మృతిర్జ్ఞానమ
పోహనంచ।
వేదైశ్చసర్వై రహమేవవేద్యో వేదాంతకృద్వేదవి
దేవచాహమ్॥

౧౬. ద్వావిమౌపురుషౌలోకే క్షరశ్చాక్షరఏవచ।
క్షరస్సర్వాణిభూతాని కూటస్థోక్షరఉచ్యతే॥

౧౪ దేహ ధారుల శరీరముల యందు, జఠరాగ్ని స్వరూపుడనై, ప్రాణా పాన వాయువులతోఁ గూడు కొని, వార్లు భుజించెడి నాల్గు విధములైన, భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్యపదార్థములను, జీర్ణము చేయు చున్నాను.

౧౫. సమస్తప్రాణుల హృదయముల యందు, నేను ప్రవేశించియున్నాను. నావల్లనే, వార్లకు, స్మృతి, జ్ఞాన ము, మాంద్యము, గలుగుచున్నవి, సమస్త వేదముల చేత తెలియ దగినవాడను, వేదములను చేసినవాడను, వేదములు తెలిసినవాడను, నేనేను.

౧౬. సమస్త లోకములయందు, క్షరుడని, అక్షరు డని, ఇరువురు పురుషులు గలరు. అందులో, క్షరుడను పురుషుడు, సమస్త దేహములే స్వరూపముగా గల వాడు. అక్షర పురుషుడు, కూటస్థుడని, పెద్దలు చెప్పు దురు

౧౭. ఉత్తమఃపురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః।
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయఈశ్వరః॥

౧౮. యస్మాత్క్షరమతీతోఽహ మక్షరాదపిచోత్తమః।
అతోఽస్మి లోకేవేదేచ ప్రథితఃపురుషోత్తమః॥

౧౯. యో మామేవమసమ్మూఢో జానాతి పురుషోత్త
మమ్।
ససర్వవిద్భజతిమాం సర్వభావేనభారత॥

౧౭ ఈ ఇరువురు పురుషులకంటే, విలక్షణుడైన మరి యొక పురుషుడున్నాడు. అతడేపరమాత్మ, అతడే, స్వర్గ, మర్త్య, పాతాళ లోకములయందు ప్రవేశించి, వాటిని భరించుచున్నాడు. అతడే, నాశరహితుడైన ఈశ్వరుడు.

౧౮. నేను, క్షరపురుషుని అతిక్రమించినవాడనై, అక్షర పురుషునికంటే ఉత్తముడను గనుక, లోకముల యందును, వేదములయందును, పరమాత్మ స్వరూపుడైన పురుషోత్తముడని, ప్రసిద్ధి పొందియున్నాను.

౧౯. ఓయి అర్జున, ఎవ్వడైతే మోహవర్జితుడై, పైనచెప్పిన ప్రకారము, పురుషోత్తముడనైన నన్ను, తెలిసికొనుచున్నాడో, అట్టి పురుషుడు సర్వజ్ఞుడై, సమస్త విధములచేత, నన్ను పొందుచున్నాడు.

౨౦. ఇతిగుహ్యతమంశాస్త్ర మిదముక్తం మయానఘ।
ఏతద్బుద్ధ్వాబుద్ధిమాన్‌స్యాత్కృతకృత్యశ్చభారత॥

---

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
పురుషోత్తమప్రాప్తియోగోనామ
పంచదశోఽధ్యాయః.

౨౦. ఓయి అర్జున, పరమ రహస్యమైన ఈశాస్త్రమును, నీకొఱకు, వివరించి చెప్పితిని. ఈశాస్త్రమును, నేను వివరించిన రీతిని, తెలిసికొనిన వివేకులు, బుద్ధిమంతులై, తాము చేయదగిన కర్మలను, చేయుదురు.



ఇట్లని ఉపనిషద్రూపమైనట్టియు పరబ్రహ్మవిద్యయైనట్టి
భగవద్గీతలనెడు శ్రీకృష్ణార్జునసంవాదరూపమైన
యోగశాస్త్రమునందు పురుషోత్తమ
ప్రాప్తియోగమను
పదియైదవ అధ్యాయము ముగిసెను.



# దైవాసురసంపద్విభాగయోగః.

శ్రీభగవాన్ ఉవాచ.

౧. అభయంసత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః।
దానందమశ్చయజ్ఞశ్చ స్వాధ్యాయ స్తపఆర్జవమ్॥

౨. అహింసాసత్యమక్రోధ స్త్యాగశ్శాంతిరపైశునమ్।
దయాభూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలమ్॥

# దైవాసురసంపద్విభాగయోగము.

---

శ్రీకృష్ణుల వాక్యము.

౧. భయములేక యుండుట, చిత్తశుద్ధి, జ్ఞానయోగము నందుండుట, దానములు జేయుట, బాహ్యేంద్రియ నిగ్రహము, యజ్ఞములు జేయుట, వేదాధ్యయనము జేయుట, తపోనిష్ఠుడుగానుండుట, అధర్మమునందు ప్రవేశించక నుండుట

౨. పరపీడావర్జనము, సత్యము, క్రోధములేకయుండుట, సర్వసంగపరిత్యాగము, చిత్తోపశమము, పరుల యందుదోషములు చెప్పకయుండుట, సర్వప్రాణులయందు దయ, విషయములు ప్రాప్తమైనప్పుడు ఇంద్రియ వికారములులేక యుండుట, మృదుత్వము, సిగ్గు, చాపల్యము లేకయుండుట.

3. తేజఃక్షమాధృతిశ్శౌచమద్రోహోనాతిమానితా।
భవంతిసంపదందైవీ మభిజాతస్యభారత॥

౪. దంభోదర్పోభిమానశ్చ క్రోధఃపారుష్యమేవచ।
అజ్ఞానంచాభిజాతస్య పార్థసంపదమాసురీమ్॥

౫. దైవీసంపద్విమోక్షాయ నిబంధాయాసురీమతా।
మాశుచస్సంపదందైవీ మభిజాతోసిపాండవ॥

౩. గాంభీర్యముతో గూడియుండుట, ఓర్పు, ధైర్యము, శుద్ధి, పరులకు ద్రోహముజేయకయుండుట, గర్వములేకయుండుట, ఈ గుణములన్నియు, ఓయి అర్జున, దేవాంశములో జన్మమెత్తిన మనుష్యులకు, గలుగుచున్నవి.

౪. ఓయిపార్థ, డంబము, గర్వము, అభిమానిత్వము క్రోధము, నిష్ఠురవాక్యలు పలుకుట, అవివేకము, ఈగుణములన్నియు, అసురాంశములో జన్మమెత్తినవారలకు, గలుగుచున్నవి.

౫. ఓయి అర్జున, దేవాంశములో జన్మమెత్తుట, మోక్షప్రాప్తికి హేతువుగానున్నది, అసురాంశములో జన్మమెత్తుట, ప్రకృతిసంబంధమైన జనన మరణములకు హేతువుగా నున్నయది, నీవు దేవాంశములో జన్మమెత్తినవాడవు గనుక, నీవు దుఃఖింపపనిలేదు.

౬. ద్వౌభూతసర్గౌలోకేస్మిన్ దైవఆసురఏవచ।
దైవోవిస్తరశఃప్రోక్త ఆసురంపార్థమేశృణు॥

౭. ప్రవృత్తించనివృత్తించ జనానవిదురాసురాః।
నశౌచంనాపిచాచారో నసత్యంతేషువిద్యతే॥

౮. అసత్యమప్రతిష్ఠంతే జగదాహురనీశ్వరమ్।
అపరస్పరసంభూతం కిమన్యత్కామహైతుకమ్॥

౬. ఓయిపార్థ, ఈలోకమునందు, ప్రాణులకు, దేవాంశమని, అసురాంశమని, రెండువిధములైన జన్మములు గలవు, అందులో, దేవాంశ జన్మగుణములు, సవిస్తారముగా నీకు జెప్పబడినవి, అసురాంశ జన్మగుణములు ఇకను సవిస్తారముగా చెప్పుచున్నాను, వినుము.

౭. అసురాంశ జన్మములు ఎత్తినవారికి, శ్రౌతస్మార్త కర్మ ప్రవృత్తి ఫలానిదనియు, కర్మనివృత్తి ఫలానిదనియు, తెలియదు. వారికి, అంతర్బహిశ్శుద్ధి, సదాచారము, సత్యము, ఉండదు.

౮. అసురాంశజన్మములు ఎత్తినవారు, సకల ప్రపంచమును సత్యస్వరూపమని స్థాపించు వేదములను, విశ్వసింపరు, వాటియందు, ధర్మాధర్మ ప్రతిష్ఠలేదని వాదింతురు, ఈజగత్తునకు నియామకుడైన ఈశ్వరుడు లేడని వాదింతురు. యావత్తులోకము, స్త్రీపురుష సంబంధమువల్ల గలిగినదనియు, కామహేతువనియు, మరియేమి లేదనియు, వక్కాణింతురు.

౯. ఏతాందృష్టిమవష్టభ్య నష్టాత్మానోల్పబుద్ధయః।
ప్రభవంత్యుగ్రకర్మాణః క్షయాయజగతో౽హితాః॥

౧౦. కామమాశ్రిత్య దుష్పూరం దంభమాన మదాన్వితాః।
మోహాద్గృహీత్వా సద్గ్రాహాన్ ప్రవర్తంతేశుచివ్రతాః॥

౧౧. చింతామ పరిమేయాంచ ప్రళయాంతా ముపాశ్రితాః।
కామోపభోగపరమా ఏతావదితినిశ్చితాః॥

౧౨. ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః।
ఈహంతేకామభోగార్థ మన్యాయేనార్థసంచయాన్॥

౯. ఇట్లు అభిప్రాయముగలవారై, నష్టాత్ములై, అల్పబుద్ధిగలవారై, హింసాది క్రూరకర్మలుచేయుచు, లోకమునకు శత్రువులై, లోకనాశముకొరకు ప్రయత్నములు జేయుచుందురు.

౧౦. అట్టివారు, అపరిమితమైన కోరికలు గలవారై, డంబ, మాన, మదయుక్తులై, నిక్షేపాదులను గోరుచు, క్షుద్రదేవతలను ఆరాధించినవారై, అశాస్త్ర నియమములు గలవారై, ప్రవర్తించుచుందురు.

౧౧. మరియు, మరణమువరకు అపరిమితమైన చింత గలవారై, కామభోగములే పరమార్థములని నిశ్చయముగానమ్మి, వర్తించుచుందురు.

౧౨. అనేకవిధములైన ఆశాపాశములచేత కట్టబడినవారై, కామక్రోధములచేత నిండినవారై, కామ భోగార్థమై, అన్యాయమార్గములచేత, ద్రవ్యమును సంపాదించ కోరుచున్నారు.

౧౩. ఇదమద్యమయాలబ్ధ మిమంప్రాప్స్యేమనోరథమ్।
ఇదమస్తీదమపిమే భవిష్యతిపునర్ధనమ్॥

౧౪. అసౌమయాహతశ్శత్రు ర్హనిష్యేచాపరానపి।
ఈశ్వరోఽహమహంభోగీ సిద్ధోఽహంబలవాన్సుఖీ॥

౧౫. ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తిసదృశోమయా।
యక్ష్యేదాస్యా మిమోదిష్య ఇత్యజ్ఞాన విమోహి
తాః॥

౧౩. మరియు, అట్టివారు, ఇంతద్రవ్యము ఇప్పుడు నేను సంపాదించితిని, ఇకను ఇంతసంపాదించ పోవుచున్నాను, ఇంతద్రవ్యము నాదిగానున్నది, ఇంకను నాఅభీష్టములను పొందబోవు చున్నాను, అని తలంతురు.

౧౪. మరియు, ఇప్పుడు నేను ఈ శత్రువులను సంహరించితిని, ఇకను ఇతర శత్రువులను చంపగలను, నేను నియామకుడను, భోగిని, సంపన్నుడను, బలవంతుడను, సుఖిని, అని తలచుచున్నారు.

౧౫. ఇంతేగాక, నేను ధనవంతుడను, నేను సత్కులముగలవాడను, నాతోటి సమానుడు ఎవ్వడును లేడు, నేను యజ్ఞములు చేసెదను, దానములను ఇచ్చెదను, సంతోషించెదను, అని ఇవ్విధముగా, అవివేకపుమాటలు వచించుచున్నారు.

౧౬. అనేకచిత్తవిభ్రాంతా మోహజాలసమావృతాః।
ప్రసక్తాః కామభోగేషు పతంతినరకేఽశుచౌ॥

౧౭. ఆత్మసంభావితా స్తబ్ధా ధనమానమదాన్వితాః।
యజంతే నామయజ్ఞై స్తే దంభేనావిధిపూర్వకమ్॥

౧౮. అహంకారంబలందర్పం కామంక్రోధంచసంశ్రితాః।
మామాత్మపరదేహేషుప్రద్విషంతోఽభ్యసూయకాః॥

౧౯. తానహంద్విషతఃక్రూరాన్ సంసారేషునరాధమాన్।
క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవయోనిషు॥

౧౬. అట్టి దురాచారపు మనుష్యులు, అనేక విషయములయందు ఆసక్తియుంచుటవలన, చిత్తవిభ్రాంతి పొంది, మోహమనెడు వలచేత చుట్టుకోబడినవారై, కామానుభవములయందు మునింగినవారై, ఘోరమైన నరకమును పొందుచున్నారు.

౧౭. మరియు, అట్టి అవివేకులు, తమ్ముతామే పొగడుకొని, పెద్దల నిరాకరించి ధనమాన మదములతో గూడుకొని, డంబముకొరకై, శాస్త్రసమ్మతముగాని యజ్ఞములను, జేయుచుందురు.

౧౮. మరియు, అహంకారము, బలము, దర్పము, కామము, క్రోధము, గలవారై, సర్వాంతర్యామియైన నన్ను ద్వేషించి, ఇతరుల సద్గుణములను సహింపక, వారియందు లేనితప్పులను చెప్పుదురు.

౧౯. నాకు ద్వేషులై, క్రూరచిత్తముగల అట్టి అధములను, నిరంతరము, రాక్షసాంశమైన నికృష్ట జన్మములను ఎత్తునట్లుగా, జేయుచున్నాను.

౨౦. ఆసురీంయోనిమాపన్నా మూఢాజన్మనిజన్మని।
మామప్రాప్యైవకౌంతేయ తతో యాంత్యధమాం
గతిమ్॥

౨౧. త్రివిధంనరకస్యేదం ద్వారంనాశనమాత్మనః।
కామఃక్రోధ స్తథాలోభ స్తస్మాదేతత్త్రయంత్యజేత్॥

౨౨. ఏతైర్విముక్తఃకౌంతేయతమోద్వారై స్త్రిభిర్నరః।
ఆచరత్యాత్మనశ్శ్రేయ స్తతోయాతిపరాంగతిమ్॥

౨౩. యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతేకామకారతః।
నసిద్ధిమవాప్నోతి నసుఖంనపరాంగతిమ్॥

౨౦. ఓయికౌంతేయ, అట్టి నికృష్టజన్మముల నొందెడు అవివేకులు, నికృష్టజన్మములు • ఎత్తుచూ, జన్మజన్మమునకు అధోగతిని పొందుచూ ఉందురేగాని, నన్ను ఎప్పటికిని పొందచాలరు.

౨౧. కామము, క్రోధము, లోభము, ఈమూడును, ఆత్మను నాశముజేయునట్టివి, అవి నరకప్రాప్తికి హేతువులగును, గనుక, ఈమూడు గుణములను, విడిచిపెట్టవలయును.

౨౨. ఓయి కౌంతేయ, పైనవివరించిన కామక్రోధలోభములను విడిచిపెట్టినవాడు, తన ఆత్మకు శ్రేయస్కరమై, శాస్త్రసమ్మతమైన తపోయోగాది కర్మలను ఆచరించి, మోక్షమును పొందుచున్నాడు.

౨౩. ఎవ్వడైతే, శాస్త్రవిధిని అనుసరించక, ఇచ్ఛామార్గముగా వర్తించుచున్నాడో, అట్టివానికి, సిద్ధిలేదు, సుఖములేదు, పరలోకప్రాప్తిలేదు.

౨౪. తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ ।
జ్ఞాత్వాశాస్త్రవిధానోక్తం కర్మకర్తుమిహార్హసి॥

---

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
దైవాసురసంపద్విభాగ
యోగోనామ
షోడశోధ్యాయః.

---

౨౪. గనుక, శాస్త్రములను ప్రమాణములని నమ్మి, శాస్త్రసమ్మతములైన కర్మలను, శాస్త్ర బాహ్యములైన కర్మలను, తెలిసికొని, శాస్త్రోక్తమైన కర్మలను, నీవు చేయుచుండుము.

---

ఇట్లని ఉపనిషద్రూపమైనట్టియు, పరబ్రహ్మవిద్యయైనట్టి భగవద్గీతలనెడు శ్రీకృష్ణార్జున సంవాద రూపమైన యోగశాస్త్రమునందు దైవాసుర సంపద్విభాగయోగమను

పదియారవ అధ్యాయము ముగిసెను.

---

# శ్రద్ధాత్రయవిభాగయోగః.

---

అర్జున ఉవాచ.

౧. యేశాస్త్రవిధిముత్సృజ్య యజంతేశ్రద్ధయాన్వితాః
తేషాంనిష్ఠాతుకాకృష్ణ సత్వమాహోరజస్తమః॥

---

శ్రీభగవాన్ ఉవాచ.

౨. త్రివిధాభవతిశ్రద్ధా దేహినాంసాస్వభావజా।
సాత్వికీరాజసీచైవ తామసీచేతితాంశృణు॥

# శ్రద్ధాత్రయవిభాగయోగము.

---

అర్జున వాక్యము.

౧. ఓయి కృష్ణ, ఎవ్వఁడైతే శాస్త్రాచారమును వదలి వృద్ధాచార సంప్రదాయమైన పూజలు మొదలైనవి, శ్రద్ధతో జేయుచున్నాఁడో, వానిగతియేమి అగుచున్నది. అట్టి ఆచారము, సాత్వికమా, రాజసమా, తామసమా.

---

శ్రీకృష్ణుల వాక్యము.

౨. దేహధారులకుగలుగు శ్రద్ధ, పూర్వజన్మ వాసనను అనుసరించి, సాత్వికము, రాజసము, తామసము, అని, మూడువిధములుగా నున్నది, వాటిని వివరించు చున్నాను, వినుము.

౩. సత్వానురూపా సర్వస్య శ్రద్ధాభవతిభారత।
శ్రద్ధామయోయంపురుషో యోయచ్ఛ్రద్ధస్సఏవసః॥

౪. యజంతేసాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసిరాజసాః
ప్రేతాన్భూతగణాంశ్చాన్యే యజంతేతామసాజనాః॥

౫. అశాస్త్రవిహితంఘోరం తప్యంతేయేతపోజనాః।
దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః॥

౬. కర్శయంతశ్శరీరస్థం భూతగ్రామమచేతసః।
మాంచైవాంతశ్శరీరస్థం తాన్విద్ధ్యాసురనిశ్చయాన్॥

3 ఓయి అర్జున, సమస్త ప్రాణులకు, వారి వారి పూర్వపూర్వ జన్మములయందు చేసిన కర్మఫలములను అనుసరించి, శ్రద్ధ కలుగుచున్నది. ఆ కారణము వలన, జీవులకు, పైనవర్ణించిన మూడుగుణములలో, ఏగుణము పట్టుబడుచున్నదో, ఆగుణమును అనుసరించినశ్రద్ధ, కలుగుచున్నది.

౪. సత్వగుణనిష్ఠులు దేవతలను, రజోగుణనిష్ఠులు యక్షరాక్షసులను, తమోగుణనిష్ఠులైన ఇతరులు ప్రేత భూతగణములను, శ్రద్ధతో పూజింతురు.

౫, ౬. డంబము, అహంకారము గలిగి, కామ రాగ బలములతో గూడి, ఏ మనుష్యులు, శాస్త్రోక్తముగాని ఘోరతపస్సు చేయుచున్నారో, అట్టిఅవివేకులు, తమ శరీరములయందున్న ఇంద్రియసమూహమును, తత్కర్మ సాక్షియైన నన్ను, కృశింపచేయుచున్నారు, అట్టివారిని, అసురప్రకృతిసంభూతులుగా తెలియుము.

౭. ఆహార స్త్వపిసర్వస్య త్రివిధో భవతిప్రియః।
యజ్ఞ స్తప స్తథాదానం తేషాంభేదమిమంశృణు॥

౮. ఆయుస్సత్త్వబలారోగ్య సుఖప్రీతివివర్ధనాః।
రస్యాస్స్నిగ్ధాస్థిరాహృద్యా ఆహారాస్సాత్త్విక ప్రియాః॥

౯. కట్వామ్లలవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహినః।
ఆహారారాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః॥

౭. సమస్తప్రాణులకు, భోజనపదార్థములుగూడా, పైనచెప్పిన సాత్త్విక, రాజస, తామసగుణములను అనుసరించి, ఇష్టముగానుండునవి. ఆప్రకారమే, యజ్ఞము, తపస్సు, దానమున్ను, త్రిగుణాత్మకములుగా నున్నవి. వాటి తారతమ్యములను వివరించెదను వినుము.

౮. సత్వగుణవంతులు, రసయుక్తములైనట్టియు, నెయ్యితో గూడియున్నట్టియు, చిరకాలస్థాయులైనట్టియు, ప్రియములైనట్టియు, ఆయుస్సు, సత్వము, బలము, ఆరోగ్యము, ప్రీతి వృద్ధికరములైనట్టి భోజనపదార్థములను ఇష్టముతో అంగీకరింతురు.

౯. దుఃఖము, శోకము, రోగము, గలుగచేయునట్టి మిక్కిలిచేదు, పులుసు, ఉప్పుగలిసి, ఖారమైన బహువేడి పదార్థములను, రజోగుణవంతులు ఇష్టముతో అంగీకరింతురు.

౧౦. యాతయామంగతరసం పూతిపర్యుషితంచయత్।
ఉచ్ఛిష్టమపిచామేధ్యం భోజనంతామసప్రియమ్॥

౧౧. అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టోయఇజ్యతే।
యష్టవ్యమేవేతిమన స్సమాధాయససాత్త్వికః॥

౧౨. అభిసంధాయతుఫలం దంభార్థమపిచైవయత్।
ఇజ్యతేభరతశ్రేష్ఠ తంయజ్ఞంవిద్ధిరాజసమ్॥

౧౩. విధిహీనమసృష్టాన్నం మంత్రహీనమదక్షిణమ్।
శ్రద్ధావిరహితంయజ్ఞం తామసంపరిచక్షతే॥

౧౦. వంటచేసినపిదప ఝాముకాలమై చల్లారినట్టి యు, సారములేనట్టియు, దుర్గంధమైనట్టియు, సద్దియైనట్టి యు, భోజనానంతరము మిగిలినట్టియు, అపవిత్రమైనట్టి పదార్థములను, తమోగుణవంతులు ప్రీతితో అంగీక రింతురు.

౧౧. శాస్త్రవిధిచేత నియమితమైన యజ్ఞములను, ఫల కాంక్షలేక చేయడము ఉచితమని మనస్సునందు నిశ్చయిం చి, ఏ యజ్ఞములు జేయబడుచున్నవో, అవి సత్వగుణ ప్రధానములైనవి యని తెలిసికొనుము.

౧౨. ఓయి అర్జున, ఫలము నుద్దేశించిగాని, ప్రతిష్ఠ కొరకుగాని, చేయబడు యజ్ఞములు, రజోగుణప్రధానమై నవిగా తెలిసికొనుము.

౧3 శాస్త్రసమ్మతముకానట్టియు, అన్నదానము లేన ట్టియు, మంత్రలోపమైనట్టియు, శాస్త్రోక్తదక్షిణలేనట్టియు, శ్రద్ధలేక చేయబడిన యజ్ఞములు, తమోగుణప్రధానము లని తెలిసికొనుము.

౧౪. దేవద్విజగురుప్రాజ్ఞ పూజనంశౌచమార్జవమ్।
బ్రహ్మచర్యమహింసాచ శారీరంతపఉచ్యతే॥

౧౫. అనుద్వేగకరంవాక్యం సత్యంప్రియహితంచయత్।
స్వాధ్యాయాభ్యసనంచైవ వాఙ్మయంతపఉచ్యతే॥

౧౬. మనఃప్రసాదసౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః।
భావసంశుద్ధిరిత్యేత త్తపోమానసముచ్యతే॥

౧౭. శ్రద్ధయాపరయాతప్తం తపస్తత్త్రివిధంనరైః।
అఫలాకాంక్షిభిర్యుక్తై స్సాత్త్వికంపరిచక్షతే॥

౧౪ దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, పెద్దలను పూజించుటయు, శుచి, కిల్బిషములేనితనము, నిషిద్ధస్త్రీగమన వర్జనము, ఇతరప్రాణులకు ఉపద్రవము చేయకయుండుట, ఇవియన్నియు. శరీరప్రధానమైన తపస్సులని చెప్పబడుచున్నవి.

౧౫. ఇతరప్రాణులకు మనస్సునొప్పింపని, ప్రీతి విశ్వాసములతోఁగూడిన యథార్థపు మాటలున్ను, వేదాభ్యాసము చేయడమున్ను, వాగ్రూపమైన తపస్సులని చెప్పబడును.

౧౬. మనస్సుకు తృప్తియైన మంచివృత్తిన్ని, మితభాషిత్వమున్ను, మనోనిగ్రహమున్ను, మనశ్శుద్ధిన్ని, మనస్సంబంధమైన తపస్సులని చెప్పబడును.

౧౭. ఫలకాంక్షలేక, ఉత్కృష్టమైన శ్రద్ధతో, యోగులుచేయునట్టి, పైనవివరించిన మూడువిధములైన శరీర, వాక్, మనస్తపస్సులు, సత్వగుణ ప్రధానమైనవని పెద్దలు చెప్పుదురు.

౧౮. సత్కారమానపూజార్థం తపోదంభేనచైవయత్।
క్రియతేతదిహప్రోక్తం రాజసంచలమధ్రువమ్॥

౧౯. మూఢగ్రాహేణాత్మనోయత్ పీడయాక్రియతేతపః।
పరస్యోత్సాదనార్థంవా తత్తామసముదాహృతమ్॥

౨౦. దాతవ్యమితియద్దానం దీయతేనుపకారిణే।
దేశేకాలేచపాత్రేచ తద్దానంసాత్త్వికంస్మృతమ్॥

౨౧. యత్తుప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్యవాపునః।
దీయతేచపరిక్లిష్టం తద్దానంరాజసంస్మృతమ్॥

౨౨. అదేశకాలేయద్దాన మపాత్రేభ్యశ్చదీయతే।
అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్॥

౧౮. ఇతరులవల్ల పూజింపబడుటకును, గౌరవముకొరకును, డంబముకొరకును చేయు తపస్సు, రజోగుణ సంబంధమనియు, నశించతగ్గదనియు, చంచలమైన దనియు, పెద్దలు వక్కాణింతురు.

౧౯. తనకు దుఃఖకరమై, ఇతర ప్రాణులకు హింసాస్పదమై, దురాగ్రహముచేత చేయబడిన తపస్సు, తమోగుణ సంబంధమైనదని పెద్దలు పలుకుదురు.

౨౦. దానము చేయడము అవశ్యమనియెంచి, కాల దేశపాత్రములను ఎరింగి, ప్రత్యుపకారము చేయలేని పురుషులకు ఇచ్చుదానము, సత్వగుణప్రధానమైనదని చెప్పబడుచున్నది.

౨౧. ఫలము నుద్దేశించిన్ని, ప్రత్యుపకారము నుద్దేశించిన్ని, మనస్సు నొచ్చుకొనుచు ఇవ్వబడిన దానము, రాజసగుణ ప్రధానమైనదని చెప్పబడుచున్నది.

౨౨. నికృష్టదేశకాల పాత్రములయందు, తిరస్కార అవమానములతోగూడి చేయబడినదానము, తామసగుణ ప్రధానమైనదని చెప్పబడుచున్నది.

౨౩. ఓంతత్సదితినిర్దేశో బ్రహ్మణస్త్రివిధస్మృతః।
బ్రాహ్మణాస్తేనవేదాశ్చ యజ్ఞాశ్చనిహితాః పురా॥

౨౪. తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః।
ప్రవర్తంతేవిధానోక్తా స్సతతంబ్రహ్మవాదినామ్॥

౨౫. తదిత్యనభిసంధాయ ఫలంయజ్ఞతపఃక్రియాః।
దానక్రియాశ్చవివిధాః క్రియంతేమోక్షకాంక్షిభిః॥

౨౬. సద్భావేసాధుభావేచ సదిత్యేతత్ప్రయుజ్యతే।
ప్రశస్తేకర్మణితథా సచ్ఛబ్దఃపార్థయుజ్యతే॥

౨౩. పరబ్రహ్మ నామోచ్చారణము, ఓం, తత్, సత్, అని, మూడు ప్రకారములుగా చెప్పబడెను. అట్టి పరబ్రహ్మముచేత, పూర్వకాలమునందు, బ్రాహ్మణులు, వేదములు, యజ్ఞములు, నిర్మింపబడినవి.

౨౪. ఆకారణమువలన, శాస్త్రోక్తమైన యజ్ఞదానతపస్సులనే, క్రియలను, బ్రహ్మవాదులు ప్రారంభించునపుడు, ఓంకారమును మొదట ఉచ్చరించుచున్నారు.

౨౫. మోక్షకాంక్షగలిగినవారిచేత, తత్, అనే పరమాత్మస్వరూపనిర్దేశమైన శబ్దము, ఉచ్చరింపబడి, యజ్ఞదాన తపఃక్రియలు, ఫలకాంక్ష లేకనే ప్రారంభింపబడుచున్నవి

౨౬. ఓయిపార్థ, సత్ అనేశబ్దము, శ్లాఘనీయమైనవాటిని, శ్రేష్ఠమైనవాటిని, తెలియచేయుటకు సంజ్ఞగానున్నది. ఆకారణమువలన, ప్రశస్తమైన కర్మలయందు, సత్ శబ్దము ప్రయోగింపబడుచున్నది.

౨౭. యజ్ఞేతపసిదానేచ స్థితిస్సదితిచోచ్యతే
కర్మచైవతదర్థీయం సదిత్యేవాభిధీయతే॥-

౨౮. అశ్రద్ధయాహుతందత్తం తపస్తప్తం కృతంచయత్।
అసదిత్యుచ్యతేపార్థ నచతత్ప్రేత్యనోఇహ॥



ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే
శ్రద్ధాత్రయవిభాగయోగోనామ
సప్తదశోధ్యాయః.



౨౭. యజ్ఞదాన తపస్సులయందుగల నిష్ఠ, సత్, అని చెప్పబడును. భగవత్ప్రీతిగా చేయబడిన కర్మలు యావత్తు, సత్, అని చెప్పబడుచున్నవి.

౨౮. ఓయిపార్థ, శ్రద్ధలేని హోమములు, దానములు, తపస్సులు, అసత్ అని చెప్పబడును. అవి, ఇహమందును, పరమందును, సౌఖ్యకరములుగావు.



ఇట్లన్ని ఉపనిషద్రూపమైనట్టియు, పరబ్రహ్మవిద్యయైనట్టి
భగవద్గీతలనెడు శ్రీకృష్ణార్జున సంవాదరూపమైన
యోగశాస్త్రమునందు శ్రద్ధాత్రయ
విభాగయోగమను
పదియేడవ అధ్యాయము ముగిసెను.



# మోక్షసన్న్యాసయోగః.

---

అర్జున ఉవాచ.

౧. సన్న్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేది
తుమ్।
త్యాగస్యచహృషీకేశ పృథక్కేశినిషూదన॥

---

శ్రీభగవాన్ ఉవాచ.

౨. కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో
విదుః।
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగంవిచక్షణాః॥

3. త్యాజ్యందోషవదిత్యేకే కర్మప్రాహుర్మనీషిణః।
యజ్ఞదానతపఃకర్మ నత్యాజ్యమితిచాపరే॥

## మోక్షసన్న్యాసయోగము.

---

అర్జున వాక్యము.

౧. ఓయిశ్రీకృష్ణ, సన్న్యాసముయొక్క, త్యాగముయొక్క తత్త్వములను, వేర్వేరుగా తెలియ కోరుచున్నాను, దయచేసి సెలవిమ్ము.

---

శ్రీకృష్ణుల వాక్యము.

౨. జ్యోతిష్టోమాదికామ్య కర్మత్యాగము సన్న్యాసమనియు, వేదోక్తమైన సమస్తకర్మలను ఆచరించి, కర్మఫలములను ఈశ్వరార్పణముచేయుట త్యాగమనియు పెద్దలు చెప్పుచురు.

3. కొందరు పెద్దలు, సమస్తకర్మలను దోషముగలవిగాయెంచి, సన్న్యసించవలయునని చెప్పుదురు. మరికొందరు పెద్దలు, వేదోక్తమైన యజ్ఞదాన తపస్సులనే కర్మలను, విడువకూడదని చెప్పుదురు.

౪. నిశ్చయంశ్రుణుమేతత్ర త్యాగేభరతసత్తమ।
త్యాగోహిపురుషవ్యాఘ్ర త్రివిధస్సంప్రకీర్తితః॥

౫. యజ్ఞదానతపఃకర్మ నత్యాజ్యంకార్యమేవతత్।
యజ్ఞోదానంతపశ్చైవ పావనానిమనీషిణామ్॥

౬. ఏతాన్యపితుకర్మాణి సంగంత్యక్త్వాఫలానిచ।
కర్తవ్యానీతిమేపార్థ నిశ్చితంమతముత్తమమ్॥

౭. నియతస్యతుసన్న్యాసః కర్మణోనోపపద్యతే।
మోహాత్తస్యపరిత్యాగ స్తామసఃపరికీర్తితః॥

౪. ఓయి పురుషశ్రేష్ఠ, కర్మత్యాగమని, కర్మఫల త్యాగమని చెప్పంబడు ఈ రెండుమార్గములలో, నా అభిప్రాయము వినుము. త్యాగము మూడువిధములని చెప్పబడియున్నది.

౫. యజ్ఞ దాన తపో రూపమైన కర్మ, అవశ్యము చేయదగినది. అది విడువదగినది కాదు. ఎందువల్ల ననగా, యజ్ఞదాన తపః కర్మలు పండితులకు పవిత్రములైనవి.

౬. ఓయి పార్థ, పైనచెప్పిన మూడు విధములైన యజ్ఞదానతపఃకర్మలను, మమకార ఫలకాంక్షలు విడిచిపెట్టి, చేయవలయును. ఇది నానిశ్చయమైన పరమోత్తమాభిప్రాయము.

౭. వేదోక్తమైన నిత్యనైమిత్తికకర్మలను విడిచిపెట్టకూడదు. అట్లు అజ్ఞానముచేత విడిచిపెట్టుట, తామస త్యాగమని తెలిసికొనుము.

౮. దుఃఖమిత్యేవయత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్।
సకృత్వారాజసంత్యాగం నైవత్యాగఫలంలభేత్॥

౯. కార్యమిత్యేవయత్కర్మ నియతంక్రియతేఽర్జున।
సంగంత్యక్త్వాఫలంచైవ సత్యాగస్సాత్త్వికోమతః॥

౧౦. నద్వేష్ట్యకుశలంకర్మ కుశలేనానుషజ్జతే।
త్యాగీసత్త్వసమావిష్టో మేధావీఛిన్నసంశయః॥

౧౧. నహిదేహభృతాశక్యం త్యక్తుంకర్మాణ్యశేషతః।
యస్తుకర్మఫలత్యాగీ సత్యాగీత్యభిధీయతే॥

౮. దేహమునకు కష్టమగునని భయపడి, ప్రయాస యిచ్చెడి కర్మలను ఎవ్వడు విడిచిపెట్టు చున్నాడో, అట్టి వాడు రాజసత్యాగము జేసినవాడగును, గనుక, కర్మఫలత్యాగమువల్ల ప్రాప్తమయ్యెడి మోక్షము, వానికి సిద్ధించనేరదు.

౯. ఓయి అర్జున, ఆసక్తిని, ఫలమును, విడిచిపెట్టి, వేదోక్తమైన నిత్యనైమిత్తికకర్మలు, అవశ్యము చేయదగినవియని, ఎవ్వడుచేయు చున్నాడో, అట్టివాని త్యాగము, సాత్వికత్యాగమని తెలిసికొనుము.

౧౦. సాత్వికత్యాగముగల ఆత్మజ్ఞాని, సంశయంబులు మాని, సుఖదుఃఖకరంబులైన నిత్యనైమిత్తికకర్మలయందు, స్నేహద్వేషంబులు పెట్టడు.

౧౧. దేహధారి, కర్మలను వదలిపెట్టి నిర్వహించలేడు గనుక. ఎవ్వడు వేదోక్తములైన కర్మలను ఆచరించి, కర్మఫలములను త్యజించుచున్నాడో, వాడే, కర్మత్యాగియని చెప్పబడును.

౧౨. అనిష్టమిష్టంమిశ్రంచ త్రివిధంకర్మణఃఫలమ్।
భవత్యత్యాగినాంప్రేత్యనతుసన్న్యాసినాంక్వచిత్॥

౧౩. పంచైతానిమహాబాహో కారణానినిబోధమే।
సాంఖ్యేకృతాంతేప్రోక్తాని సిద్ధయేసర్వకర్మణామ్॥

౧౪. అధిష్ఠానంతథాకర్తా కరణంచపృథగ్విధమ్।
వివిధాచపృథక్చేష్టా దైవంచైవాత్రపంచమమ్॥

౧౫. శరీరవాఙ్మనోభిర్యత్కర్మప్రారభతేనరః।
న్యాయ్యంవావిపరీతంవా పంచైతేతస్యహేతవః॥

౧౨. కర్మఫలములు, ఇష్టములైనవి, ఇష్టములు కానివి, ఇష్టానిష్టములైనవి, అని మూడువిధములు. కర్మఫలత్యాగము చేయనివార్లను, జన్మాంతరములయందు ఆఫలములు పొందుచున్నవి. కర్మఫలత్యాగము చేసినవార్లను ఆఫలములు జన్మాంతరములయందు అంటవు.

౧౩ ,ఓయి అర్జున, వేదాంత సిద్ధాంతమునందు, సమస్తకర్మలసిద్ధికొరకు చెప్పియుండు అయిదు కారణములను, నీకు చెప్పెదను వినుము.

౧౪. దేహము, అహంకారము, ఇంద్రియములు, పంచప్రాణముల వ్యాపారము, వీట్ల అభిమానిదేవతల ప్రేరేపణ, అని, ఈవిధముగా అయిదుకారణములున్నవి.

౧౫. త్రికరణములైన మనస్సు, వాక్కు, కాయములతోగూడిన మంచికర్మనైనా, చెడుకర్మనైనా, మనుష్యుడు ప్రారంభించునపుడు, అట్టి కర్మకు, పైన చెప్పిన అయిదున్ను కారణములని తెలిసికొనుము.

౧౬. తత్రైవంసతికర్తార మాత్మానం కేవలంతుయః।
పశ్యత్యకృతబుద్ధిత్వా న్నసపశ్యతిదుర్మతిః॥

౧౭. యస్యనాహంకృతోభావో బుద్ధిర్యస్యనలిప్యతే।
హత్వాపిసఇమాఀల్లోకాఀ నహంతిననిబధ్యతే॥

౧౮. జ్ఞానంజ్ఞేయంపరిజ్ఞాతా త్రివిధాకర్మచోదనా।
కరణంకర్మకర్తేతి త్రివిధఃకర్మసంగ్రహః॥

౧౬. ఒక్కొక్క కర్మకు, హేతుభూతమైన కారణములు పైనచెప్పినరీతిగా, అయిదు ఉండగా, ఎవ్వడైతే, కర్మకు తానేకర్తయని యెంచుచున్నాడో, వాడు, తెలివిగలవాడు కాచాలడు, అట్టి తెలివిలేనివాడు, ఆత్మతత్వము తెలియజాలడు.

౧౭. ఎవ్వడైతే, తాననే అహంకారముపొందక కర్మఫలమునందు ఆసక్తిలేకయున్నాడో, అట్టివాడు, ఈజనులనందరిని సంహరించినవాడైనా, వాడు చంపినవాడు కాచాలడు, వానికి, ఆకర్మఫలమున్ను అంటదు.

౧౮. కర్మోపదేశము మూడురూపములు గలిగి యున్నది. అవి యేవియనగా, జ్ఞానము, జ్ఞానమువలన తెలియదగిన విషయము, జ్ఞానము గలవాడు. కర్మయున్ను మూడురూపములుగలదియే. అవి యేవియనగా, కర్మకు కావలసినపదార్థములను సంపాదించుట కరణమనియు, చేయుట కర్మయనియు, చేయువాడుకర్తయనియు, మూడు రూపములైయున్నది.

౧౯. జ్ఞానంకర్మ చకర్తాచ త్రిధైవగుణభేదతః।
ప్రోచ్యతేగుణసంఖ్యానే యథావచ్ఛృణుతాన్యపి॥

౨౦. సర్వభూతేషుయేనైకం భావమవ్యయమీక్షతే।
అవిభక్తంవిభక్తేషు తజ్జ్ఞానంవిద్ధిసాత్త్వికమ్॥

౨౧. పృథక్త్వేనతు యత్ జ్ఞానం నానాభావాన్ పృథగ్వి
ధాన్।
వేత్తిసర్వేషుభూతేషు తజ్జ్ఞానంవిద్ధిరాజసమ్॥

౧౯. శాస్త్రములయందు, జ్ఞానమును, కర్మను, కర్తను, సత్వరజస్తమోగుణభేదములవల్ల, ఒక్కొకటిమూడుమూడు రూపములుగలదిగా, చెప్పియున్నది, వాటినిన్ని, సాంఖ్యశాస్త్రోక్తముగా వినుము.

౨౦. ప్రత్యేక స్వరూపములైన బ్రహ్మాదిపిపీలికాంత జంతువులయందును, స్థావరములయందును, అఖండమైనట్టిన్ని, నాశరహితమైనట్టిన్ని, ఏకమైన పరబ్రహ్మభావమును, జ్ఞానముచేత ఎవ్వడుచూచుచున్నాడో, అట్టివాని జ్ఞానము, సాత్వికజ్ఞానమని తెలిసికొనుము.

౨౧. సమస్తభూతములయందు, భేదభావముచేత, భిన్నప్రకారము లయినదిగానున్ను, నానాస్వరూపములయినదిగానున్ను, పరబ్రహ్మను, జ్ఞానముచేత ఎవ్వడు తెలిసికొనుచున్నాడో, అట్టివానిజ్ఞానము, రాజసజ్ఞానమని తెలిసికొనుము.

౨౨. యత్తుకృత్స్నవదేకస్మిన్కార్యే సక్తమహైతుకమ్।
అతత్త్వార్థవదల్పంచ తత్తామసముదాహృతమ్॥

౨౩. నియతంసంగరహిత మరాగద్వేషతఃకృతమ్।
అఫలప్రేప్సునాకర్మ యత్తత్సాత్త్వికముచ్యతే॥

౨౪. యత్తుకామేప్సునాకర్మ సాహంకారేణవాపునః।
క్రియతేబహులాయాసంతద్రాజసముదాహృతమ్॥

౨౫. అనుబంధంక్షయంహింసా మనపేక్ష్యచపౌరుషమ్।
మోహాదారభ్యతేకర్మ తత్తామసముదాహృతమ్॥

౨౨. జీవుని, దేహపరిమాణము గలవాడుగా నున్ను, ఈశ్వరుని దారుపాషాణమాత్ర పరిమాణము గలవాడు గానున్ను, తెలిసికొనుట, యుక్తిహీనమైనట్టిన్ని, యథార్థము గానిదైనట్టిన్ని, అల్పవిషయఫలము గలిగినట్టి తామసజ్ఞానమని, చెప్పబడుచున్నది.

౨౩. ఏకర్మ, శాస్త్రోక్తమైనదై, నిత్యమైనదై, సంగరహితమైనదై, ఫలకాంక్షలేనివానిచేత, రాగద్వేషములులేక చేయబడుచున్నదో, అట్టికర్మ, సత్వగుణప్రధానమైనదని చెప్పుదురు.

౨౪. ఎవ్వడైతే, కోరికలుగలిగి, అహంకారముతో గూడుకొని, అధికప్రయాసనిచ్చు కర్మలను చేయుచున్నాడో, అట్టివాడుచేయుకర్మ, రాజస ప్రధానమైనదని చెప్పబడుచున్నది.

౨౫. అహంకారముతో గూడుకొని సంపద రాబోయ్యెడి శుభాశుభంబులను, నాశమును, పరులకు గలుగు హింసయును, నెరవేర్చుటకు తనకుగలశక్తిని, ఆలోచించక, అజ్ఞానమువల్ల చేయబడినకర్మ, తామసప్రధానమైన కర్మయని చెప్పబడును.

౨౬. ముక్తసంగోనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః।
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తాసాత్త్వికఉచ్యతే॥

౨౭. రాగీకర్మఫలప్రేప్సు ర్లుబ్ధోహింసాత్మకోశుచిః।
హర్షశోకాన్వితఃకర్తా రాజసఃపరికీర్తితః॥

౨౮. అయుక్తఃప్రాకృతస్స్తబ్ధ శ్శఠోనైష్కృతికోలసః।
విషాదీదీర్ఘసూత్రీచ కర్తాతామసఉచ్యతే॥

౨౯. బుద్ధేర్భేదంధృతేశ్చైవ గుణతస్త్రివిధంశ్శృణు।
ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేనధనంజయ॥

౨౬. దారాపత్యాదులయిన విషయములయందు అనురాగములేక, అహంకార రహితుడై, ధైర్యఉత్సాహములతోగూడి, సిద్ధి అసిద్ధులయందు లక్ష్యము లేకయుండుకర్త, సాత్వికుడని చెప్పబడును.

౨౭. అనురాగముతోటి కర్మఫలమును పొందనిచ్ఛయించి, ద్రవ్యకాంక్షగలిగి, పరులకు హింసచేయు స్వభావముతోగూడుకొని, ఆచారములేనివాడై, దుఃఖసంతోషములకు లోబడినకర్త, రాజసుడని చెప్పబడును.

౨౮. మనోనిగ్రహములేక, బుద్ధిహీనుడై, స్తబ్ధుడై, మాయావియై, పరులకు అవమానముచేయు స్వభావముగలిగి, మందుడై, దుఃఖశీలుడై, ఆలస్యముతోటి కర్మను చేయుకర్త, తామసుడని చెప్పబడును.

౨౯. ఓయి ధనంజయ, బుద్ధిన్ని, ధైర్యమున్ను, గుణభేదమువల్ల మూడుమూడు విధములై యున్నయవి, వాటిని నిస్సంశయముగా వేర్వేరుపరచి, నీకు చెప్పెదను వినుము.

30. ప్రవృత్తించనివృత్తించ కార్యాకార్యేభయాభయే।
బంధంమోక్షంచయావేత్తి బుద్ధిస్సాపార్థసాత్త్వికీ॥

3౧. యయాధర్మమధర్మంచ కార్యంచాకార్యమేవచ।
అయథావత్ప్రజానాతి బుద్ధిస్సాపార్థరాజసీ॥

3౨. అధర్మంధర్మమితియా మన్యతేతమసావృతా।
సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధిస్సాపార్థతామసీ॥

33. ధృత్యాయ యాధారయతే మనఃప్రాణేంద్రియ
యాః।
యోగేనావ్యభిచారిణ్యా ధృతిస్సాపార్థసాత్త్వికీ॥

౩౦. ఓయిపార్థ, కర్మమార్గమును, మోక్షమార్గమును, కర్తవ్యాకర్తవ్యములను, భయాభయములను, బంధమోక్షములను, ఏబుద్ధి తెలియుచున్నదో, ఆబుద్ధి, సత్వగుణమువలన గలిగినదని, తెలిసికొనుము.

౩౧. ఓయి అర్జున, ధర్మాధర్మ విచారముయొక్కయున్ను, కార్యాకార్యముల యొక్కయున్ను, యథార్థమును తెలియనేరని బుద్ధి, రజోగుణమువల్ల గలిగినదని తెలియుము.

౩౨. ఓయిపార్థ, అజ్ఞానముచేత కప్పబడి, నిషిద్ధధర్మములను శాస్త్రీయములైనవియనిన్ని, సమస్తపదార్థములను వ్యత్యస్తములుగానున్ను, తలచేబుద్ధి, తామసగుణమువల్ల గలిగినదని తెలిసికొనుము.

౩౩. ఓయిపార్థ, ఎవ్వఁడైతే, మనస్సుయొక్కయున్ను, ప్రాణములయొక్కయున్ను, ఇంద్రియములయొక్కయున్ను, వ్యాపారములను, దృఢమైన యోగముతో నియమింపుచున్నాఁడో, అట్టివానిధైర్యము, సాత్వికధైర్య మనఁబడును.

౩౪. యయాతు ధర్మకామార్థాన్ ధృత్యాధారయతేర్జున।
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిస్సాపార్థరాజసీ॥

౩౫. యయాస్వప్నం భయంశోకం విషాదంమదమేవచ।
నవిముంచతిదుర్మేధా ధృతిస్సాపార్థతామసీ॥

౩౬. సుఖంత్విదానీంత్రివిధం శృణుమేభరతర్షభ।
అభ్యాసాద్రమతేయత్ర దుఃఖాంతంచనిగచ్ఛతి॥

౩౭. యత్తదగ్రేవిషమివ పరిణామేమృతోపమమ్।
తత్సుఖం సాత్వికంప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజమ్॥

౩౪. ఓయి అర్జున, ఎవ్వడైతే ఫలకాంక్షగలిగి, ఆసక్తితో ధర్మార్థకామములను ఎడతెగక కోరుచున్నాడో అట్టివానిధైర్యము, రాజసధైర్యమని చెప్పబడుచున్నది.

౩౫. ఓయిపార్థ, కుత్సితబుద్ధిగలపురుషుడు, ఏధైర్యముచేత, నిద్రను, భయమును, దుఃఖమును, దిగులును, మదమును, విడువడో, అట్టిధైర్యము, తామసధైర్యమని తెలిసికొనుము.

౩౬, ౩౭. ఓయిఅర్జున, సుఖమున్ను, గుణసంబంధముగలిగి, మూడువిధములుగా నున్నయది, వాటిని వివరించుచున్నాను వినుము. ఏసుఖానుభవమునందు అభ్యాసమువలన క్రీడించుచున్నాడో, ఏసుఖము దుఃఖనాశము గలుగచేయునో, ఏసుఖము ప్రారంభమునందు విషమువలెనుండి, అంతములో అమృతతుల్యముగానుండునో, . అట్టి తనబుద్ధి నైర్మల్యమువలన పుట్టినసుఖము, సాత్వికసుఖమని చెప్పబడును.

౩౮. విషయేంద్రియసంయోగా ద్యత్తదగ్రే ఽమృతోప
మమ్।
పరిణామేవిషమివ తత్సుఖంరాజసంస్మృతమ్॥

౩౯. యదగ్రేచానుబంధేచ సుఖంమోహనమాత్మనః।
నిద్రాలస్యప్రమాదోత్థంతత్తామసముదాహృతమ్॥

౪౦. నతదస్తిపృథివ్యాంవా దివిదేవేషువాపునః।
సత్వంప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః॥

౪౧. బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాంచపరంతప।
కర్మాణిప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః॥

౩౮ విషయేంద్రియ సంబంధమువలన గలిగి, మొదట అమృతముగా నున్న, కడపట విషముగానున్న, ఉండుసుఖము, రాజససుఖమని చెప్పబడును.

౩౯. నిద్రవల్లను, ఆలస్యమువల్లను, ఎచ్చరిక లేమిడి వల్లను, గలుగు సుఖము, పారంభములోను, అంత్యములోను, ఆత్మకు భ్రాంతిపుట్టించును. అట్టిసుఖము, తామస సుఖమని వక్కాణింతురు

౪౦ ప్రకృతివలన బుట్టిన యీ సత్వరజస్తమోగుణములకు లోబడనిప్రాణి, మనుష్య లోకములోగాని, దేవ లోకములోగాని, పాతాళలోకములోగాని, లేదు.

౪౧. ఓయి అర్జున, బ్రహ్మ, క్షత్రియ, వైశ్య,శూద్ర జాతులకు, శాస్త్రోక్తమైన కర్మలు, వారివారి ప్రకృతి వలన బుట్టిన సత్వరజస్తమోగుణములను అనుసరించి, ఏర్పరచబడియున్నవి.

౪౨. శమోదమ స్తపశ్శౌచం క్షాంతిరార్జవమేవచ।
జ్ఞానంవిజ్ఞానమా స్తిక్యం బ్రాహ్మంకర్మస్వభావజమ్॥

౪౩. శౌర్యంతేజో ధృతిర్దాక్ష్యం యుద్ధేచాప్య పలాయ
నమ్।
దానమీశ్వరభావశ్చ క్షాత్రంకర్మస్వభావజమ్॥

౪౪. కృషిగోరక్ష్యవాణిజ్యం వైశ్యంకర్మస్వభావజమ్।
పరిచర్యాత్మకంకర్మ శూద్రస్యాపిస్వభావజమ్॥

౪౫. స్వేస్వేకర్మణ్యభిరత స్సంసిద్ధింలభతేనరః।
స్వకర్మనిరతస్సిద్ధిం యథావిందతితచ్ఛృణు॥

౪౨. అంతరింద్రియ నిగ్రహము, బహిరింద్రియనిగ్రహము, తపస్సు, శుచిత్వము, ఓర్పు, నిర్వక్రత్వము, శాస్త్రీయజ్ఞానము, అనుభవజ్ఞానము, ఈశ్వరుడు కలడని నమ్మిక, ఇవి అన్నియు, బ్రాహ్మణులకు, స్వభావమువలనబుట్టిన కర్మలుగానున్నవి.

౪౩. శూరత్వము, తేజస్సు, ధైర్యము, సామర్థ్యము, యుద్ధమునందు పారిపోవకయుండుట, దానము, ప్రభుత్వము, ఇవి, క్షత్రియులకు, స్వభావమువలనబుట్టిన కర్మలుగా తెలిసికొనుము.

౪౪. భూమినిదున్నుట, గోసంరక్షణ చేయుట, వ్యాపారము చేయుట, వైశ్యులకు, స్వభావమువలన బుట్టిన కర్మలుగానున్నవి. సేవచేయుట, శూద్రులకు, స్వభావమువలనబుట్టిన కర్మగానున్నది.

౪౫. మానవులు, తమతమ జాతిధర్మములైన కర్మలయందు ఆసక్తి గలవారై, ఏప్రకారము సిద్ధిని పొందుచున్నారో, ఆ క్రమమును తెలియ చెప్పుచున్నాను వినుము.

౪౬. యతఃప్రవృత్తిర్భూతానాం యేనసర్వమిదంతతమ్।
స్వకర్మణాతమభ్యర్చ్య సిద్ధింవిందతిమానవః॥

౪౭. శ్రేయాన్స్వధర్మోవిగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।
స్వభావనియతంకర్మ కుర్వన్నాప్నోతికిల్బిషమ్॥

౪౮. సహజంకర్మకౌంతేయ సదోషమపినత్యజేత్।
సర్వారంభాహిదోషేణ ధూమేనాగ్నిరివావృతాః॥

౪౯. అసక్తబుద్ధిస్సర్వత్ర జితాత్మా విగతస్పృహః।
నైష్కర్మ్యసిద్ధింపరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి॥

౪౬. ఏ ఈశ్వరునివల్ల సమస్త జగత్తులు పుట్టుచున్నవో, ఎవ్వనివల్ల ఈసమస్తజగత్తులు వ్యాపింపబడియున్నవో, అట్టియీశ్వరుని, మానవులు, తమతమ స్వకీయకర్మానుష్ఠానములచేత పూజించి, సిద్ధిని పొందుచున్నారు.

౪౭. తమకులధర్మములు, కించిద్గుణము గలవైనను, విశేష గుణము గలిగి చక్కగా అనుష్ఠింపబడిన పరధర్మములకంటె శ్రేష్ఠమైనవని, తెలిసికొనుము, తమ తమ కులధర్మములను ఆచరించు జనులను, పాపములు చెందవు.

౪౮. ఓయి కౌంతేయ, దోషయుక్తమైనను, స్వభావజన్యమైన కులధర్మములను విడువకూడదు. ఎందువల్ల ననగా, అగ్నిని పొగకప్పినరీతిగా, సమస్తకర్మలను దోషము చుట్టుకొనియున్నది.

౪౯. ఎవ్వడైతే, సమస్త ప్రపంచమునందు ఆశవిడిచి, మనస్సును స్వాధీనము చేసికొని, సకల ఆశలువదలి, కర్మఫలత్యాగము చేయుచున్నాడో, అట్టివాడు, ఉత్కృష్టమైన నైష్కర్మ్యసిద్ధిని పొందుచున్నాడు.

౫౦. సిద్ధింప్రాప్తోయథాబ్రహ్మ తథాప్నోతినిబోధమే।
సమాసేనైవకౌంతేయ నిష్ఠాజ్ఞానస్యయాపరా॥

౫౧. బుద్ధ్యావిశుద్ధయాయుక్తో ధృత్యాత్మానంనియమ్యచ।
శబ్దాదీన్విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌవ్యుదస్యచ॥

౫౨. వివిక్తసేవీలఘ్వాశీ యతవాక్కాయ మానసః।
ధ్యానయోగపరోనిత్యం వైరాగ్యంసముపాశ్రితః॥

౫౩. అహంకారంబలదర్పం కామంక్రోధంపరిగ్రహమ్।
విముచ్యనిర్మమశ్శాంతో బ్రహ్మభూయాయకల్పతే॥

౫౦. ఓయికౌంతేయ, నైష్కర్మ్యసిద్ధిని పొందినవెనుక, పరబ్రహ్మను పొందుటకు మార్గమైన పరమోత్కృష్ట జ్ఞాననిష్ఠను నీకుసంక్షేపముగా తెలియచెప్పెదను, వినుము.

౫౧. మాయారహితమైన బుద్ధిని చేకొని, ధైర్యముతో మనస్సును నియమములో నిలిపి, శబ్దస్పర్శరూపరసగంధవిషయములనుపారద్రోచి, రాగద్వేషములను, విడువవలయును.

౫౨, ౫౩. ఇంతేగాదు, రహస్యస్థలమునందు వాసముగలవాడై, మితభోజనముచేయుచు, వాక్కును, మనస్సును, దేహమును నియమములో నిలిపి, ఎల్లప్పుడు ధ్యానయోగమునందు ఆసక్తుడై, వైరాగ్యమును పొంది, అహంకారమును, సామర్థ్యమును, దర్పమును, కామమును, క్రోధమును, గృహదారాదులయందు ఆసక్తిని, మమకారమును, దురాగ్రహమును విడిచియుండు జ్ఞాననిష్ఠుడు, పరబ్రహ్మభావమును పొందుటకు, సమర్థుడు అగుచున్నాడు.

౫౪. బ్రహ్మభూతః ప్రసన్నాత్మా నశోచతిన కాంక్షతి।
సమస్సర్వేషుభూతేషు మద్భక్తింలభతేపరామ్॥

౫౫. భక్త్యామామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వ
తః।
తతోమాంతత్త్వతోజ్ఞాత్వా విశతేతదనంతరమ్॥

౫౬. సర్వకర్మాణ్యపిసదా కుర్వాణో మద్వ్యపాశ్రయః।
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతంపదమవ్యయమ్॥

౫౭. చేతసాసర్వకర్మాణి మయిసన్న్యస్యమత్పరః
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తస్సతతంభవ॥

౫౪. బ్రహ్మనిష్ఠుడైనవాడు, నిర్మలమైన మనస్సుగలవాడై, నష్టమైనవస్తువులకు దుఃఖింపక, రానివస్తువులను కోరక, సమస్తప్రాణులయందు, సమదృష్టికలిగి, పరమోత్కృష్టుడనైన నాయందు భక్తిచేయుచుండును.

౫౫. సర్వవ్యాపిగానున్ను, సచ్చిదానంద విగ్రహుడుగానున్ను, ఉండేనన్ను, పరమభక్తిచేత తెలిసికొనినవాడు. అట్టి జ్ఞానపరిసమాప్తి కాలమునందు, నన్నే పొందుచున్నాడు.

౫౬. నన్నే ప్రాప్యస్థానముగా నెంచి, వేదోక్తమైన సమస్త నిత్యనైమిత్తిక కర్మలను చేయువాడు, నాయనుగ్రహము వలన, నాశరహితమైన మోక్షమును, పొందుచున్నాడు.

౫౭. గనుక, నీవు బుద్ధియోగముచేత, సకలకర్మ ఫలములను నాకు సమర్పణముచేసి, నన్నే ఉత్కృష్టగతియని నమ్మి, బుద్ధియోగముచేత, సమస్తకాలములయందు, నాయందే మనస్సుగలవాడవై యుండుము.

౫౮. మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి।
అథచేత్త్వమహంకారాన్న శ్రోష్యసివినఙ్క్ష్యసి॥

౫౯. యద్యహంకారమాశ్రిత్య నయోత్స్య ఇతిమన్యసే।
మిథ్యైషవ్యవసాయస్తే ప్రకృతిస్త్వాంనియోక్ష్యతి॥

౬౦. స్వభావజేనకౌంతేయ నిబద్ధస్స్వేనకర్మణా।
కర్తుంనేచ్ఛసియన్మోహాత్ కరిష్యస్యవశోపితత్॥

౬౧. ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జునతిష్ఠతి।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢానిమా
యయా॥

౫౮. నాయందు, నీకు మనస్సు లయించినట్టులైతే, నా అనుగ్రహమువలన, సమస్తదుఃఖములు నీకు తొలగి పోవును, లేక, అహంకారమునుపొంది, నా వాక్యములను వినకపోయితివేని, నీవు నశించిపోదువు.

౫౯. నీవు అహంకారమునుపొంది, యుద్ధము ఎంత మాత్రము చేయనని నిశ్చయించితివేని, అట్టి నీ నిశ్చయము వ్యర్థమైపోవును, నీ ప్రకృతి సంభవగుణములు, నీచేత యుద్ధము చేయించును.

౬౦. ఓయి కౌంతేయ, స్వభావజన్య గుణములకు లోబడిన నీవు, ఎట్టి కర్మ చేయకూడదని, అవివేకము చేత నిశ్చయించుచున్నావో, అట్టి కర్మను, నీకు తెలియకనే, నీ స్వభావగుణము, నిన్ను పరవశునిజేసి, నీచేత చేయించును.

౬౧. ఓయి అర్జున, సమస్తభూతములకు నియామకుడైన ఈశ్వరుడు, సకలప్రాణుల హృదయముల యందున్నవాడై, యంత్రగాడు బొమ్మలను ఆడించురీతిగా, మాయచేత ప్రాణులను భ్రమింప చేయుచున్నాడు.

౬౨. తమేవశరణంగచ్ఛ సర్వభావేనభారత।
తత్ప్రసాదాత్పరాంశాంతిం స్థానంప్రాప్స్యసి శా
శ్వతమ్॥

౬౩. ఇతితేజ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరంమయా।
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసితథాకురు॥

౬౪. సర్వగుహ్యతమంభూయ శ్రృణుమేపరమంవచః।
ఇష్టోసిమేదృఢమితి తతోవక్ష్యామితేహితమ్॥

౬౫. మన్మనాభవమద్భక్తో మద్యాజీమాంనమస్కురు।
మామేవైష్యసిసత్యంతే ప్రతిజానేప్రియోసిమే॥

౬౨. ఓయి అర్జున, పైనచెప్పిన ఈశ్వరునే, సర్వభావములయందును శరణుపొందుము, ఆ యీశ్వరానుగ్రహము వలన, ఉత్కృష్టమైన చిత్తశాంతిగలిగి, నిత్యమైన మోక్షమును చెందగలవు.

౬౩. ఈప్రకారము నీకొరకు, రహస్యములలో పరమరహస్యమైన జ్ఞానమును, తెలియజెప్పితిని, దానిని వివరముగా యోచించి, నీయిష్టప్రకారము చేయుము.

౬౪. నీవు నాకుపరమప్రియుడవు గనుక, నీక్షేమము కొరకై, మరియొక పరమరహస్యమైన ఉత్కృష్టవాక్యమును చెప్పుచున్నాను, వినుము.

౬౫. నాయందు నీమనస్సును నిలుపుము, నాయందు భక్తినిలుపుము, నన్ను పూజింపుము, నాకు నమస్కారములు చేయుము, అట్లుచేసితివేని, నీవు మోక్షమును చెందగలవు, నీవు నాకు ప్రియుడవు, నీకు సత్యమును తెలియ చేసితినని ప్రతిజ్ఞ చేయుచున్నాను.

౬౬. సర్వధర్మాన్పరిత్యజ్య మామేకంశరణంవ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా
శుచః॥

౬౭. ఇదంతేనాతపస్కాయ నాభక్తాయకదాచన।
నచాశుశ్రూషవేవాచ్యం నచమాం యోఽభ్యసూ
యతి॥

౬౮. యఇదంపరమంగుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి।
భక్తింమయిపరాంకృత్వా మామేవైష్యత్య సంశ
యః॥

౬౯. నచతస్మాన్మనుష్యేషు కశ్చిన్మేప్రియకృత్తమః।
భవితానచమేతస్మా దన్యఃప్రియతరోభువి॥

౬౬. నీవు సమస్తకర్మఫలములను నాకు అర్పణము చేసి, అన్యదేవతాభజనంబుమాని, నన్ను ఒక్కనినే శరణుపొందుము. నిన్ను సమస్తపాపములలోనుంచి విముక్తిని చేయుచున్నాను, నీవు దుఃఖింపకుము.

౬౭. నీకు జ్ఞానముగలుగుటకై, నేనుచెప్పిన ఈగీతాశాస్త్రమును, తపస్సుచేయనివానికిని, భక్తిలేనివానికిని, శ్రద్ధలేనివానికిని, నాయందు అసూయపరునకును, ఉపదేశింపదగినదికాదు.

౬౮. ఎవ్వడైతే, పరమోత్కృష్టమై, పరమరహస్యమైన ఈగీతశాస్త్రమును, నాభక్తులకు ఉపదేశముచేయుచున్నాడో, వాడు, నాయందు పరమభక్తినిచేసి, నాస్థానమైన మోక్షమును చెందగలడు.

౬౯ అట్లు ఉపదేశము చేయువానికంటే, మనుష్యులలో నాకు పరమప్రియముచేయువాడు, వేరొకడు లేడు భవిష్యత్కాలములోనున్ను, వానికంటే ప్రియుడు భూలోకమునందు, నాకు గలుగడు.

౭౦. అధ్యేష్యతేచయఇమం ధర్మ్యంసంవాదమావయోః।
జ్ఞానయజ్ఞేన తేనాహ మిష్టస్స్యామితి మేమతిః॥

౭౧. శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపియోనరః।
సోఽపిముక్తశ్శుభాఀ ల్లోకాఀ ప్రాప్నుయాత్ పుణ్య
కర్మణామ్॥

౭౨. కచ్చిదేతచ్ఛ్రుతంపార్థ త్వయైకాగ్రేణచేతసా।
కచ్చిదజ్ఞానసంమోహః ప్రణష్టస్తేధనంజయ॥

---

అర్జున ఉవాచ.

౭౩. నష్టోమోహస్స్మృతిర్లబ్ధాత్వత్ప్రసాదాన్మయాచ్యుత।
స్థితోఽస్మి గతసందేహః కరిష్యేవచనంతవ॥

౭౦. మనసంవాదరూపమైన ఈ మహాత్తైన గీతాశాస్త్రమును, ఎవ్వఁడై తే ప్రతిదినమునందు పారాయణము చేయుచున్నాఁడో, అట్టివాఁడు, జ్ఞానయోగముచేత, నన్ను పూజించినవాఁడని, నా అభిప్రాయము.

౭౧. ఎవ్వఁడైతే అసూయలేక, భక్తిశ్రద్ధలతో, ఈగీతాశాస్త్రమును వినుచున్నాఁడో, అట్టిపురుషుఁడున్ను, పాపములు నశింపచేసికొనినవాఁడై, పుణ్యకర్మలుగల పురుషులయొక్క మహాత్తైనలోకమును, పొందుచున్నాఁడు.

౭౨. ఓయి ధనంజయ, నాచేత చెప్పఁబడిన పరమగోప్యముగు ఈ గీతాశాస్త్రమును ఏకాగ్రచిత్తుఁడవై, చక్కఁగా నీవు వింటివాయేమి, నీ అజ్ఞానజన్యమైన అవివేకము, తొలంగిపోయినదా యేమి, నాకు చెప్పుము.

---

అర్జున వాక్యము.

౭౩. ఓయి అచ్యుత, నీ అనుగ్రహమువలన, నా అవివేకము తొలంగిపోయెను, జ్ఞానము లబ్ధమాయెను, సందేహము నివర్తించెను. నీ ఆజ్ఞను, శిరసావహించుటకు, సిద్ధముగా నున్నాను.

సంజయఉవాచ.

౭౪. ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః।
సంవాదమిమమశ్రౌష మద్భుతంరోమహర్షణమ్॥

౭౫. వ్యాసప్రసాదాచ్ఛ్రుతవా నేతద్గుహ్యతమంపరమ్।
యోగంయోగే శ్వరాత్కృష్ణా త్సాక్షాత్కథయత
స్స్వయమ్॥

౭౬. రాజన్ సంస్మృత్యసంస్మృత్య సంవాదమిమమద్భుతమ్।
కేశవార్జునయోఃపుణ్యం హృష్యామిచ ముహుర్ము
హుః॥

౭౭. తచ్చసంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతంహ
రేః।
విస్మయోమేమహాన్ రాజన్ హృష్యామిచపునఃపునః

సంజయునివాక్యము,

౭౪. ఓయి ధృతరాష్ట్రమహారాజ, అద్భుతమైనట్టి యు, పులకాంకురముగలుగచేయునట్టియు, కృష్ణార్జునుల సంవాదరూపమైన గీతాశాస్త్రమును నేనువింటిని.

౭౫. యోగ యోగీశ్వరుండగు శ్రీకృష్ణులు, సాక్షాత్కారముగా చెప్పిన, పరమోత్కృష్టమైన ఈ గోప్య యోగశాస్త్రమును, శ్రీవేదవ్యాసుల అనుగ్రహమువలన, నేను వింటిని.

౭౬. ఓయి ధృతరాష్ట్రమహారాజ, అద్భుతమైనట్టి యు, పవిత్రమైనట్టియు, కృష్ణార్జునుల ఈసంవాదమును తలచి తలచి, మాటిమాటికి ఉప్పొంగుచున్నాను.

౭౭. ఓయి ధృతరాష్ట్ర మహారాజ, శ్రీకృష్ణులయొక్క అద్భుతమైన విశ్వరూపమును, లెస్సగా ధ్యానము చేయగ చేయగా,నాకు అధిక ఆశ్చర్యము తోచి తోచి, మాటిమాటికిని, దేహము పులకాంకితమగుచున్నది.

౭౮. యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః।
తత్ర శ్రీర్విజయో భూతి ర్ధ్రువా నీతిర్మతిర్మమ॥



ఇతి శ్రీమహాభారతే శతసహస్రికాయాం సంహి

తాయాం వైయాసిక్యాం శ్రీభీష్మపర్వణి

శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మ

విద్యాయాం యోగశాస్త్రే

శ్రీకృష్ణార్జునసంవాదే

మోక్షసన్న్యాస యోగో నామ

అష్టాదశో ధ్యాయః.



శ్రీకృష్ణార్పణమస్తు.



౭౮. ఎచ్చటనైతే, యోగయోగీశ్వరుడైన శ్రీకృష్ణుడు, ధనుర్ధరుడైన అర్జునుడున్ను, ఉన్నారో, అచ్చట, సంపద, జయము, ఐశ్వర్యము, స్థిరమైననీతి, ఉన్నవని నా యభిప్రాయము.



౧ లక్షసంఖ్య గ్రంథముగల శ్రీమహాభారతములో
భీష్మపర్వమందు, ఉపనిషద్రూపమైనట్టియు
పరబ్రహ్మవిద్యయైనట్టి భగవద్గీతలనెడు
శ్రీకృష్ణార్జున సంవాదరూపమైన
యోగశాస్త్రమునందు
మోక్షసన్న్యాసయోగమను
పదియెనిమిదవ అధ్యాయము ముగిసెను.

శ్రీకృష్ణార్పణమస్తు.

తత్ సత్

# శుద్ధాశుద్ధములు.

| పుట సంఖ్య | శ్లోక సంఖ్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౪ | ౬ | శృతమ్ | శ్రుతమ్ |
| ౯ | ౧౫ ౧౬ | మృదిపొందిన | మృతిపొందిన |
| ౧౩ | ౨౩ | పారాయణాంతతము | పారాయణాంతము |
| ౨ | | గీతాశాస్రి | గీతాశాస్త్ర |
| ౭ | ౧౫ | ధధ్మౌ | దధ్మౌ |
| ౭ | ౧౫ | శంఖముసు | శంఖమును |
| ౧౦ | ౧౮ | పృధక్పృధక్ | పృథక్పృథక్ |
| ౧౨ | ౧౯ | పృధివీం | పృథివీం |
| ౧౦ | ౨౦౪ | అధ | అథ |
| ౧౧ | ౨౦౪ | నిలిచియుస్న | నిలిచియున్న |
| ౧౮ | ౩౭ | సుఖినస్స్వామ | సుఖినస్స్యామ |
| ౨౩ | ౪౬ | ఆది | అది |
| ౫౦ | ౩౭ | సుఖినః | సుఖినః |
| ౫౮ | ౬౬ | కుతుస్సుఖం | కుతస్సుఖం |
| ౧౮ | ౧౯ | స్స్వర్గో | స్వర్గో |

# శుద్ధాశుద్ధములు.

| పుటసంఖ్య | శ్లోకసంఖ్య. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౨౧ | ౨౨ | ధుఃఖాఆస్పధము | ధుఃఖాఆస్పదము |
| ౧౨౯ | ౪ | స్పర్శ | స్పర్శ |
| ౨౦౬ | ౨ | మహర్షీనాం | మహర్షీణాం |
| ౨౩౬ | ౨౧ | సురనంఘా | సురసంఘా [వ |
| ౨౪౮ | ౩౭ | అనంత దేవేశ గన్నివాస | అనంతదేవేశ జగన్ని |
| ౨౫౯ | ౫౪ | ఇతరాశ క్తిలేక | ఇతరాస క్తిలేక |
| ౨౬౩ | ౧ | యోగిశ్రేష్ఠులు | యో[illegible]శ్రేష్ఠులు |
| ౨౮౦ | ౧౨ | అధ్యాత్మ | అధ్యాత్మ |
| ౨౯౮ | ౭ | సంగముద్భవమ్ | సంగసముద్భవమ్ |
| ౩౨౫ | | యోగశాస్త్ర | యోగశాస్త్ర |
| ౩౩౨ | ౧౦ | శుచిప్రతాః | శుచివ్రితాః |
| ౩౩౬ | ౧౯ | మ్యజస్పృ | మ్యజస్రి |
| ౩౩౭ | ౧౯ | సహింవక | సహింప |
| ౩౩౮ | ౨౩ | ననుఖం | సుసుఖం |
| ౩౪౮ | ౧౦ | మేధ్యం | మేధ్యం |